# భారతామృత రసము

## రాజసూయము












కాఘూరి వ్యాసమూర్తి,
గ్రంథకర్త.

# పీఠిక

రామాయణ భారతములు, తిక్కన భారతము విమర్శించి గ్రంథములు ముద్రించుచున్నాను. సభాపర్వమును విమర్శించి రెండు గ్రంథములు రచించినాను.

1. రాజసూయము, 2. ద్యూతము. రెండు గ్రంథములు ముద్రింపఁబడుచున్నవి.

శ్రీ రాజా J. రామేశ్వరరావుగారు, M. P., Managing Trustee, శ్రీ రాజా కృష్ణదేవరాయ ట్రష్టి, వనపర్తి. నా కృషిని ప్రోత్సహించుచు "రాజసూయము" అను నీ గ్రంథము ముద్రించుటకు పై ట్రష్టినుండి రూ. 1000 లు శ్యాంక్షను చేసినారు. అందువలన నీ గ్రంథము ముద్రణమైనది శ్రీ రాజావారికి మిగుల కృతజ్ఞుఁడను.

ఈ ప్రయోజనము లభింపజేయుటకు అనుసంధానముఁగావించి అచిర కాలమున ద్రవ్యము లభించునట్లు శ్రీ పెమ్మరాజు వెంకటరావు (విజయనగర కాలనీ, హైదరాబాదు) కృషి చేసినారు. వెంకటరావుగారికి మిగుల కృతజ్ఞుఁడను. అచ్చుట జగన్నాథరావు, జ్యోతిష్కులు వీరికి ఈ విషయముగా కృతజ్ఞతను దెల్పుచున్నాను.

ఆంధ్రప్రదేశ గవర్నమెంటు కొన్ని గ్రంథములు ముద్రించుటకు నాకు రూ. 2500 లు ఇచ్చినది. కృష్ణ రాయబారము ముద్రించినాను. రాజసూయము ద్యూతము మొదలగు గ్రంథములు ముద్రించుచున్నాను.

శ్రీ Y. సీతారామ శర్మగారు, M. A., Headmaster, Nehru M. H. School, ఆదవాని—వీరు శ్రమతీసికొని ఈ గ్రంథమును ముద్రించుచున్నారు. గ్రంథ ముద్రణము భారమంతయు వారే వహించి నాకీ యుపకారము గావించినారు. వారు సునిశితమైన విమర్శనము గావించువారు. విద్వత్పరిశ్రమ యందలి వ్యవసాయమును చక్కగా గ్రహింపగల దక్షులు, ఆస్తికులు, సనాతనాచారపరులు. వారికి మిగుల కృతజ్ఞుడను.

ఈ గ్రంథములోని ముద్రణాస్ఖాలిత్యములను పరిహరించి, తప్పులు లేకుండ, శ్రమకోర్చి, నిర్వ్యాజముగ ప్రూఫులను దిద్ది, గ్రంథమును పరిశుద్ధముగ నచ్చొత్తించిన బళ్ళారి మునిసిపల్ హైయర్ సెకండరీ స్కూలు ఆంధ్ర పండితులు బ్రహ్మశ్రీ విద్వాన్ A. K. అనంతపద్మనాభశాస్త్రుల్లు వారికి నా వినయపూర్వక కృతజ్ఞతాంజలులు.

---

Central and State Governments నాకు నెలకు 75 రూ. లు Allowance ను ఇచ్చుచున్నవి.

| | | |
|---|---|---|
| 1 | తిక్కన కళా సామ్రాజ్యము — అజ్ఞాత వాసము, కీచక వధ | 2_50 |
| 2 | తిక్కన కళా సామ్రాజ్యము — సంజయ రాయబారము | 2_75 |
| 3 | తిక్కన కళా సామ్రాజ్యము — కృష్ణ రాయబారము | 2_75 |
| 4 | భారతామృత రసము — రాజసూయము | 3_00 |
| 5 | భారతామృత రసము — ద్యూతము | 3_00 |
| 6 | భారతామృత రసము — అజ్ఞాతవాసము, కీచక వధ | 2_75 |
| 7 | భారతామృత రసము — గోహరణము | 3_00 |
| 8 | రామ రాజ్యము — కుశలవులు | 2_50 |
| 9 | గౌతమాశ్రమము — అహల్య | 2_50 |
| 10 | మహాభారత తాత్పర్య నిర్ణయము — రామాయణము | 3_00 |

నన్ను పలువిధముల ప్రోత్సహించుచున్న గవర్నమెంటుకు, ప్ర విద్యా సంస్థలకు, సంస్థలకు, వ్యక్తులకు కృతజ్ఞుడను.

విజయనగరము. [illegible] వ్యాసమూర్తి,

[illegible] గ్రంథకర్త.

1941

# భారతామృతరసము

## రాజసూయము

### మయుని కృతజ్ఞత

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయే ॥ సభా ౧-౧

తతోఽబ్రవీ న్మయః పార్థం వాసుదేవస్య సన్నిధౌ ।
ప్రాంజలిః శ్లక్ష్ణయా వాచా పూజయిత్వా పునఃపునః ॥ ౨

అస్మా త్కృష్ణా త్సుసంరబ్ధా త్పావకాచ్చ దిధక్షతః ।
త్వయా త్రాతోఽస్మి కౌంతేయ! బ్రూహి కిం కరవాణి తే ॥ 3,

(పిమ్మట మయుఁడు వాసుదేవుని సన్నిధిలో ప్రాంజలియై శ్లక్ష్ణ వచనమున మరల మరల పూజించి యిట్లు పలికెను. సుసంరబ్ధుఁడగు శ్రీకృష్ణునినుండియు, దహింపనున్న పావకునినుండియు నీచేత రక్షింపఁబడితిని. కౌంతేయుఁడా! నేనేమి చేయవలెనో పలుకవలసినది అని పలికెను.)

ఖాండవవనము నగ్నిహోత్రుఁడు దహించునపుడు మయుని నర్జునుఁడు రక్షించెను. కృతజ్ఞుఁడగుచు మయుఁడర్జునుని మరలమరలఁ బూజించి కర్తవ్యమును వేడెను. కృష్ణుఁడు సుసంరబ్ధుఁడుగ నుండఁగ

నగ్నిహోత్రుడు కాల్పనుండగా మయుఁ డర్జునునిచే రక్షింపఁబడెను. 'కృష్ణుఁడు సంరబ్ధుడుగా నుండగా'' అని పలుకనున్న మయుఁడామాట పలుకుటకు ముందుగా వాసుదేవుని సన్నిధినిఁబొందినాఁడు. ఇది మయుని తత్కాలవిహితకృత్యమును పోషించుచున్నది.

౧ నీవు నన్ను రక్షించితివి.

౨ నీచే నేను రక్షింపబడితిని.

మయుఁడు మొదటిమాట కాక రెండవ మాటగాఁ దనమాటఁ గల్గించినాఁడు 'నీవు నన్ను రక్షించితివి' అని పల్కిన నర్జునుని విహితకృత్యమది యని ప్రతిఫలింపగలదు. (కాలిపోవనున్న వ్యక్తిని జూచి యాతని ముక నాలకించి యర్జునుడు తన విహితము నప్పుడు తానాచరించినాఁడు'. అనువైపుగాఁగూడ నీమాట యర్థమును స్ఫురింపఁ జేయును. అట్లు పలుకక మయుఁడు "నీచే నేను రక్షింపఁబడితిని'' (త్వయా త్రాతోఽస్మి కౌంతేయ) అని పలికినాఁడు. ఈ మాట మయుఁడపుడు పొందియున్న యుపకారమును, అందుకాతఁడు చూపవలసిన నమ్రతను, ఏతత్పురస్కారముగ నపుడు పలుకదగిన విహితమును వ్యక్తీకరించును. దేహ సంరక్షణ విషయమది గాన మయుఁడర్జునుని 'కౌంతేయ' అని సంబోధించెను. మయుఁడిట్లు పలుకగా నర్జునుఁడిట్లు పలికెను.

కృత మేవ త్వయా సర్వం స్వస్తి గచ్ఛ మహాసుర !
ప్రీతిమాన్ భవ మే నిత్యం ప్రీతిమంతో వయంచ తే ॥ ౭౦. ౮

(సర్వము గావించినట్లే స్వస్థముగా వెడలుము (పోయి రమ్ము.) నాయందుఁ బ్రీతుఁడవగుము, మేమును నీయందు ప్రీతుల మగుదుము- అని పలికెను.)

# రాజసూయము

"మహాసుర" అను సంబోధన మిచ్చుట గలదు. ఈ సంబోధన ముత్తమ మని కాని, అధమమని కాని తెల్పదు. నైజమును యోగ్యముగా దెల్పుచున్నది—ఈ ప్రకరణమునంతయు నావరించి సరివచ్చు సంబోధనమై యున్నది. "కృత మేవ త్వయా సర్వం" అని యర్జునుడు పలికినాడు వాసుదేవుని సన్నిధిలో ప్రాంజలియై శ్లక్ష్ణ వచనమున మరలమరల బూజించుచు మయుఁడు కృతజ్ఞుఁడగుచు మాట పలికి యున్నందున నాతఁడు సర్వము గావించినట్లే యగుచున్నదని యర్జునుఁ డుదారముగా బదులు పలికినాఁడు. నాయందు ప్రీతిమంతుఁడవగుము' అని యుచితముగాఁ బలికినాఁడు. "మేమును నీయందు బ్రీతిమంతుల మగుదుము" యని యుదారముగాఁబలికినాఁడు, ఒకచోట ఏకవచనము, ఇంకొకచోట బహువచనము (స్వవిషయమున నేకవచనము అందఱి విషయమందు—పంచపాండవ పరముగా బహువచనము) గల దిచ్చుట. ఇది యోగ్యముగా నున్నది. అర్జునుడు పలికినది విని మయు డిట్లుపలికెను.

యుక్త మేత త్త్వయి విభో! యథాత్థ పురుషర్షభ!
ప్రీతిపూర్వం మహం కించి త్కర్తు మిచ్ఛామి భారత! ౫

అహం హి విశ్వకర్మా వై దానవానాం మహాకవిః
సోఽహం వై త్వత్కృతే కించి త్కర్తు మిచ్ఛామి పాండవ ౬

(పురుషర్షభ! నీవు పలికినది నీయందు యుక్తమే. ప్రీతిపూర్వకముగా నేను కొంత గావింప నిచ్ఛగించుచున్నాను. నేను దానవులకు విశ్వకర్మను, మహాకవిని: ఆ నేను నీ నిమిత్త మొకింతఁ గావింప నిచ్ఛగించుచున్నాను—అని పలికెను.)

ఈ శ్లోకములందున్న సంబోధనలన్నియు సర్థగౌరవము గల్గి యున్నవి. "యుక్త మేత త్త్వయి విభో! (ఇది నీయందు యుక్తము ప్రభో!) అని మయుడనినాడు. ఇందలి సంబోధన మర్జునుని ప్రభుత్వ సంపదను తెల్పుచున్నది, "యథాత్థ పురుష ర్షభ" అనునది అర్జుననందున్న శ్రేష్ఠత్వము తెల్పుచున్నది 'ప్రీతిపూర్వ మహం కించి త్కర్తు మిచ్ఛామి భారత! ('ప్రీతిపూర్వముగ నేనొకింత గావింప నిచ్ఛయించుచున్నాను, భారత) అనునవి మయుని యోగ్య తను తెల్పుచున్నది. లోకమున బరమ శ్రేష్ఠము భరత వంశమం దుద్భవించినట్టి, తనకు ప్రాణదాతయైనట్టి యర్జునున కప్పుడు మయుఁ డేమి గావించినను నది కించిత్తే యగును మయుఁడు తన హృదయ మును 'కించిత్' అను మాటలో ధ్వనింప జేసినాఁడు 'ప్రీతి పూర్వం———ఇచ్ఛామి' అను మాటలు మయుని హృదయ గతాభిప్రాయమును నిరూపించుచున్నది. ఈ గిన శ్లోకములో నర్జు నుని ఘనతనంతయు నిరూపిరిచి ఉవ శ్లోకములో తన విషయమును. పరిస్థితిని మయుఁడు మనవి చేయుచున్నాఁడు 'అహంహి' అనినాడు, ఇందున్న 'హి' అననది 'నేను పలుకు విషయమిది' అను మయుని తగు మాటను వ్యక్తీకరించుచున్నది. దానవులకందఱ కతఁడు విశ్వ కర్మ, మహాకవి. అట్టి ఘనుడు ప్రతి కృతి గావింపక యెట్లు వెడలిపో గలడు. ఈ యభిప్రాయమునే మయుడు "సోహంవై" అనుమాటయందు ప్రకటించినాడు.

విశ్వ కర్మా వై దానవానాం మహాకవిః అని యిచ్చట గలదు. 'దానవానాం' అనుమాట ఉభయతః అన్వయించుట గమ నింపదగినది. 'త్వత్కృతే కించి త్కర్తు మిచ్ఛామి పాండవ' (నీకుగా కించిత్తు కావింప నిచ్ఛగించుచున్నాను) అని మయు డని నాడు. మయుడు తన సర్వ శక్తిని వినియోగించియే కృత్య మొనర్చ

నప్పుడర్జునునియందదది కించిత్తే యగును. మయు డీ విశేషభావము నిందు ప్రకటించినాడు. అర్జును నిపుడు మయుఁడు ' పాండవ ' అని సంబోధించుట సమీచీనముగా నున్నది. తాను గావించు కృత్యము పాండవులందఱకు సంబంధించియుండవలెననియు, అర్జునుఁడట్లయిననే సమ్మతుఁడగుననియు మయుఁడు గ్రహించి యిట్లుగా సంబోధించినాఁడు అర్జునుఁడు 'మేము నీయందు ప్రీతియుంతుల మగుదుము' (ప్రీతిమంతో వయంచ తే)అనిపలికియున్నాఁడు. 'ఇచ్ఛామి' అని మయుఁడు పలికినది అర్జును ననుమతి నపేక్షించునదిగా నున్నది. మయుఁడు పలికినది విని యర్జునుఁడిట్లు పలికెను.

ప్రాణ కృచ్ఛ్రాద్విముక్తం త్వ మాత్మానం మన్యసేఽనఘ ।
ఏవం గతే న శక్ష్యామి కించి త్కారయితుం త్వయా ॥ ౭

న చాపి తవ సంకల్పం మోఘ మిచ్ఛామి దానవ ॥
కృష్ణ స్యక్రియతాం కించి త్తథా ప్రతికృతం మయి ॥

(అనఘా! ప్రాణాపాయము నుండి విముక్తి నొందితినని నీవు తలంచుచుంటివి కదా. అయినప్పుడు కించిత్ కూడ నీచే నేనేమియుఁ గావింపఁజేయఁజాలను, నీ సంకల్పమును మోఘ మొనర్పుటకును నిచ్ఛగింపను. కృష్ణునకు గావించు నది యా కించిత్తే నాయందుఁ బ్రతి కృతిగానగును - అని పలికెను.)

విముక్తి నొందిన మయునందు 'అనఘ' అనునది మంచి సంబోధన మగుచున్నది. ' ప్రాణాపాయమునుండి విడబడితివికదా ' అని యర్జునుడు పలుక లేదు. ఇట్లుగా బలికిన తానుదారుడుగా ప్రాణరక్షణ మొనరించినటుల, ఇంక ప్రతికృతి విషయమే వలదని—ఇట్లుగా నర్జునుని మనస్సున్నదని సూచితమగును. అర్జును డట్లు పలుకక మయుం డప్పుడేమి తలంచుచున్నాడో యా మయుని హృదయ

గతమునే పలికినాడు. 'ఆత్మానం మన్యసే' అనునది దీనినే తెల్పుచున్నది. 'నీకు నేనేమియు నిపుడు పనిచేల్ప జాలను'— ఇట్లు పలికిన నిది యర్జునుని మర్యాదయగును. ఉదారుఁడగు నర్జును డపుడు మయుని పరిస్థితియందు హృదయముంచి యుదారముగా బలికినాడు.

ఏవం గతేన శక్యామి కించితాకారయితుం త్వయా' (నీచేసి పరి స్థితియందు గొంచెమేనియు నేదియు గావింప జాలను) అనినాడు. అనఘుఁడగు మయున కపుడొక సంకల్ప మేర్పడినది. దానినిను మోఘము గావింపదగదు. కావుననే యర్జునుఁడు "నీ సంకల్పమును మోఘ మొనర్ప నిచ్ఛగింపను' అనినాడు.

మయుని సంకల్పమున కనుగుణమగు మనసుగల్గి యర్జునుఁడు పలుకు చున్నాడు. 'కృష్ణున కది గావింపుము' - ఇట్లని పలుకక యర్జునుడు చు కృష్ణునకు గావింపబడునది తనయందు ప్రతికృతియగును' అని పరిస్థితిని, బాధ్యతను స్మరించి పలికినాఁడు. 'కృష్ణున కేదైన గా వింపుము' అని పలుకుట మర్యాదకాదు. కృష్ణ చిత్త వృత్తి ననుస రించి పర్యవసానముండదగునని యిపు డర్జునుఁడు సూచించినాఁడు మహానుభావుఁడగు కృష్ణున కేమిగావించుగాక యది కించిత్తే కాగల దని తనయందు సంపూర్ణమగు ప్రతికృతి కాగలదని యర్జునుడు పలి నాఁడు. మయుఁడపుడు కృతజ్ఞతతో గావించునది సంపూర్ణమగు ప్రతి కృతిగా నెట్లేర్పడునో యామేల్మిమాట నర్జునుడిట్లు వెలువరించి నాడు 'తథా' అనుమాట సంకల్పసిద్ధి యేర్పడినది' అని మయుడు సంతసించునదిగా నేర్పడినది. ఈ సందర్భమున 'కించిత్' అనుమాట వ్యాసుడు రసవంతముగా రచించినాడు.

చోదితో వాసుదేవస్తు మయేన భరతర్షభ!
ముహూర్తమివ సందధ్యౌకి మయం చోద్యతా మితి ॥ ౭

(మయునిచే ప్రచోదితుఁడైన వాసుదేవుఁడు 'ఇతని నేమిగా ప్రచోదింప దగును' అని యాలోచించెను—సందధ్యౌ)

అర్జునుఁడు పలికినది గమనించి మయుఁడపుడు వాసుదేవునిఁ బ్రార్థించినాడు. ఇది మయుని మర్యాదను, కృష్ణుని మాన్యతను వెల్లడించుచున్నది. ప్రచోదితుఁడైన వాసుదేవుఁడపుడు ముహూర్త కాలము (అట్లు) ఆలోచించెను. 'ఇతని కేమి చెప్పుదును' అని కృష్ణుఁ డాలోచించిన నది కృష్ణ సంకల్పమగును వాసుదేవుఁడట్లుఁగాక 'మయుఁడపుడే కార్యమందు చోదితుడగుట తగును' అని యాలోచించెను.

ఇది మయుని సంకల్పమునను వర్తించు నాలోచన యగుచున్నది. కృష్ణుఁడట్టి యాలోచనము గావించెను.

తతో విచింత్య మనసా లోకనాథః ప్రజాపతిః
చోదయామాస తం కృష్ణః సభా వై క్రియతా మితి ౧౦

యది త్వం కర్తు కామోఽసి ప్రియం శిల్పవతాం వర
ధర్మరాజస్య దైతేయ యాదృశీ మిహ మన్యసే ౧౧

యాం కృతాం నానుకుర్వంతి మానవాః ప్రేక్ష్యధిష్ఠితాః
మనుష్యలోకే సకలే తాదృశీం కురు వై సభామ్

యత్ర దివ్యా నభిప్రాయాన్ పశ్యేమహి కృతాం స్త్వయా
ఆసురాన్ మానుషాంశ్చైవ, సభాం తాం కురు వై మయ ౧౩

(లోకనాథుఁడు, ప్రజాపతియగుఁగృష్ణుఁడు మనసార యాలోచించి సభను నిర్మింపవలసినదని మయునిఁబ్రబోధించెను. 'శిల్ప శ్రేష్ఠుడా! ప్రియమాచరించెదవేని ధర్మరాజున కేది తగు నిపుడని నీవు తలంతువో, దేనినిఁ దిలకింఁచియుఁబరికించియు (అధిష్ఠించియు) మానవు లట్టి దింక నిర్మింపఁ జాలరో, మనుష్యలోక మంతటియందు (నద్వితీయమగు) నట్టి సభను నిర్మింపుము దివ్యాభిప్రాయములఁగల దీ సభయని మేము గాంచగలమో యట్టి సభను, అసురమానవ శిల్ప విశిష్టమైనట్టి దానిని నిర్మింపుము' అని కృష్ణుఁడు పలికెను.)

'లోకనాథః, ప్రజాపతిః' అనునవి రెండు విధములగు గృష్ణుని లోకవిస్తృతిని వ్యక్తీకరించుచున్నది. ధర్మరాజున కేది తగునో యది నిర్మింపుము'— ఇట్లుగా కృష్ణుఁడు పలుకలేదు. ధర్మ రాజునకిచ్చుట కపుడేది తగు నంచు మయుఁడు నిర్ణయించుకొనునో యద్దానినే నిర్మింపఁ బ్రబోధించువాఁడై కృష్ణుఁడు తన మనోభిలాషను జతచేసి 'సభను నిర్మింపుము' అని పలికినాఁడు.

సభను నిర్మింపఁజేయుట కృష్ణుని యభిలాష, అది యెట్లు నిర్మించుటో యది మయుని సంకల్పము — అని యిందున్న యభిప్రాయము. మానవులాసభను పరికించియు నట్టి సభను నిర్మింప లేనివాఁడుగావలెను. అట్టి దివ్యసభను మయునిచే నిర్మింపఁ దలంచినాఁడు కృష్ణుఁడు. కౌరవు లీ మయ సభను చూచి ఇంకొక మంటపము నిర్మింపఁజేసినారు. మయ సభయందు రాజసూయ యాగము జరిగినది కౌరవ సభయందు ద్యూతము నడచినది. అద్వితీయమైన మయసభ యోగ్యులు సంతసించునదిగను, దుర్మార్గు లసూయా గ్రస్తులగునట్లుగను పరిణమించినది.

ప్రతి గృహ్యాతు తద్వాక్యం సంప్రహృష్టో మయ స్తదా
విమానప్రతిమాం చక్రే పాండవస్య శుభాం సభామ్ ౧౪
అభిప్రాయేణ పార్థానాం కృష్ణస్యచ మహాత్మనః

సర్వర్తు గుణసంపన్నాం దివ్యరూపాం మనోరమాం
దశవిష్ణు సహస్రాం తాం మాసయామాస సర్వతః ౨౧

(మయుడు సంప్రహృష్టుడై విమాన ప్రతిమయగు శుభమైన సభను పాండవులకుఁగాను నిర్మించెను. కృష్ణుఁడు, అర్జునుఁడు యుధిష్ఠిరునకంతయు నివేదించి మయునిఁ జూపిరి. మయుఁడు ధర్మజునిచే సత్కరింపఁబడి వెడలిపోయెను. పాండవుల యొక్క, కృష్ణునియొక్క యభిప్రాయము ననుసరించి సభను నిర్మింపఁదలంచి మయుఁడు శుభదినమున కతకౌతుక మంగళుఁడై వేలకొలఁది ద్విజశ్రేష్ఠులను పాయసమున, ధనమున, సంతృప్తులఁగావించి సర్వర్తు గుణసంపన్నము, దివ్యరూపము. మనోరమమునగు సభను నిర్మించెను.)

సర్వర్తు గుణసంపన్నమైన దాసభ, దివ్యమైనది, మనోరమమైనది. లోకమం దద్వితీయమైనది కృష్ణపార్థుల యభిప్రాయానుసార ముత్సాహయుక్తుఁడై శుభముహూర్తమున మయుఁ డాదివ్య సభను నిర్మింపఁ బ్రారంభించెను.

—: కృష్ణుఁడు ద్వారకకుఁబోవుట :—

ఉషిత్వా ఖాండవ ప్రస్థే సుఖవాసం జనార్దనః
పార్థైః ప్రీతి సమాయుక్తైః పూజనార్హోఽభిపూజితః ౧

గమనాయ మతిం చక్రే పితుర్దర్శనలాలసః
ధర్మరాజ మథామంత్ర్య పృథాంచ పృథు లోచనః ౨

వనందే చరణౌ మూర్ధ్నా జగద్వంద్యః పితృష్వసుః
సతయా మూర్ధ్న్యుపాఘ్రాతః పరిష్వక్తశ్చ కేశవః 3

దదర్శానంతరం కృష్ణో భగినీం స్వాం మహాయశాః
తాముపేత్య హృషీకేశః ప్రీత్యా బాష్ప సమన్వితః ౪

అర్థ్యం తథ్యం హితం వాక్యం లఘుయుక్త మనుత్తరం
ఉవాచ భగవాన్ భద్రాం సుభద్రాం భద్రభాషిణీమ్ ౫

తయా స్వజనగామీని శ్రావితో వచనాని సః
సంపూజిత శ్చాప్యసకృచ్ఛిరసా చాఽభివాదితః ౬

కన్నవారింటి ప్రేమ యుట్టిపడ కృష్ణునకు సుభద్రకు ప్రసంగమైనదని యీ శ్లోకములు వ్యక్తీకరించుచున్నవి. 'అనుత్తరం' అను మాట మాటకు బదులు మాట పలుక నవసరము లేదని తెల్పుచున్నది. 'స్వజనగామీని శ్రావితో' అనునది పుట్టినింటి ప్రేమనుఁ దెల్పుచున్నది. 'అసకృచ్ఛిరసా చాఽభివాదితః' అనునది పుట్టినింటి ఆశాపాశమును వ్యక్తీకరించుచున్నది.

తామనుజ్ఞాయ వార్ష్ణేయః ప్రతిపద్య చ భామినీం
దదర్శానంతరం కృష్ణాం ధౌమ్యం చాపి జనార్దనః ౭

వవందేచ యథాన్యాయం ధౌమ్యం పురుషసత్తమః
ద్రౌపదీం సాంత్వయిత్వాచ హ్యామంత్ర్యచ జనార్దనః ౮

భ్రాతౄ నభ్యగమ ద్విద్వాన్ పార్థేన సహితో బలీ
భ్రాతృభిః పంచభిః కృష్ణోవృత శ్శక్ర ఇవామరైః ౯

అన్వారురోహ చాప్యేనం ప్రేమ్ణా రాజా యుధిష్ఠిరః
అపాస్య చాస్య యంతారం దారుకం యంతృసత్తమమ్ ౧౦

అభీశూన్ సంప్రజగ్రాహ స్వయం కురుపతి స్తదా
ఉపారుహ్యార్జున శ్చాపి చామర వ్యజనం సితమ్ ౧౧

రుక్మదండం బృహద్బాహు ర్విదధౌ చ ప్రదక్షిణం
తథైవ భీమసేనోఽపియమాభ్యాం సహితో బలీ ౧౮



పృష్ఠతోనుయయౌ కృష్ణ మృత్విక్పౌరజనై స్సహ
స తథా భ్రాతృభి స్సర్వైః కేశవః పరవీరహా ౧౯

అన్వీయమాన శ్శుశుభే శిష్యై రివ గురుః ప్రియైః
పార్థ మామన్త్ర్య గోవిందః పరిష్వజ్య సుపీడితమ్ ౨౦

యుధిష్ఠిరం పూజయిత్వా భీమసేనం యమౌ తథా
పరిష్వక్తో భృశం తైస్తు యమాభ్యా మభివాదితః ౨౧

యోజనార్ధ మథోగత్వా కృష్ణః పరస్పరం జయః
యుధిష్ఠిరం సమామన్త్ర్య నివర్తస్వేతి భారత ౨౨

తతోఽభివాద్య గోవిందః పాదౌ జగ్రాహ ధర్మవిత్
ఉత్థాప్య ధర్మరాజస్తు మూర్ధ్న్యుపాఘ్రాయ కేశవమ్ ౨౩

పాండవో యాదవశ్రేష్ఠం కృష్ణం కమలలోచనం
గమ్యతా మిత్యనుజ్ఞాయ ధర్మరాజో యుధిష్ఠిరః ౨౪



తతస్తై స్సంవిదం కృత్వా యథావ న్మధుసూదనః
నివర్త్యచ తథా కృచ్ఛ్రాత్ పాండవాన్ స పదానుగాన్ ౨౫

స్వాంపురీం ప్రయయౌహృష్టోయథా శక్రోఽమరావతీం
లోచనై రనుజగ్ము స్తే తమాదృష్టిపథా త్తదా ౨౬

మనోఽభి రభిజగ్ము స్తే కృష్ణం ప్రతి సమన్వయాత్
అతృప్తమనసా మేవ తేషాం కేశవదర్శనే ౨౭

క్షిప్ర మంతర్దధా శౌరి శ్చక్షుషాం ప్రియదర్శనః
అకామా ఏవ పార్థా స్తే గోవిందగతమానసాః ౨౮

నివృత్యోప్రయయు స్తూర్ణం స్వపురం పురుషర్షభాః
స్యందనే నాథ కృష్ణోఽపి త్వరితం ద్వారకా మగాత్ ౨౯

సాత్వ తేనచ వీరేణపృష్టతోయాయినా తదా
దారుకేణచ సూతేన సహితో దేవకీసుతః ౩౦

ప్రయయా ద్వారకాం శౌరి ర్గరుత్మా నివ వేగవాక్ ౩౧

ఖాండవప్రస్థమందు సుఖవాసమున్న పూజార్హుండగు కృష్ణుడు ప్రీతిసమాయుక్తులగు పాండవులచే పూజింపఁబడెను. పితుర్దర్శన లాలసుఁడై కృష్ణుడు ధర్మరాజుతోఁ దెల్పి కుంతితోఁ దెల్పెను. జగద్వంద్యుఁడగు కృష్ణుఁడు మేనత్తకుశిరసానమస్కరించి యామెచే మూర్ధాఘ్రాణ మొంది యాలింగితుండాయెను. పిమ్మట స్వంతచెల్లెలినిఁగాంచి, యామె యొద్దకుఁబోయి భాష్పసమన్వితుఁడగుచు అర్థ్యము తథ్యము హితమునగు వాక్యమును లఘుయుక్తము, అనుత్తరమునగు మాటనా చెల్లెలితో-భద్రభాషినియగు సుభద్రతో పలికెను. కన్న వారింటి మాటలు పలుకు నాసుభద్రమాట లాలకించి కృష్ణుఁడామెచే పదే పదే వమస్కృతుఁడై వెడలి వచ్చెదననుమాట పలికి, ప్రశంసించి,పిమ్మట ద్రౌపదిని, ధౌమ్యునిఁగాంచెను యథాన్యాయముగ ధౌమ్యునకు వందన మొనరించి కృష్ణుఁడు ద్రౌపది నోదార్చి వెడలివచ్చెదనని పలికెను పార్థసహితుఁడై కృష్ణుఁడు పాండవుల యొద్దకుఁ బోయి పంచపాండవ వృతుఁడై ప్రయాణ మంగళ మాచరించెను.అనుకులతో శక్రునటు కృష్ణుఁడు పాండవసహితుఁడై దేవతలను, ద్విజులను పూజించి స్వస్తి వాచనము విప్రులాచరించుచుండగా మంగళ ద్రవ్య శోభితమగు

నాసమయమున కృష్ణుఁడు వారికి ధనమొసంగి ప్రదక్షిణమాచరించెను కాంచన రథారూఢుఁడైతార్క్ష్యకేతనుఁడై పుండరీకాక్షుడు ద్వారకకుఁ బయలు దేరెను ధర్మరాజు కృష్ణు ననంతరము రథమధిరోహించి దారుకునిఁదొలిగించి ప్రేమచే తానే స్వయము గుఱ్ఱములనుఁబట్టి రథమునడపెను. అర్జునుఁడును నావెంట రథమధిరోహించి చామర వ్యజనమును పట్టెను అట్లే భీమసేనుండును నకుల సహదేవులతోఁ గూడ కృష్ణు ననుసరించి పోయెను ఋత్విక్ పౌరసహితుఁడై భీమసేనుఁడు మున్నగువారట్లనుసరించి వచ్చుచుండగా కృష్ణుఁడు ప్రియశిష్యులతో గురువువద్ద శోభించెను కృష్ణుఁడప్పుడు పాండవులతో వెళ్ళివచ్చెదనని పలికి యాలింగన మొనరించుకొనెను కృష్ణుడు ధర్మజుని పూజించి భీమసేనుని, నకుల సహదేవులను సన్మానించెను. వారిచే గాఢాలింగితుఁడై నకుల సహదేవులచే నమస్కరింపఁబడి, కృష్ణుడు ధర్మజునితో "ఇంక మరలు ము" అని పలుకుచు నాతని పాదములకెఱగి నమస్కరించెను. ధర్మజుఁడా కృష్ణుని లేపించి మూర్ధా ఘ్రాణ మొనరించెను ధర్మరాజు యుధిష్ఠిరుఁడు కమలలోచనుండగు కృష్ణునితో "పోయిరమ్మ" అని పలికెను మధుసూదనుఁడట్లు పాండవానుమతి నొంది యతికష్టమున పాండవులను–పదాతిసహితు౦డై యే తెంచి యున్నవారిని మరలింపఁజేసెను దేవేంద్రుఁడమరావతికిఁబోవు నట్లు కృష్ణుడు హృష్టుఁడై స్వపురమునకు వెడలెను కృష్ణుఁడు దృష్టి పథమందున్నంతవఱకు పాండవు లాతని కన్నులచే ననుసరించిరి. వారు కృష్ణుని మనసానిండుగా ననుసరించువారైరి కేశవ దర్శనమందు, వారతృప్త మనస్కులై యున్నప్పుడె(పాండవులట్లు కృష్ణుని నిరీక్షించి చూచుచుండగనే ) చక్షుః ప్రియదర్శనుఁడు కృష్ణుఁడు శీఘ్రముగాఁ గనుమొఱఁగెను. అతామమున నే ( అటనుండి కదల లేక నే ) యా పాండవులపుడు గోవిందగతమానసులై మరలి తూర్ణమును స్వపురము నకు వెడలిపోయిరి పిమ్మట కృష్ణుడు త్వరితముగా ద్వారకకుఁ

బోయెను సాత్యకి వెంటరాగా దారుక సహితుఁడై దేవకీసుతుఁడు శౌరి ద్వారకా నగరమునకుఁబోయెను )

కష్ణుడు ఖాండవప్రస్థమందు సుఖమున్నాడు, పూజనార్హుఁడగు కృష్ణుడు ప్రీతిసమాయుక్తులగు పాండవులచేఁబూజితుడై యచ్చోట నుండెను. అపుడా వాసుదేవుఁడు ద్వారకానగరమునకుఁబోవ నెంచెను. పితృదర్శనలాలసుఁడై కృష్ణుఁడు ద్వారకా నగరమునకుఁబోవ నెంచెను. ధర్మజునితోఁ బోయి వచ్చెదనని పలికెను. కృష్ణుఁడు ప్రభుండు, ప్రధానుఁడునగు ధర్మరాజుతో తగుమాట పలికి పిమ్మట మేనత్తతో 'పోయి వచ్చెదను' అని పలికెను 'పృథాంచ పృథులోచనః అనునది చక్కగానున్నది. జగద్వంద్యుఁడు కృష్ణుఁడు పితృష్వస చరణము లంటి శిరసా నమస్కరించెను. అప్పుడు కృష్ణుఁడు కుంతిచే మూర్ధా ఘ్రాణ మొంది పరిష్వక్తుఁడాయెను. 'కుంతి కృష్ణుని ముద్దు పెట్టుకొని యాలింగన మొనరించుకొనునది' అను విషయమిచటనిల్లు రస వంతముగానుల్లేఖింపఁబడినది మేనత్త యొక్క ప్రేమాదగము లిందు సువ్యక్తము చేయబడినవి. 'జగద్వంద్యుని జగన్మాత లాలన మొనరించినది.' అనునట్టి విస్తారమింపు సూపొందియున్నది.

కృష్ణుఁడా పిమ్మట స్వంత చెల్లెలగు సుభద్రనుచూచి పోయి వచ్చెదనని పలికెను. ఆనంద బాష్పములుగార్చుచు కృష్ణుడు సుభ ద్రను మాటాడించెను. గీన శ్లోకము కృష్ణ వచనమందలి యంద చందములను, సుభద్రయొక్క వ్యక్తిత్వ విశేషమును సువ్యక్తము చేయుచున్నది. అపుడు కృష్ణ సుభద్రల మాటలు పుట్టింటి సంబధ ముగా నుండినవి. కృష్ణుఁడు సుభద్రమాట లాలకించి యామెచే సంపూజితుఁడై యామెచే శిరసానమస్కరింపఁబడెను. కృష్ణుని ప్రయాణసన్నాహ సందర్భమదిగానఁగృష్ణుడేప్రధానముగా ప్రతి ఫలించు నట్టి రచనావిధాన మిచ్చోట రసవంతముగానున్నవి.

ధర్మరాజునితోను, కుంతితోను, సుభద్రతోను 'పోయివచ్చెదను' అని పలికి కృష్ణుఁడాపిమ్మట ద్రౌపదిని, ధౌమ్యునిఁగాంచెను. యథాన్యాయముగా ధౌమ్యునకుఁగృష్ణుఁడునమస్కరించి ద్రౌపదినోదార్చి "పోయివచ్చెదను' అని పలికెను. కృష్ణునకు ద్రౌపదియందు, ధౌమ్యునందుగల ఆదరాభిమానము లిందువ్యక్తమగుచున్నవి.

కృష్ణుఁడు వరుసగా ధర్మరాజుఁడు, కుంతి సుభద్ర, ద్రౌపది, ధౌమ్యుడు వీరలతోఁ బ్రత్యేకప్రత్యేకముగాఁ బోయివచ్చెదనని పలికి పిమ్మట పంచపాండవసహితుఁడగుచు ప్రయాణసన్నాహ మాయెను. పార్థసహితుండగుఁగృష్ణుడు పాండవులనుండి ప్రయాణసన్నాహ మాచరించువాఁడాయెను

కృష్ణుఁడుఁచెల్లెలు సుభద్రను, బావమరిది, చెలికాడునగు నర్జునుని నెక్కువ మక్కువగాఁబలుకరించి ద్వారకకుఁబోయెను, రుక్మిణీ భవనమునకుఁబోయెను — ఈ మాట సన్నిహితత్వమును సూచించుచున్నది. ఈ ఘట్టము మొత్తముగా ధర్మవిధానసంపదను వెల్లడించుచున్నది.

ఇది కృష్ణార్జునుల స్నేహబాంధవ్యవిశేషమును సువ్యక్తము చేయుచున్నది. అమరావృతుండగు శక్రునట్లు శోభించు వాసుదేవుండపుడు ప్రయాణమంగళ మాచరించెను.

'అనుజ్ఞాయ, ప్రతి వంద్య చ అని సుభద్రవిషయమున చెప్పబడినది. ' సాంత్వయిత్వా చ హ్యామంత్ర చ ' అని ద్రౌపది విషయమున చెప్పఁబడినది. భ్రాతౄనభ్యగమ ద్విద్వాన్ పార్థేనసహితో బలీ' అని పాండవవిషయమున జెప్పబడినది.

వారలయెల్లల నివి వ్యక్తీకరించుచున్నవి. పాండవులయిదుగు రా సమయమున నచ్చోటనేయున్నారనియు నర్జునుడు కృష్ణునికూడి యేయున్నాడనియు నిది వ్యక్తీకరించుచున్నది. కృష్ణుడు యాత్రా కాలయోగ్యములగుకర్మ లాచరించువాడై శుచియై స్నానమాడి యలంకృతుడై దేవతలను, ద్విజుల నర్చించి ప్రయాణమాయెను. కృష్ణుడిట్లు సదాచారప్రవర్తకుడై మంగళద్రవ్యశోభితులగు విప్రుల స్వస్తివాచనమగుచుండగా నా బ్రాహ్మణులను సత్కరించి, ప్రదక్షిణమాచరించెను. శుభముహూర్తమున బయలుదేరిన కృష్ణుననుసరించువాడై ధర్మరాజు కాంచన రథము నధిష్ఠించెను, దారకుని దొలగించి స్వయము సూతకృత్యమాచరించెను. అర్జునుడు చామరము ధరించెను. కవలలతోగూడ భీమసేనుడు కృష్ణు ననుసరించి పోవుచుండెను. ఋత్విక్ పౌరజన సహితముగా భీమాదులెల్ల రనుసరించి వచ్చుచుండగా గృష్ణు డతిశోభాయమానముగా బ్రయాణమాయెను.

కృష్ణుడు పాండవులను వీడ్కొను నవసరమున గృష్ణార్జునుల సఖ్యభావము మొదటగా ననుపర్తింపబడినది. పిమ్మట పాండవుల విషయమై క్రమమైనమర్యాద పాటింపబడినది. ధర్మజ భీమార్జునులను కృష్ణుడాలింగన మొనరించుకొనెను, నకులసహదేవులచే నమస్కరింపబడెను. 'కవలలచే నమస్కరింపబడెను' అనుటచే నాకవ లొకేమాఱుగా ననుసరించుటయందలి యందము వ్యక్తమగుచున్నది. పాండవ పట్టమహిషి ద్రౌపది కృష్ణున కుచితమగు వీడ్కోలు గావించినది.

స్వపురమునకుజేరబోవు కృష్ణుడు హృష్టుడై ప్రయాణము సాగించెను. స్వజనుని సాగనంపుచున్న పాండవులు కృష్ణ నివర్తనులై యతృప్త మనస్కులుగా కృష్ణునందే మనస్సులుంచి స్వపురమునకు మరలిరి. కృష్ణునందు పాండవులకున్న ప్రీతి విశేషము నిది సువ్యక్తము గావించుచున్నది. బంధుజన ప్రయాణ విషయ మిచట స్వభావ

సిద్ధముగా నిరూపింపఁబడినది. పాండవుల లోచనములు, మనస్సులు కృష్ణు ననువర్తించి యున్నవి. వారట్లు నిరీక్షించుచుండగనే యంత లోన కేశవుఁ డదర్శనుఁ డాయెను. కృష్ణుఁడు శీఘ్రమున వెడలి పోవుటయు, పాండవు లతిసక్తులై గోవింద గతమానసులై నిరీక్షించు టయు నిట నిరూపింపఁబడినది. 'అకామాఏవ పార్థాః' అనునది కృష్ణుని విడువఁజాలని, అటనుండి కదలలేని పాండవుల పరిస్థితినంతయు వ్యక్తీక రించుచున్నది. పాండవులు మరలిపోయిన పిమ్మట దారుకుఁడు తేరు గడపుచుండ సాత్యకి సహితుఁడై కృష్ణుఁడు త్వరితముగా ద్వారకా నగరమునకు వెడలి పోయెను. (ప్రియయా ద్వారకాం శౌరి ర్గరుత్మా నివ వేగవాన్ ' అని యిచ్చట గలదు. )

నివృత్త్య ధర్మరాజస్తు సహభ్రాతృభి రచ్యుతః
సుహృ త్పరివృతో రాజా ప్రవివేశ పురోత్తమమ్ 32

విసృజ్య సుహృద స్సర్వాన్ భ్రాతౄ్న్ పుత్రాంశ్చ ధర్మరాట్
ముమోద పురుష వ్యాఘ్రో ద్రౌపద్యా సహితో నృపః 33

కేశవోఽపి ముదాయుక్తః ప్రవివేశ పురోత్తమమ్
పూజ్యమానో యదుశ్రేష్ఠై రుగ్రసేన ముఖై స్తథా 34

ఆహుకం *పితరం వృద్ధం మాతరంచ యశస్వినిం
అభివాద్య బలం చైవ స్థితః కమలలోచనః 35

---

*శాస్త్రము 'మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్య దేవో భవ' అని చెప్పుచున్నది. ఈ విధానమందు విశేషము గలదు. కొన్ని సమయములందు తండ్రికి, కొన్ని సమయములందు తల్లికి మొదట నభివాదనము గ్రంథములందు నిరూపింపబడియున్నది గృహ గతము విషయమందు తల్లికి ప్రాధాన్యము, పైనుండి గృహమునకు వచ్చినపుడు తండ్రికి ప్రాధాన్యము గానవచ్చుచున్నది. ఇట్లే యాచా ర్యవిషయమందుగూడ గలదు. ఈ సంగతి సందర్భములను పరికించిచూచినగాని యథార్థము — మర్యాదయొకటితీరు అవగాహ నము కానేరదు.

ప్రద్యుమ్న సాంబ నిశథాం శ్చారుదేష్ణం గదం తథా
అనిరుద్ధంచ భానుంచ పరిష్వజ్య జనార్దనః
స వృద్ధై రభ్యనుజ్ఞాతో రుక్మిణ్యా భవనం యయౌ 3౽

(ధర్మరాజ తమ్ములతోఁగూడి సుహృత్పరివృతుఁడై పురోత్తమమును ప్రవేశించెను ధర్మజుండు సుహృదులనుఁబంపి, తమ్ములను పుత్రులను (పిలిపి) ద్రౌపదితోఁగూడ మోద మొందెను, కృష్ణుఁడు మోదమున పురోత్తమమును ప్రవేశించెను. ఉగ్రసేన ముఖులగు యదుశ్రేష్ఠులచే మన్నింపఁబడెను ఆహుకునకు, వృద్ధుడగు తండ్రికి, యశస్వినియగు తల్లికి అభివాదన మొనరించెను. బలరాముని కభివాదన మొనరించెను ప్రద్యుమ్నాదులగు పుత్రుల నాలింగన మొనరించుకొనెను. వృద్ధుల యనుజ్ఞను పడసి కృష్ణుఁడు రుక్మిణీ భవనమునకు వెడలెను)

ధర్మజుని మోద మిందు తెల్పఁబడినది. సుహృదులను బంపి యంతఃపురమును ధర్మజుఁడు ప్రవేశించి ద్రౌపదితో మోద మొందెను

'విసృజ్య సుహృద స్సర్వాన్ భ్రాతౄంపుత్రాంశ్చ' అను పాదము చకరిగానున్నది. ఇందు 'విసృజ్య' అనునది సుహృదులయొద్ద మాత్రమే యుండుట గమనింపఁదగినది. 'భ్రాతౄన్ పుత్రాంశ్చ ధర్మరాట్' అని మాత్రమే పిమ్మటగలదు. తమ్ములు, పుత్రులు వారివారినివాసములకుఁ జేరనంపిమ్మట ధర్మరాజు ద్రౌపదితోఁగూడి మోదమొందినాడను మంచిభావ మిందువలన వ్యక్తమగుచున్నది. కృష్ణుని విషయమందుఁ గూడ క్రమమైన మోదవిషయ మిట నిరూపింపఁ బడినది. ధర్మరాజు ద్రౌపదితోడ, కృష్ణుడు రుక్మిణితోడ పురోత్తమములందు పరమమోద మొందిరి. జగదీశ్వరుండైన ధర్మరాజు

ప్రద్యుమ్న సాంబ నిశఠాం శ్చారుధేష్ణం గదం తథా
అనిరుద్ధంచ భానుంచ పరిష్వజ్య జనార్దనః
స వృద్ధై రభ్యనుజ్ఞాతో రుక్మిణ్యా భవనం యయౌ 3౬

(ధర్మరాజ తమ్ములతోఁగూడి సుహృత్పరివృతుఁడై పురోత్తమమును ప్రవేశించెను ధర్మజుండు సుహృదులనుఁబంపి, తమ్ములను పుత్రులను (నిలిపి) ద్రౌపదితోఁగూడ మోద మొందెను, కృష్ణుఁడు మోదమున పురోత్తమమును ప్రవేశించెను. ఉగ్రసేన ముఖులగు యదుశ్రేష్ఠులచే మన్నింపఁబడెను ఆహుకునకు, వృద్ధుఁడగు తండ్రికి, యశస్వినియగు తల్లికి అభివాదన మొనరించెను. బలరామున కభివాదన మొనరించెను ప్రద్యుమ్నాదులగు పుత్రుల నాలింగన మొనరించుకొనెను. వృద్ధుల యనుజ్ఞను పడసి కృష్ణుఁడు రుక్మిణీ భవనమునకు వెడలెను )

ధర్మజుని మోద మిందు తెల్పఁబడినది. సుహృదులను బంపి యంతఃపురమును ధర్మజుఁడు ప్రవేశించి ద్రౌపదితో మోద మొందెను

'విసృజ్య సుహృద స్సర్వాన్ భ్రాతౄంపుత్రాంశ్చ' అను పాదము చక్కఁగానున్నది. ఇందు 'విసృజ్య' అనునది సుహృదులయొద్ద మాత్రమే యుండుట గమనింపఁదగినది. 'భ్రాతౄన్ పుత్రాంశ్చ ధర్మరాట్' అని మాత్రమే పిమ్మటగలదు. తమ్ములు, పుత్రులు వారివారినివాసములకుఁ జేరినపిమ్మట ధర్మరాజు ద్రౌపదితోఁగూడి మోదమొందినాడను మంచిభావ మీఁదువలన వ్యక్తమగుచున్నది. కృష్ణుని విషయమునుఁ గూడ క్రమమైన మోదవిషయ మిట నిరూపింపఁబడినది. ధర్మరాజు ద్రౌపదితోడ, కృష్ణుడు రుక్మిణితోడ పురోత్తమములందు పరమమోద మొందిరి. జగదీశ్వరుండైన ధర్మరాజు,

కరాళులగు ఘోరమైన రాక్షసులంతరిక్షచరులై యీ సభను వహించి రక్షించుచుండిరి. అతివిచిత్రమైన కొలనొకటి మయుడందు నిర్మించెను. అది కొలనని గుర్తిడలేక కొందఱురాజు లాకొలనులో జారిపడిరి. మయుడు పదునాలుగు నెలల కా దివ్య సభను నిర్మాణమొనరించి ధర్మజునకు సమర్పించెను.

నవమేఘప్రతీకాశా దివ మావృత్య విష్ఠితా
ఆయతా విపులారమ్యా విపాప్మా విగతక్లమా ౨౭

ఉత్తమద్రవ్యసంపన్నా రత్నప్రాకారమాలినీ
బహుచిత్రా బహుధనా నిర్మితా విశ్వకర్మణా ౨౮

న దాశార్హీ సుధర్మా వా బ్రహ్మణో నాథ తాదృశీ
సభా రూపేణ సంపన్నా యాం చక్రే మతిమా న్మయః ౨౯

ఈ శ్లోకములందు మయసభానిర్మాణవిశేష మెంతయేని యుల్లేఖింపఁబడినది. మయనిర్మితమైన విసూత్న సభాశోభను చివరి శ్లోకము (౨౯ శ్లోకము) సూచించుచున్నది.

తస్యాం సభాయాం నళినీం చకా రాప్రతిమాం మయః ౩౦

మణిరత్నచితాం తాంతు కేచి దభ్యేత్య పార్థివాః
దృష్ట్వాపి నాభ్యజానంత తేఽజ్ఞానా త్ప్రపతం మ్యత ౩౧

*ఈదృశీం తాం సభాం కృత్వా మాసైః పరిచ తుర్దశైః
నిష్ఠితాం ధర్మరాజాయ మయో రాజన్ న్యవేదయత్ 3-38

అస్తి బిందుసర స్యగ్రే గదాచ కురునందన
పాపై శతసహస్రస్య సమ్మితా శత్రుఘాతినీ
అనురూపాచ భీమస్య గాండీవం భవతో యథా 3-2

వారుణశ్చ మహాశంఖో దేవదత్తః స్సుఘోషవాన్
సర్వ మేత త్ప్రదాస్యామి భవతే నాత్రసంశయః 8

గదాంచ భీమసేనాయ ప్రదదౌ ప్రవరాం తదా
దేవదత్తం చార్జునాయ శంఖప్రవర ముత్తమమ్ 20

యస్య శంఖస్య నాదేన భూతాని ప్రచకంపిరే 22

---

*మయుడు దివ్యమైన సభను ధర్మజునకు నివేదించెను. గాండీవమున కీడైన పెనుగదను భీమసేనునకు, దేవదత్తము నర్జునునకు సమర్పించెను.

తతః ప్రవేశనం తస్యాం చక్రే రాజా యుధిష్ఠిరః
అయుతం భోజయిత్వాతు బ్రాహ్మణానాం నరాధిపః 80-
సాజ్యేన పాయసే నైవ మధునా మిశ్రితేనచ
భక్ష్యై ర్మూలైః ఫలై శ్చైవ మాంసై ర్వారాహ హారిణైః 2
కృసరేణాథ జీవంత్యా హవిష్యేణచ సర్వశః
మాంసప్రకారై ర్వివిధై ఖాద్యై శ్చాపి తథా నృప 3

మయుడు కౌంతేయులుముగ్గురకు మూడుదివ్యములను సమర్పించెను, దుర్మార్గులగురాజులు మయసభయందు తిరస్కరింపబడిరి. దుర్యోధనాదులుసూర్యు రావెనుగద కెరమయెను. దేవదత్తమున దుర్యోధనాదులెల్లఱకు హృదయవిదారణమైనది.

చోష్యైశ్చ వివిధై రాజ్యః పేయైశ్చ బహువిస్తరైః
అహతైశ్చైవ వాసోభి ర్మాల్యై రుచ్చావచై రపి॥ ౪
తర్పయామాస విప్రేంద్రాన్ నానాదిగ్భ్య స్సమాగతాన్ ౫
దదౌ తేభ్య స్సహస్రాణి గవాం ప్రత్యేకశః పునః
పుణ్యాహఘోష స్తత్రాసీత్ దివ స్పృగివ భారత॥ ౬

వాదిత్రై ర్వివిధై ర్దివ్యై ర్గంధై రుచ్చావచై రపి
పూజయిత్వా కురుశ్రేష్ఠో దైవతాని నివేశ్యచ ౭

తత్రమల్లా నటా ఝల్లాః (షల్లాః) సూతా వైతాళికా స్తథా
ఉపతస్థు ర్మహాత్మానం ధర్మపుత్రం యుధిష్ఠిరమ్॥ ౮
తథా స కృత్వా పూజాం తాం భ్రాతృభి స్సహ పాండవః

తస్యాం సభాయాం రమ్యాయాం రేమే శక్రో యథా దివి॥ ౯
భాయా మృషయ స్తస్యాం పాండవై స్సహ చాసతే
ఆసాం చక్రు ర్నవేంద్రాశ్చ నానాదేశసమాగతాః॥ ౧౦

ధర్మరాజు పదివేల మంది బ్రాహ్మణులకు మృష్టాన్నము నివేదించెను. నానాదిక్కుల నుండి సమాగతులైన విప్రేంద్రులను వస్త్రములు, గోవులు, మున్నగునవిచ్చి సత్కరించెను. ఆకాశము వఱకు వ్యాపించు పుణ్యాహఘోష యేర్పడెను. వాదిత్రములు, సుగంధ ద్రవ్యములు, శోభించుచుండగా ధర్మరాజు దేవతల నాహ్వానించెను. మల్లురు మున్నగువారు ధర్మపుత్రుని ఉపాసించుచుండిరి. భ్రాతృసహితుఁడగు పాండవుఁడు ధర్మరాజు సకల శోభనములొందుచు దివమందు శక్రునట్లు రమ్యమైన మయ సభయందు రమించెను. ఆసభయందు ఋషులు పాండవులతో వర్తించి

యుండిరి నానాదేశ సమాగతులగు నరేంద్రులు పాండవులను పాలించుచుండిరి. విప్రేంద్రులు, నరేంద్రులు సంతసించుచుండగా ధర్మరాజు శక్రునట్లు మయసభయందు మిక్కిలిగా వెలింగెను. ఇంద్ర శబ్దమిచ్చట సాభిప్రాయమని గమనింపఁదగినది.

అర్జునం యేచ సంశ్రిత్య రాజపుత్రా మహాబలాః
అశిక్షంత ధనుర్వేదం రౌరవాజిన వాససః॥ 35

తత్రైవ శిక్షితా రాజన్ కుమారా వృష్ణినందనాః
రౌక్మిణేయశ్చ సాంబశ్చ యుయుధానశ్చ సాత్యకిః॥ 36

సుధర్మా చాని రుద్ధశ్చ శైబ్యశ్చ నరపుంగవః
ధనంజయ సఖా చాత్ర నిత్య మాస్తే స్మ తుంబురుః॥ 37

చిత్రసేన స్సహామాత్యో గంధర్వాప్సరస స్తథా
గీతవాదిత్ర కుశలాః శంపాతాళ విశారదాః॥ 38

ప్రమాణేఽథ లయస్థానే కిన్నరాః కృతనిశ్చయాః
సంబోధితా స్తుంబురుణా గంధర్వ సహితా స్తథా॥ 39

గాయంతి దివ్య తానై స్తే యథాన్యాయం మనస్వినః
పాండుపుత్రా నృషీం శ్చైవ రమయంత ఉపాసతే॥ 40

తస్యాం సభాయా మాసీనాః సువ్రతా స్సత్య సంగరాః
దివీవ దేవా బ్రహ్మాణం యుధిష్ఠిర ముపాసతే॥ 41

(అర్జున సమాశ్రితులై రాజపుత్రులు రౌరవాజినవాసస్కులై ధనుర్వేదము నభ్యసించిరి. వృష్ణినందను లచ్చటనే శిక్షితులైరి. చిత్రసేనగంధర్వుఁడు సహామాత్యుఁడై ధనంజయసఖుడుగా గంధర్వాప్సరోసహితుఁడై యా సభయందుండెను. కిన్నరులు చక్కగా తాళములు నేయువారైరి. పాండ పుత్రులను ఋషులను రమింపజేయుచు నందఱు దివమందు దేవతలు బ్రహ్మనుపాసించునటుల యుధిష్ఠిరుని పాసించుచుండిరి.)

## నారదోపదేశము — కచ్చిదధ్యాయము.

అథ తత్రోపవిష్టేషు పాండవేషు మహాత్మసు
మహాత్సు చోపవిష్టేషు గంధర్వేషుచ భారత॥ ౫-౧
వేదోపనిషదాం వేత్తా ఋషి స్సురగణార్చితః

ఇతిహాస పురాణజ్ఞః పురాకల్పవిశేషవిత్॥ ౨
న్యాయవి ద్ధర్మ తత్త్వజ్ఞః షడంగవి దనుత్తమః
ఐక్య సంయోగ నానాత్వ సమవాయ విశారదః॥ ౩

వక్తా ప్రగల్భో మేధావి స్మృతిమా న్నయవి త్కవిః
పరాపరవిభాగజ్ఞః ప్రమాణకృత నిశ్చయః ౪

పంచావయవయుక్తస్య వాక్యస్య గుణదోషవిత్
ఉత్తరోత్తర వక్తాచ వదతోఽపి బృహస్పతేః॥ ౫

ధర్మకామార్థ మోక్షేషు యథాస త్కృతనిశ్చయః
తథా భువనకోశస్య సర్వ స్యాస్య మహామతిః ౬

ప్రత్యక్షదర్శీ లోకస్య తిర్య గూర్ధ్వ మధ స్తథా
సాంఖ్యయోగ విభాగజ్ఞో నిర్వివిత్సుః సురాసురాన్॥ ౭

సంధి విగ్రహతత్త్వజ్ఞ స్త్వనుమాన విభాగవిత్
షాడ్గుణ్య విధియుక్తశ్చ సర్వశాస్త్ర విశారదః॥ ౮
యుద్ధగాంధర్వసేవీచ సర్వత్రా ప్రతిఘ స్తథా
ఏతై శ్చాన్యైశ్చ బహుభి ర్యుక్తో గుణగణై ర్మునిః॥ ౯

లోకా ననుచరన్ సర్వా నాగమ త్తాం సభాం నృప
నారదః సుమహాతేజా ఋషిభి స్సహిత స్తదా॥ ౧౦

పారిజాతేన రాజేంద్ర పైవతేనచ ధీమతా
సుముఖేనచ సౌమ్యేన దేవర్షి రమితద్యుతిః ౧౧

సభాస్థాన్ పాండవాన్ ద్రష్టుం ప్రీయమాణో మనోజవః
జయాశీర్భి స్తు తం విప్రో ధర్మరాజాన మార్చయత్ ౧౨

స మాగత మృషిం దృష్ట్వా నారదం సర్వధర్మవిత్
సహసా పాండవ శ్రేష్ఠః ప్రత్యుత్థా యానుజై న్సహ ౧౩

అభ్యవాదయత ప్రీత్యా వినయావనత స్తదా
తదర్హ మాసనం తస్మై సంప్రదాయ యథావిధి ౧౪

గాంచైన మధుపర్కంచ సంప్రదా యార్ఘ్యమేవచ
అర్చయామాస రత్నైశ్చ సర్వకామైశ్చ ధర్మవిత్ ౧౫

తుతోషచ యథావచ్చ పూజాం ప్రాప్య యుధిష్ఠిరాత్
సోఽర్చితః పాండవై స్సర్వై ర్మహర్షి ర్వేదపారగః ౧౬
ధర్మకామార్థ సంయుక్తం పప్రచ్ఛేదం యుధిష్ఠిరమ్

నారదః

కచ్చి దర్థాశ్చ కల్పంతే ధర్మేచ రమతే మనః ౧౭
సుఖాని చానుభూయంతే మనశ్చ న విహన్యతే
కచ్చి దాచరితాం పూర్వై ర్నర దేవ పితామహైః
వర్తసే వృత్తి మక్షుద్రాం ధర్మార్థ సహితాం త్రిషు
కచ్చి దర్థేనవా ధర్మం ధర్మే ణార్థ మథాపివా
ఉభౌవా ప్రీతిసారేణ న కామేన ప్రబాధసే

కచ్చి దర్థంచ ధర్మంచ కామంచ జయతాంవర
విభజ్య కాలే కాలజ్ఞ సమం వరద సేవసే
కచ్చి ద్రాజగుణైః షడ్భిః సప్తోపాయాం స్తథానఘ
బలాబలేన సమ్యక్ త్వం చతుర్దశ పరీక్షసే ౨౧

కచ్చి దాత్మాన మన్వీక్ష్య పరాంశ్చ జయతాం వర
తథా సంధాయ కర్మాణి హ్యష్టౌ భారత సేవసే ౨౨

కచ్చి త్ప్రకృతయ స్సప్త న లుప్తా భరతర్షభ !
ఆఢ్యా స్తథా వ్యసనినః స్వనురక్తాశ్చ సర్వశః ౨౩

కచ్చి న్న కృతకై ర్దూతై ర్యేచాప్యపరిశంకితాః
త్వత్తోవా తవ చామాత్యై ర్భిద్యతే మంత్రితం తథా ౨౪

మిత్రోదాసీన శత్రూణాం కచ్చి ద్వేత్సి చికీర్షితం
కచ్చి స్సంధిం యథాకాలం విగ్రహం చోప సేవతే ౨౫

కచ్చి ద్వృత్తి ముదాసీనే మధ్యమే చానుమన్యసే
కచ్చి దాత్మ సమా వృద్ధా శ్శుద్ధా స్సంబోధన క్షమాః ౨౬

కులీనా శ్చానురక్తాశ్చ కృతా స్తే వీర మంత్రిణ
విజయో మంత్రమూలోహి రాజ్ఞో భవతి భారత! ౨౭

కచ్చి త్సంవృతమంత్రై స్తై హ్యమాత్యై శ్శాస్త్రకోవిదైః
రాష్ట్రం సురక్షితం తాత ! శత్రుభి ర్న విలుప్యతే ౨౮

కచ్చి న్నిద్రావశం నైషి కచ్చి త్కాలే విబుధ్యసే
కచ్చి చ్చాపరరాత్రేషు చింతయ స్యర్థ మర్థవిత్ ౨౯

కచ్చి న్మంత్రయసే నైకః కచ్చి న్న బహుభి స్సహ
కచ్చి త్తే మంత్రితో మంత్రో న రాష్ట్రం పరిధావతి ౩౦

కచ్చి దర్థా న్వినిశ్చిత్య లఘుమూలా న్మహోదయాన్
క్షిప్ర మారభసే కర్తుం న విఘ్నయసి తాదృశాన్ ౩౧

కచ్చి న్న సర్వేకర్మాంతాః పరోక్షా స్తే విశంకితాః
సర్వే వా పున రుత్సృష్టాః సంసృష్టం చాత్ర కారణమ్ ౩౨

ఆప్తై రలుబ్ధైః క్రమికై స్తేచ కచ్చి దనుష్ఠితాః
కచ్చి ద్రాజన్ కృతా న్యేవ కృతప్రాయాణి వా పునః ౩౩

విదు స్తే వీర కర్మాణి నానవాప్తాని కానిచిత్
కచ్చి త్కారణికా ధర్మే సర్వశాస్త్రేషు కోవిదాః ౩౪

కారయంతి కుమారాంశ్చ యోధముఖ్యాంశ్చ సర్వశః
కచ్చి త్సహస్రై ర్మూర్ఖాణా మేకం క్రీణాసి పండితం ౩౫

పండితో హ్యర్థ కృచ్ఛ్రేషు కుర్యా న్నిశ్శ్రేయసం పదమ్
కచ్చి ద్దుర్గాణి సర్వాణి ధనధాన్యాయుధోదకైః ౩౬
యంత్రైశ్చ పరిపూర్ణాని తథా శిల్పి ధనుర్ధరైః
ఏకోఽప్యమాత్యో మేధావీ శూరో దాంతో విచక్షణః
రాజానం రాజపుత్రంవా ప్రాపయే న్మహతీం శ్రియమ్ ౩౭

కచ్చి దష్టాదశాన్యే స్వపక్షే దశపంచచ
త్రిభి స్త్రిభి రవిజ్ఞాతై ర్వేత్సి తీర్థాని చారకైః ౩౮

కచ్చి ద్ద్విషా మవిదితః ప్రతిపన్నశ్చ సర్వదా
నిత్యయుక్తో రిపూన్సర్వాన్ వీక్షసే రిపుసూదన ! ౩౯

కచ్చి ద్వినయసంపన్నః కులపుత్రో బహుశ్రుతః
అనసూయు రసంకీర్ణ స్సత్కృత స్తే పురోహితః ౪౦

కచ్చి దగ్నిషు తే యుక్తో విధిజ్ఞో మతిమా నృజుః
హుతంచ హోష్యమాణంచ కాలే వేదయతే సదా ౪౧

కచ్చి దంగేషు విష్ణాతో జ్యోతిషః ప్రతిపాదకః
ఉత్పాతేషుహి సర్వేషు దైవజ్ఞః కుశల స్తవ ౪౨

కచ్చి న్ముఖ్యా మహత్స్వేవ మధ్యమేషుచ మధ్యమాః
జఘన్యాశ్చ జఘన్యేషు భృత్యాః కర్మసు యోజితాః ౪౩

అమాత్యా నుపధాతీతాన్ పితృపైతామహాన్ శుచీన్
శ్రేష్ఠాన్ శ్రేష్ఠేషు కచ్చి త్త్వం నియోజయసి కర్మసు ౪౪

కచ్చిన్నోగ్రేణ దండేన భృశ ముద్విజసే ప్రజా
రాష్ట్రిం త వానుశాసంతి మంత్రిణో భరతర్షభ ! ౪౫

కచ్చి త్త్వాం నావజానంతి యాజకాః పతితం యథా
ఉగ్రం ప్రతిగ్రహీతారం కామయాన మివ స్త్రియః ౪౬

కచ్చి ద్ధృష్టశ్చ శూరశ్చ మతిమాన్ ధృతిమాన్ శుచిః
కులీన శ్చానురక్తశ్చ దక్ష స్సేనాపతి స్తవ ౪౭

కచ్చి ద్బలస్య తే ముఖ్యా స్సర్వేయుద్ధవిశారదాః
ధృష్టావదాతా విక్రాంతా స్త్వయా సత్కృత్య మానితాః ౪౮

కచ్చి ద్బలస్య భక్తంచ వేతనంచ యథోచితం
సంప్రాప్తకాలే దాతవ్యం దదాసిన వికర్షసి ౪౯

కాలాతిక్రమణా దేతే భక్తవేతనయో ర్భృతాః
భర్తుః కుర్వంతి దౌర్గత్యా త్సోఽనర్థ స్సుమహాన్ స్మృతః ౫౦

కచ్చి త్సర్వేఽనురక్తా స్త్వాం కులపుత్రాః ప్రధానతః
కచ్చి త్ప్రాణాం స్తవార్థేషు సంత్యజంతి సదా యుధి ౫౧

కచ్చి న్నైకో బహూ నరాన్ సర్వశ స్సాంప రాయికాన్
అనుశాస్తి యథాకామం కామాత్మా శాసనాతిగః (గతిః) ౫౨

కచ్చి త్పురుషకారేణ పురుషః కర్మ శోభయన్
లభతే మాన మధికం భూయోవా భక్తవేతనమ్ ౫౩

కచ్చి ద్విద్యావినీతాంశ్చ నరాన్ జ్ఞానవిశారదాన్
యథార్హం గుణత శ్చైవ దానే నాభ్యుపపద్యసే ౫౪

కచ్చి ద్దారాన్ మనుష్యాణాం తవార్థే మృత్యు మీయుషాం
వ్యసనం చాభ్యుపేతానాం బిభర్షి భరతర్షభ! ౫౫

కచ్చి ద్భయా దుపగతం క్షీణంవా రిపు మాగతం
యుద్ధేవా విజితం పార్థ పుత్రవ త్పరిరక్షసి ౫౬

కచ్చి త్త్వమేవ సర్వస్యాః పృథివ్యాః పృథివీపతే
సమ శ్చానభిశంక్యశ్చ యథా మాతా యథా పితా ౫౭

కచ్చి ద్వ్యసనినం శత్రుం నిశమ్య భరతర్షభ!
అభియాసి జవే నైవ సమీక్ష్య త్రివిధం బలమ్ ౫౮

యాత్రా మారభసే దిష్ట్యా ప్రాప్తకాల మరిందమ
పార్ష్ణిమూలంచ విజ్ఞాయ వ్యవసాయం పరాజయమ్ ౫౯

బలస్యచ మహారాజ దత్వా వేతన మగ్రత:
కచ్చిచ్చ బలముఖ్యేభ్య: పరరాష్ట్రే పరంతప! ౬౦

ఉపచ్ఛన్నాని రత్నాని ప్రయచ్ఛసి యథార్హత:
కచ్చి దాత్మాన మేవాగ్రే విజిత్య విజితేంద్రియ: ౬౧

పరాన్ జిగీషసే పార్థ! ప్రమత్తా నజితేంద్రియాన్
కచ్చి త్తే యాస్యత శ్శత్రూన్ పూర్వం యాంతి స్వ నితా: ౬౨

సామ దానంచ భేదశ్చ దండశ్చ విధివ ద్గుణా:
కచ్చి న్మూలం దృఢం కృత్వా పరాన్ యాసి విశాంపతే! ౬౩

తాంశ్చ విక్రమసే జేతుం జిత్వాచ పరిరక్షసి
కచ్చి దష్టాంగ సంయుక్తా చతుర్విధబలా చమూ: ౬౪

బలముఖ్యై స్సునీతా తే ద్విషతాం ప్రతివర్ధినీ
కచ్చి ల్లవంచ ముష్టించ పరరాష్ట్రే పరంతప! ౬౫

అవిహాయ మహారాజ నిహంసి సమరే రిపూన్
కచ్చి త్స్వ పరరాష్ట్రేషు బహవోధికృతా స్తవ ౬౬

అర్థాన్ సమధితిష్టంతి రక్షంతిచ పరస్పరమ్
కచ్చి దభ్యవహార్యాణి గాత్రసంఘర్షణానిచ ౬౭

ఘ్రేయాణిచ మహారాజ రక్షం త్యనుమతా స్తవ
కచ్చి త్కోశశ్చ గోష్ఠంచ వాహనం ద్వార మాయుధమ్ ౬౮

ఆయశ్చ కృతకల్యాణై స్తవ భక్తై రనుష్ఠిత:
కచ్చి దాభ్యంతరేభ్యశ్చ బాహ్యేభ్యశ్చ విశాంపతే! ౬౯

రక్షః స్వాత్మాన మేవాగ్రే తాంశ్చ స్వేభ్యో మిథశ్చ తాన్
కచ్చి న్న పానే ద్యూతేవా క్రీడాసు ప్రమదాసుచ ౭౦

ప్రతిజానంతి పూర్వాహ్ణే వ్యయం వ్యసనజం తవ
కచ్చి దాయస్య చార్ధేన చతుర్భాగేనవా పునః ౭౧

పాదభాగై స్త్రిభిర్వాపి వ్యయ స్సంశోధ్యతే తవ
కచ్చిత్ జ్ఞాతీన్ గురూన్ వృద్ధాన్ వణిజ శ్శిల్పినశ్శ్రితాన్ ౭౨

అభీక్ష్ణ మనుగృహ్ణాసి ధనధాన్యేన దుర్గతాన్
కచ్చి చ్చాయ వ్యయే యుక్తా స్సర్వే గణక లేఖకాః ౭౩

అనుతిష్ఠంతి పూర్వాహ్ణే నిత్య మాయ వ్యయం తవ
కచ్చి దర్థే ష్వసంమూఢాన్ హితకామా ననుప్రియాన్ ౭౪

నాపకర్షసి కర్మభ్యః పూర్వ మప్రాప్య కిల్బిషం
కచ్చి ద్విదిత్వా పురుషా నుత్త మాధమ మధ్యమాన్ ౭౫

త్వం కర్మ స్వనురూపేషు నియోజయసి భారత!
కచ్చి న్నలుబ్ధా శ్చౌరావా వైరిణోవా విశాంపతే! ౭౬

అప్రాప్తవ్యవహారావా తవ కర్మ స్వనుష్ఠితాః
కచ్చి న్న చౌరై ర్లుబ్ధైర్వా కుమారైః స్త్రీబలేనవా ౭౭

త్వయావా పీడ్యతే రాష్ట్రం కచ్చి త్తుష్టాః కృషీవలాః
కచ్చి ద్రాష్ట్రే తటాకాని పూర్ణానిచ బృహంతిచ ౭౮

భాగశో విని విష్టాని న కృషి ర్దేవమాతృకా
కచ్చి న్న బీజం భక్తంచ కర్షక స్యావసీదతి ౭౯

పాదికంచ శతం వృద్ధ్యా దదా స్యృణ మనుగ్రహం
కచ్చి త్స్వనుష్ఠితా తాత! వార్తా తే సాధుభి ర్జనైః ౮౦

వార్తాయాం సంశ్రిత స్తాత! లోకో౽యం సుఖ మేధతే
కచ్చి చ్ఛూరాః కృతప్రజ్ఞాః పంచ పంచ స్వనుష్ఠితాః ౮౧

క్షేమం కుర్వంతి సంహత్య రాజన్ జనపదే తవ
కచ్చి న్నగరగుప్త్యర్థం గ్రామా నగర వ త్కృతాః ౮౨

గ్రామవ చ్చ కృతా ఘోషా స్తేచ సర్వే త్వ దర్పణాః
కచ్చి ద్బలే నానుగతాః సమాని విషమాణిచ ౮౩

పురాణి చౌరా నిఘ్నంత శ్చరంతి విషమే తవ
కచ్చిత్ స్త్రియ స్సాంత్వయసి కచ్చి త్తాశ్చ సురక్షితాః ౮౪

కచ్చి న్న శ్రద్ధ ధాస్యాసాం కచ్చి ద్గుహ్యం న భాషసే
కచ్చి దాత్యయికం శ్రుత్వా తదర్థ మనుచింత్యచ ౮౫

ప్రియా ణ్యనుభవన్ శేషే న త్వ మంతః పురే నృప!
కచ్చి ద్ద్వౌ ప్రథమౌ యామౌ రాత్రేః సుప్త్వా విశాంపతే ౮౬

సంచింతయసి ధర్మార్థౌ యామ ఉత్థాయ పశ్చిమే
కచ్చి ద్దర్శయసే నిత్యం మనుష్యాన్ సమలంకృతః ౮౭

ఉత్థాయ కాలే కాలజ్ఞై స్సహ పాండవ మంత్రిభిః
కచ్చి ద్రక్తాంబర ధరాః ఖడ్గ హస్తాః స్వలంకృతాః ౮౮

ఉపాసతే త్వా నభితో రక్షణార్థ మరిందమ
కచ్చి ద్దండ్యేషు యమవ త్పూజ్యేషుచ విశాంపతే ౮౯

పరీక్ష్య వర్తసే సమ్య గప్రియేషు ప్రియే చ
కచ్చి చ్ఛారీర మాబాధ మౌషధై ర్నియ మేన వా ౯౦

మానసం వృద్ధ సేవాభిః సదా సార్థా ప కరసి
కచ్చి ద్వైద్యా శ్చికిత్సాయా మష్టాంగాయాం విశారదాః ౯౧

సుహృద శ్చానురక్తాశ్చ శరీరే తే హితాః సదా
కచ్చిన్న లోభా న్మోహాద్వా మానాద్వాపి విశాంపతే! ౯౨

అర్థి ప్రత్యర్థినః ప్రాప్తా న్నా పాస్యసి కథంచన
కచ్చి న్నలోభా న్మోహాద్వా విస్రంభా త్ప్రణయేన వా ౯౩

ఆశ్రితానాం మనుష్యాణాం వృత్తిం త్వం సరుణత్సివై
కచ్చిత్ సారా న సహితా యేచ తే రాష్ట్ర వాసినః ౯౪

త్వయాసహ విరుధ్యంతే పరైః క్రీతాః కథంచన
కచ్చ న్న దుర్బలః శత్రు ర్బలేన పరిపీడితః ౯౫

మంత్రేణ బలవాన్ కశ్చి దుభాభ్యాంచ కథంచన
కచ్చి త్సర్వేఽనురక్తా స్త్వాం భూమిపాలాః ప్రధానతః ౯౬

కచ్చి త్ప్రాణాం స్త్వ దర్థేషు సంత్యజంతి త్వయా ధృతాః
కచ్చి త్తే సర్వవిద్యాసు గుణతోఽర్చా ప్రవర్తతే ౯౭

బ్రాహ్మణానాంచ సాధూనాం తవ నైశ్శ్రేయసీ శుభా
కచ్చి ద్ధర్మే త్రయీమూలే పూర్వై రాచరితే జనైః ౯౮

యతమాన స్తథా కర్తుం తస్మిన్ కర్మణి వర్తసే
కచ్చి త్తవ గృహేఽన్నాని స్వాదూ న్యశ్నంతి వై ద్విజాః ౯౯

గుణవంతి గుణోపేతా స్తవాధ్యక్షం సదక్షిణాః
కచ్చిత్ క్రీత్వానేకచిత్తో వాజిపేయాంశ్చ సర్వశః ౧౦౦

పుండరీకాంశ్చ కార్త్స్న్యేన యతసే కర్తు మాత్మవాన్
కచ్చిత్ జ్ఞాతీన్ గురూన్ వృద్ధాన్ దేవతా స్తాపస నపి ౧౦౧

చైత్యాంశ్చ వృక్షాన్ కల్యాణాన్ బ్రాహ్మణాంశ్చ నమస్యసి
కచ్చిచ్ఛోకో నమన్యుర్వా త్వయా ప్రోత్పాద్య తేఽనఘ ౧౦౨
అపి మంగలహస్తశ్చ జనః పార్శ్వేఽనుతిష్ఠతి
కచ్చి దేషాచ తే బుద్ధి ర్వృత్తి రేషాచ తేఽనఘ ౧౦౩

ఆయుష్యాచ యశస్యాచ ధర్మకామార్థదర్శినీ
ఏతయా వర్తమానస్య బుద్ధ్యా రాష్ట్రం న సీదతి ౧౦౪

విజిత్యచ మహీం రాజా సోఽత్యంతం సుఖమేధతే
కచ్చి దార్యో విశుద్ధాత్మా క్షారిత శ్చౌరకర్మణి ౧౦౫

అదృష్టశాస్త్రకుశలై ర్న లోభా ద్వధ్యతే శుచిః
దుష్టో గృహీత స్తత్కారీ దక్షై ర్దృష్ట స్సకారణః ౧౦౬

కచ్చి న్న ముచ్యతే స్తేనో ద్రవ్యలాభా న్నరర్షభ!
ఉత్పన్నాన్ కచ్చి దాఢ్యస్య దరిద్రస్యచ భారత! ౧౦౭

అర్థా న్న మిథ్యా పశ్యంతి తవామాత్యా హృతా ధనైః
నాస్తిక్య మనృతం క్రోధం ప్రమాదం దీర్ఘసూత్రతాం ౧౦౮

అదర్శనం జ్ఞానవతా మాలస్యం పంచవృత్తితాం (క్షిప్తచిత్తతాం)
ఏకచింతన మర్థానా మనర్థజ్ఞైశ్చ చింతనమ్ ౧౦౯

నిశ్చితానా మనారంభం మంత్రస్యాపరిరక్షణం
మంగలా ద్యప్రయోగంచ ప్రత్యుత్థానంచ సర్వతః ౧౧౦

కచ్చి త్త్వం వర్జయ స్యేతాన్ రాజదోషాం శ్చతుర్దశ
ప్రాయశో యై ర్వినశ్యంతి కృతమూలాశ్చ పార్థివాః ౧౧౧

కచ్చి త్తే సఫలా వేదాః కచ్చి త్తే సఫలం ధనం
కచ్చిత్తే సఫలా దారాః కచ్చి త్తే సఫలం శ్రుతమ్ ౧౧౨

యుధిష్ఠరః

కథం వై సఫలా వేదాః కథం వై సఫలం ధనం
కథం వై సఫలా దారాః కథం వై సఫలం శ్రుతం ౧౧౩

నారదః

అగ్నిహోత్రఫలా వేదాః దత్త భుక్త ఫలం ధనం
రతిపుత్రఫలా దారా శ్శీలవృత్తఫలం శ్రుతమ్ ౧౧౪

ఏత దాఖ్యాయ స ముని ర్నారదో వై మహాతపాః
పప్రచ్ఛానంతర మిదం ధర్మాత్మానం యుధిష్ఠిరమ్ ౧౧౫

కచ్చి దభ్యాగతా దూరా ద్వణిజో లాభకారణాత్
యథోక్త మవహార్యంతే శుల్కం శుల్కోపజీవిభిః ౧౧౬

కచ్చి త్తే పురుషా రాజన్ ! పురే రాష్ట్రే చ మానితాః
ఉపానయంతి పణ్యాని ఉపధాభి రవంచితాః ౧౧౭

కచ్చి చ్ఛృణోషి వృద్ధానాం ధర్మార్థ సహితా గిరః
నిత్య మర్థ విదాం తాత ! యథా ధర్మార్థ దర్శినామ్ ౧౧౮

కచ్చి త్తే కృషి తంత్రేషు గోషు పుష్ప ఫలేషు చ
ధర్మార్థంచ ద్విజాతిభ్యో దీయతే మధుసర్పిషీ ౧౧౯

ద్రవ్యోపకరణం కించి త్సర్వదా సర్వ శిల్పినాం
చాతుర్మాస్యావరం సమ్య జ్నియతం సంప్రయచ్ఛసి ౧౨౦

కచ్చి త్కృతం విజానీషే కర్తారంచ ప్రశంససి
సతాం మధ్యే మహారాజ సత్కరోషిచ పూజయన్ ౧౨౧

కచ్చి త్సూత్రాణి సర్వాణి గృహ్ణాసి భరతర్షభ !
హస్తి సూత్రాశ్వసూత్రాణి రథసూత్రాణివావిభో ! ౧౨౨

కచ్చి దభ్యస్యతే సమ్యక్ గృహే తే భరతర్షభ !
ధనుర్వేదస్య సూత్రంవై యంత్ర సూత్రంచ నాగరమ్ ౧౨౩

కచ్చి దస్త్రాణి సర్వాణి బ్రహ్మ దండశ్చ తే. నఘ !
విషయోగా స్తథా సర్వే సర్వే విదితా శ్శత్రునాశనాః ౧౨౪

కచ్చి దగ్నిభయా చ్చైవ సర్వం వ్యాళభయా త్తథా
రోగర క్షోభయాచ్చైవ రాష్ట్రం స్వం పరిరక్షసి ౧౨౫

కచ్చి దంధాంశ్చ మూకాంశ్చ పంగూన్ వ్యంగా నబాంధవాన్
పితేవ పాసి ధర్మజ్ఞ తథా ప్రవ్రజితా నపి ౧౨౬

షడనర్థా మహారాజ కచ్చి త్తే పృష్ఠతః కృతాః
నిద్రాలస్యం భయం క్రోధో మార్దవం దీర్ఘ సూత్రతా ౧౨౭

తతః కురూణా మృషభో మహాత్మా
శ్రుత్వా గిరో బ్రాహ్మణసత్తమస్య
ప్రణమ్య పాదా నభివాద్య తుష్టో
రాజా బ్రవీన్నారదం దేవరూపమ్ ౧౨౮

ఏవం కరిష్యామి యథా త్వయోక్తం
ప్రజ్ఞాహి మే భూయ ఏ నాభి వృద్ధా
ఉక్త్వా తథా చైవ చకార రాజా
వేభా మహీం సాగర మేఖలాంచ ౧౩౦

నారదః

ఏవం యో వర్తతే రాజా చాతుర్వర్ణ్యస్య రక్షణే
స విహృత్యేహ సుసుఖీ శక్రస్యేతి సలోకతామ్ ౧౩౧

మహాత్ములగు పాండవులు దివ్యమైన మయసభయందు మహాత్ము్పురుషులతోను, గంధర్వులతోను కూడియుండిరి. అపుడు నారదుఁను తెంచెను. వేదోపనిషద్వేత్త-సురగణార్చితుఁడు ఇతిహాస పురాణజ్ఞుఁడు పురాకల్ప విశేషవేత్త న్యాయవేత్త, ధర్మతత్త్వజ్ఞుఁడు, షడంగవేత్త ఐక్య సంయోగ నానాత్వ సమవాయ విశారదుఁడు వక్త ప్రగల్భుఁడు మేధావి,స్మృతిమంతుఁడు, నయవేత్త,కవి పరాపరవిభాగజ్ఞుఁడు ప్రమాణ కృతనిశ్చయుఁడు పంచావయవయుక్త-వాక్యగుణదోషవేత్త,బృహస్పతి వచనమందును ఉత్తరోత్తరవక్త ధర్మకామార్థమోక్షములందు యథావతు కృత నిశ్చయుఁడు, సర్వ భువన కోశము సర్వస్వమున కట్లే మహామతిలోకముయొక్క తిర్యగూర్ధ్వాధోముఖమందును నట్లే ప్రత్యక్షదర్శి సాంఖ్యయోగవిభాగజ్ఞుఁడు సురాసురనిర్వివిత్సుఁడు, సంధివిగ్రహ తత్త్వజ్ఞుఁడు, అనుమానవిభాగవేత్త, షాడ్గుణ్యవిధి యుక్తుఁడు, సర్వశాస్త్ర విశారదుఁడు, యుద్ధగాంధర్వసేవ్యుఁడు, సర్వత్రాప్రతిఘుఁడు ఏవంగుణములు మఱియునితరములగు గుణగణముల సంఖ్యముగా గల్గినవాఁడు ముని, సర్వలోకసంచారి, లోకసభావర్తి, యగు నారదుఁడు ఋషి సహితుఁడై పాండవులనుఁ జూడనే తెంచెను. పారిజాతుఁడు, రైవతుఁడు, సుముఖుఁడు మొదలగువారితోఁగూడి యమితద్యుతియగు నారదుఁడు

పాండవులనుఁ జూడ మత్సరుడై మనోజవమునవిచ్చేసెను. ధర్మజుని గాంచి జయాశీస్సులు గావించెను. ధర్మజుఁడు భ్రాతృసహితుఁడై ప్రత్యుత్థాన మొనరించి, యభివాదన మొనరించెను. వినయావనతుఁడై యథావిధిగా నర్ఘ్యాసన మొసంగెను. అర్ఘ్యపాద్యాదులగు విధుల నొనరించెను. వేదపారగుండగు నారదుఁడు ధర్మజుని సపర్యలనొంది ధర్మకామార్థ సంయుక్తముగా నిట్లు వచించెను.

## కచ్చిదధ్యాయము

అర్థములు కల్పింపబడుచున్నవా ధర్మమందు మనస్సు రమింపుచున్నదా? సుఖానుభూతి యగుచున్నదా? మనోవికలన మగుట లేదుకదా. నరదేవపితామహులు - పూర్వు లాచరించిన యత్యుద్ర వృత్తియందు ధర్మార్థసహితముగ త్రయోవర్తనమున నుంటివా ధర్మమున నర్థము అర్థమున ధర్మము ధర్మార్థములు రెండును ప్రీతిపారమున కామప్రబాధితము కాకుండ వర్తించుచుంటివా? జయతాం వరుడా! అర్థము, ధర్మము, కామము - మూటిని కాలజ్ఞుడా! కాలవిభాగమున వరదుడా! సమముగా సేవించుచుంటివా? రాజగుణము లారింటిచే సప్తోపాయము లెఱుఁగుచు బలాబల నిరీక్షణము చకరుగా పదునాల్గింటిని పరీక్షించుచుంటివా? తన్న - పరులను గమనించుకొనుచు కర్మలను సంధించుచు భారత! ఎనిమిదింటిని సేవించుచుంటీవా? సప్త ప్రకృతులు లోపము లేకుండ నున్నవా? ఆఢ్యు లవ్యసనులై సర్వశః అనురక్తులే కదా! అపరిశంకిత దూతలచేగాని, నీచేగాని, అమాత్యుల చేగాని, మంత్రము వెలికాలేదుకదా! మిత్రోదాసీన శత్రువుల చికీర్షిత మెఱుఁగుచున్నావా? యథాకాలమున సంధిని విగ్రహమును గావించుచుంటివా? ఉదాసీన మధ్యముల వృత్తి ననుమతించి యుంటివి కదా! ఆత్మసముల, వృద్ధుల, శుద్ధులు, సంభోధనక్షములు, కులీనులనురక్తులగు వారలను, మంత్రులను గావించియుంటివా? విజయము

రాజులకు మంత్రిమూలమే కదా! శాస్త్రకోవిదు లమాత్యులు సంవృత మంత్ర మొనరించువార లైయుండ రాష్ట్రము సురక్షితమై యున్నదా? నిద్రావశ మొందకుంటివి కదా! కాలమందు మేల్కాంచుచుంటివి కదా! అర్థతత్త్వజ్ఞుడవై యపరరాత్రములం దర్థచింతనము గావించుచున్నావా ఒకరుఁడవే యాలోచించుట, బహుజనముతో నాలోచించుట, చేయకుంటివికదా! నీ మంత్రము రాష్ట్రము వెలుపలకు పాఱుటలేదుకదా! లఘుమూలములు మహోదయములు నైన యర్థముల నిశ్చయించి (అనిశ్చయించిన) వానిని వెంటనే యాచరించుచుంటివా? (అమలు గావించుచుంటివా?) అట్టి వానికి విఘ్న మాపాదించుట లేదుకదా! కర్మాంతము లన్నియు పరోక్ష శంకితములు కాలేదుకదా! అన్నియుఁ బునరుత్సృష్టములగుటకు సంసృష్టమే కారణమగును. అస్తులు అలుబ్ధులు క్రమికు లగువారలచేనవి యనుష్ఠింపబడుచున్నవా? కృతములు కృతప్రాయము లగునప్పుడే నీ కార్యములు వెల్లడియగుచున్నవా? అనవాప్తములగునవి ఎప్పుడుకాని వెల్లడియగుట కాలేదు కదా! ధర్మకారుణి కత్వముగల్గి సర్వ శాస్త్రకోవిదులై యున్న కుమారుల యోధముఖ్యులనుగ నంతటగావించుచున్నావా? సహస్ర మూర్ఖులకే కాని యొకరు పండితుని కొనుగోలు గావించు వాడవై యుంటివా? పండితుఁడర్థ కృచ్ఛ్రములందు పరమనిశ్శ్రేయస మొనగూర్ప గలవాఁడు, దుర్గము లన్నియు ధనధాన్యాయుధోదకములుగల్గి యంత్రపరిపూర్ణమై యున్నవా? అట్లే శిల్పధనుర్ధరులచే గూడియున్నవా ఒకరుఁడే కానిమ్ము మేధావిశూరుఁడు దాంతుడునగు నమాత్యుడు విచక్షణుడు రాజునుగాని రాజపుత్రునిగాని మహత్ శ్రియ మొందువాని గావింపగలవాఁడగును. అష్టాదశ తీర్థములను, స్వపక్షమున పంచ

దశ తీర్థముల ననిజ్ఞాతుటగు ముగ్గురు ముగ్గురు చారుల నియమించి తెలియువాఁడ వగుచుంటివా ? ద్విషదవిదితుఁడవై సర్వదా ప్రతిపన్నుఁడవై నిత్యయుక్తుఁడ వగుచు శత్రువులనెల్ల గనిపెట్టుచుంటివా? వినయ సంపన్నుఁడు, కులపుత్రుఁడు, బహుశ్రుతుఁడు అసూయలేనివాఁడు అసంకీర్ణుఁడునగు నీ పురోహితుఁడు సత్కృతుఁడై యున్నాఁడా? మఱియు నతఁడగ్ని కార్యయుక్తుఁడై, విధిజ్ఞుఁడై, మతిమంతుఁడు ఋజువునై హుతము హోష్యమాణ మగువానిని కాలమందు సదా నివేదించుచున్నాఁడా? అంగనిష్ణాతుఁడై, జ్యోతిష ప్రతిపాదకుఁడై, ఉత్పాత పరిజ్ఞాతయైన నీదైవజ్ఞుఁడు కుశలమున్నాఁడా? ముఖ్యులను మహాత్కార్యములందు, మధ్యములను మధ్యమములందు, జఘన్యులను జఘన్యములందు, నాయాకృత్యములం దాయాభృత్యులను నియోగించుచుంటివా? పితృపైతామహముగా నేర్పడియుండి కొలుచువా రమాత్యులు శుచిమంతులు శ్రేష్ఠులు నగువారలను శ్రేష్ఠములగు కృత్యములందు నియోగించుచుంటివా? ఉగ్రదండమున నెక్కువగా బ్రజలను బాధింపవు కదా! భరతర్షభ ! మంత్రులు చక్కగా రాష్ట్రము ననుసరించి శాసించుచున్నారా? ఉగ్రప్రతిగ్రహణ మొనరించువాఁడవమానమొందగలఁడు. యాజకులు పతితుని, స్త్రీలు కాముకుని, యవమానించున లోక ముగ్రప్రతిగ్రహణ మొనరించువాని నవమానింపగల దట్లు నీవు కాలేదు కదా! హృష్టుఁడు శూరుఁడు మతిమంతుఁడు ధృతిమంతుఁడు శుచిమంతుఁడు కులీనుఁడనురక్తుఁడు దక్షుడు నగువాఁడు నీకు సేనాపతి గలఁడా! నీ బలముఖ్యులు సర్వ యుద్ధ విశారదులే కదా! ధృష్టావధాతులు, పరాక్రమవంతులు నగు సేనా ముఖ్యులు నీచే సత్కృతులై మన్నన నొందుచున్నారా? నీ బలమునకు భక్తము (బత్తెము) వేతనము యథోచితముగా నొసంగుచుంటివా? సంప్రాప్త

కాలమందే యిచ్చుచున్నావా ? వానిని లాగి పెట్టుకొనవు కదా ! కాలాతిక్రమమగుచో నివి ప్రభువునందు దౌర్గత్యమున హేతువగును! (అట్లుగా వారు వర్తించెద రది మహాదనర్థ మగునని స్మృతము. కుల పుత్రులగు ప్రధానులందఱు ననురక్తులై యున్నారా? నీ నిమిత్తముగా సదా యుద్ధమందు ప్రాణ మర్పించువారుగా నున్నారా? కామాత్ములై శాసన మతిక్రమించి యథాకామముగా బనులాచరించువారు లేరు కదా! నీ పురుషులు పురుషకారమున కర్మశోభ గల్గించుచు నధికమాన మొందువారై, మఱియు భక్త వేతనముల నొందుచున్నారా? విద్యావినీతులు జ్ఞాన విశారదులు నగువారి నియథార్హ గుణముగా దాన సన్మానమొనరించి గౌరవించుచున్నావా? నీ నిమిత్తముగా ప్రాణ మర్పించియున్న వారల భార్యలను—సంకట పరిస్థితి యందున్న వారలను నీవు గనిపెట్టు చున్నావా? భయమున చేరవచ్చిన వారిని క్షీణ పరిస్థితిగా నచ్చియున్న శత్రువును యుద్ధ విజితుని పుత్రవతుగా గాపాడు చున్నావా? నీవే పృథివికంతకు నిశ్శంకగా సమవర్తి వగుచు తల్లి వలెను తండ్రి వలెను నుంటివా? శత్రువు వ్యసనమందుండుట తెలిసి త్రివిధ బలమును చూచుకొని వేవేగ నెదురించువాడ వగుచున్నావా? ప్రాప్త కాలమును పార్ష్ణి మూలమును వ్యవసాయమును పరాజయమును నిర్ణయించుకొని (యుద్ధ) యాత్ర గావించుచున్నావా? బలమునకు ముందుగనే వేతనమొసంగుచు పరరాష్ట్ర బలముఖ్యులకు యథార్హముగ రత్నముల నుపచ్ఛన్నముగా నొసంగుచుంటివా? మొదట నాత్మ విజయమును సాధించి విజితేంద్రియుఁడవై ప్రమత్తుల నజితేంద్రియుల నగు బగులను జయించు చుంటివా?

## నారదోపదేశము.

శత్రువులపైకి బోవు నీవు ముందుగా సామము దానము భేదము దండము క్రమమున విధివతుగావించుట గుణము లగును. మూలమును దృఢముగావించుకొని పరులను జయింతువా? అష్టాంగ సంయుక్తమైన చతుర్విధ బలమగు సైన్యము సునీతులైన బల ముఖ్యులచే నడిపింపఁబడుచు ద్విషత్ప్రతివర్ధన మగుచున్నదా? పర రాష్ట్రమందు లవము ముష్టి—వీనిని విడువక సమరమందు శత్రువులను వధించుచున్నావా? స్వపరరాష్ట్రములం దధికృతులైన నీ యొక్క బహుజను లర్థ సమర్థులై యున్నారా? వారు పరస్పర రక్ష గావించు కొన జాగ్రత్త నొందియున్నారా? అభ్యవహార్యములగునట్టి గాత్రి సంఘర్షణములు ప్రేయములు — వీనిని నీ యనుమతి ప్రకారము రక్షించువారై నీవార లున్నారా.? కోశము గోష్ఠము వాహనము ద్వారము ఆయుధము ఆయము—వీనిని కృతకళ్యాణులగు నీ భక్తులు (పరిజనులు) అనిష్ఠించువారై యున్నారా? అభ్యంతర బాహ్యము లందు నిన్ను తొలిగా గాపాడుకొనును దత్ప్రవర్తకులను స్వకీయులచే రక్షించు వాఁడవగుచున్నావా? పానము, ద్యూతము, క్రీడ, స్త్రీలు— ఇందు పూర్వాహ్ణ వ్యసనజమైన వెచ్చము వెల్లడియగుటఁగా లేదుకద! (౭౨ శ్లోకము) ఆదాయమునం దర్ధముగాని, చతుర్భాగముగాని, త్రిపాద భాగముగాని ఈ మూడు విధములుగా నీ వ్యయము శోభించుచున్నదా? జ్ఞాతులు గురువులు వృద్ధులు వణిజులు శిల్పులు ఆశ్రితులు—వీరి నభీక్ష్ణ మనుగ్రహించుచుంటివా? ధనధాన్య దుర్గతులగువారి నిందు గాపాడు చున్నావా? ఆయవ్యయయుక్తులైన సర్వ గణక లేఖకులు పూర్వాహ్ణమందు నీ సముఖమున వానిని ప్రతి దినము చూపుచు

విన్ననుసరించుచున్నారా ? అర్థ... లం దసంమూ... హితనాయులు అను ప్రతు... నగునట్టి వారిని - అప్రాహ్యకిల్బిషులైన వారిని గుండే వ్యాపారములనుండి (పనుల నుండి) అవకర్ష గావింపవు కదా! ఉత్త మాధమమధ్యములగు వారెవ్వరెవ్వరో తెలిసి వారివారి కనురూపములగు కర్మలందు ( పనులందు ) వారివారిని నియోగించుచున్నావా ? లుబ్ధులు, చోరులు, వైరులు, అప్రాప్త వ్యవహారులు నను వారు నీ కర్మలం గేర్పడియుండుట లేదుకదా ! చోరులు, లుబ్ధులు కుమారులు స్త్రీలు—వీరి వలనగాని నీ వలనగాని రాష్ట్రము పీడింపబడుట లేదుకదా! కృషీవలులు తుష్టులైయున్నారా. నీ రాష్ట్రమందు తటాకములు పూర్ణముగను బృహత్తుగను నున్నవా. అవి భాగశః చక్కగా వినియోగమగుచున్నవా దేవమాతృకలు లేనిదే కృషిఫలించునది కాజాలదుకదా నిత్తనములు బత్తెములు కకర్షకులకు గొఱతకాక యున్నవా. నూటికి నాలుగు వృద్ధిగా ఋణానుగ్రహము వారికిలభించుచున్నదా. నీ వార్త సాధుజనులచే ననుష్ఠింపబడుచున్నదా. (ఆ) వార్తయందు సంశ్రితమైన యీ లోకము సుఖమొందునదగును (౮ ౨) శ్లోకము) శూరులు కృతప్రజ్ఞు... నైన పంచ పంచ జనులు జనపదమందొట్టుగా గార్యప్రవర్తకులైక్షేమ మొనగూర్చువా రగుచున్నారా? నగరగుప్త్యర్థము గ్రామములునగరములట్లు, ఘోషములు గ్రామములట్లు గావింపబడుచున్నవా ? అవన్నియు రాజార్పణములై యున్నవా ? సమ విషమములందు బలానుగతులై వర్తించు నీ జనులు పురసంచారము గావించువారై (గస్తీతిరుగువారై) చోరులను గొట్టుచు విషమమార్గ సంచారులగుచు రక్షగా వర్తించుచున్నారా? (౮౭ శ్లోకము) స్త్రీలను

సాంత్వన మొసఁగుచున్నావా ? వారు చక్కఁగా రక్షింపబడు చున్నారా? వారియందు శ్రద్ధవహించు వాఁడవు కాలేదుకదా! మఱియు వారికి గుహ్యమెఱిగింపవు కదా! అత్యయిక మగునది విని తదర్థము ను గూర్చి యోజించియు నద్దానిని గావింపకయే నీ వంతఃపురమందు ప్రియములనుభవించు వాఁడుగా నట్లు శయనించుట లేదుకదా! మొదటి రెండు యామములు పండుకొని పశ్చిమయామమున లేచి ధర్మార్థ ములను చింతించుచుంటివా? సకాలమున లేచి యలంకృతుఁడవై కాలజ్ఞు లగు మంత్రులతోఁగూడి ప్రజలకు నిత్యము దర్శన మొసంగు చుంటివా? రక్తాంబర ధరులు ఖడ్గ హస్తులు, స్వలంకృతులు నగు వారు నీ సమక్షమున రక్షణార్థమగు నుపాసన గావించువారలై యున్నారా? దండ్యుల వినయమై యమునట్లున్నావా? పూజ్యు లందును సమవర్తివై వర్తించుచుంటివా? పరీక్షించి ప్రియాప్రియ ములందు సమముగా వర్తించుచుంటివా? శరీర బాధల నౌషధ మునను నియమమున, మానసిక బాధలను పెద్దల సేవ వలనను, సంతతము పోఁగొట్టుకొనుచున్నావా? అష్టాంగ చికిత్సా విశారదులగు వైద్యులు సుహృదు లనురక్తులై సదా నీ హితమందున్నారా? లోభమునగాని మోహమునగాని మానమునగాని చేరవచ్చు నర్థి ప్రత్యర్థుల నుపేక్షించి నీ వుండుట లేదుకదా! లోభమున మోహ మున విస్రంభమున ప్రణయమున నాశ్రితుల వృత్తిని నీ వరి కట్టవుకదా! నీ పౌరులు రాష్ట్రవాసులు నిన్నుగాక పరివిక్రీతులై నీతో రోధ మొందరుకదా! దుర్బల శత్రువు బలపరి పీడితుఁడు కా లేఁడుకదా! బలవంతుఁడగు శత్రువు మంత్రమున పీడితుఁడు కాలేదు కదా!—వారు మంత్ర బల పరిపీడితు కాలేదుకదా! (౮౬ శ్లోకము)

భూమి పాలురందఱు ముఖ్యముగా నీయందనురక్తులై యున్నారా? త్వదర్థముగా వారు ప్రాణములు త్యజింప నుద్యుక్తులై యున్నారా? సర్వ విద్యలందు గుణతః సమానమేర్పడుచున్నదా? బ్రాహ్మణులు సాధువులు శుభముగా నీ యొక్క నిశ్శ్రేయసమందే యుండి యుందురా

త్రయీ మూలమగు ధర్మమందు పూర్వ జనులచే నాచరింపఁబడిన దానియందు నీవు ప్రవర్తించుచు వాని నట్లే సాగునట్లు గావించు చుంటివా? నీ గృహమున గుణోపేతులగు ద్విజులు గుణయుక్తమగు మధురాహారములు నదక్షిణముగా నారగించుచున్నారా? ఏక చిత్తుఁడవై క్రతువులను—వాజపేయము, పుండరీకము గావింప నుద్యుక్తుఁడవై యున్నావా? జ్ఞాతులను గురువులను వృద్ధులను దేవతలను తాపసులను చైత్యవృక్షములను బ్రాహ్మణులను నమస్కరించుచుంటివా? శోకమన్యు ప్రవర్తకుఁడుగా నీ వుండుట లేదు కదా!

మంగళహస్తులై జనులు నీకు పార్శ్వములందు వర్తించియున్నారా? అనఘ! ఇట్టి వ్యాపారమున నీ బుద్ధి వర్తించుచున్నదా? ఆయుష్యము యశస్సు గల్గించు ధర్మకామార్థ దర్శినియగు నిట్టి బుద్ధిని నీవు కల్గి వర్తించుచుంటివా? ఏవంగుణ ప్రవర్తిత బుద్ధియగు రాజు యొక్క రాష్ట్రము చెడుపు నొందదు (న సీదతి) ఆరాజే మహిని జయించి యత్యంతము సుఖమొందును. విశుద్ధాత్ముఁడగు నార్యుఁడు చోర కర్మయందు దూరితుఁడై యాశుచిమంతు ఁ డదృష్టశాస్త్రకుశలులగు వారిచే ద్రవ్యలాభమున (ద్రవ్యాశచే) వధ్యుఁడు కాలేదుకదా! దుష్టుఁడఁగువాఁడు గృహీతుఁడయ్యు దక్షులచే గాంచబడిన వాఁడయ్యు నట్టి సకారణుండైన తస్కరుఁడు (స్తేనః) ద్రవ్యలాభమున (ద్రవ్యాశచే) నిడివడుట లేదుకదా! ఆఢ్యుని యొక్క దరిద్రుని

యొక్క ఉత్పన్నములను-వారి యర్థములను నియమాత్యులు ద్రవ్య వ్యాప్తులై మిథ్యగాంచువారు కాలేదుకదా! నాస్తిక్యము అనృతము క్రోధము, ప్రమాదము, దీర్ఘ సూత్రత్వము, జ్ఞానవంతుల కదర్శనము, ఆలస్యము, పంచవృత్తిత్వము, ఏకచింతన మర్థములందు, అనర్థజ్ఞులతో చింతనము, నిశ్చితానారంభము, మంత్రా పరి రక్షణము, మంగళాద్య ప్రయోగము, సర్వశః ప్రత్యుత్థానము - ఈ పదునాల్గు రాజ దోషములను విసర్జించియుంటివా! కృతమూలులగు పార్థివులును ప్రాయశః వీని వలన వినాశనమొందువా రగుదురు.

నీ వేదములు సఫలములా? నీ ధనము సఫలమా? నీ దారలు సఫలమా? నీ శ్రుతము సఫలమా? నారదుఁడిట్టు విస్తార ప్రసంగము గావించెను

ధర్మరాజు "వేదము లెట్లు సఫలమగును? ధన మెట్లు సఫల మగును? భార్య యెట్లు సఫలమగును? శృత మెట్టు సఫలమగును?" అని యడిగెను. నారదుఁడు "అగ్ని హోత్ర ఫలితములు వేదములు, దత్త భుక్త ఫలము ధనము, రతి పుత్రి ఫలము దార, శీల వృత్త ఫలము శ్రుతము" అని పలికెను.

మహాతపస్కుఁడగు నారద మహాముని విస్తారప్రసంగ మింత గావించి ధర్మాత్ముఁడగు యుధిష్ఠిరుని గూర్చి యనంతర మిట్లు పలికెను. లాభకారణముగ దూరమునుండి అభ్యాగతులగు వణిక్కులు శుల్కోపజీవులచే శుల్కము యథోక్తముగా వసూలు గావింపబడు చున్నారా? పురమందు రాష్ట్రమందు సమ్మానితులై ఉపధాదులచే వంచితులుగాక పణ్యములనుఁదెచ్చియిత్తురా! ధర్మార్థ సహితమగు వృద్ధవచనము లాలకించుచుంటివా? అర్థవేత్తలు ధర్మార్థ దర్శను

లగువారి మాట ననునిత్యము పాటింతువా? కృషితంత్రమందు, గోవులందు, పుష్పఫలములందు, మధుసర్పిషములందు నేర్పడినది ధర్మార్థముగా ద్విజాదుల కొసంగఁబడుచున్నదా ? సర్వశిల్పులకును ద్రవ్యోపకరణమును సర్వదా చాతుర్మాస్యావరముగా సమ్యన్నియత మగునట్లొసంగుచుంటివా ? కృత మెఱుంగుచుంటివా ? ఆ కర్తను ప్రశంసించుచుంటివా ? సత్పురుషుల మధ్యలో గౌరవించి సత్కరించు చున్నావా ? సర్వసూత్రములను గ్రహించుచుంటివా ? హస్తి సూత్రములు, అశ్వసూత్రములు, రథ సూత్రములు-వాహన సర్వసూత్రముల నెఱుంగు చుంటివా? నీ యింట లెస్సగా నాగరమైన ధనుర్వేద సూత్రము యంత్ర సూత్ర మభ్యసింపఁబడుచున్నవా? సర్వాస్త్రములు, బ్రహ్మదండములు, విషయోగములు-శత్రు నాశనమైన వన్నియు విదితమైయున్నవా? అగ్ని భయము నుండి, వ్యాళభయము నుండి, రోగరక్షో భయమునుండి స్వరాష్ట్రము నుసంరక్షించుచుంటివా? అంధులను మూగవారిని, పంగులను వ్యంగులను అబాంధవులను, ధర్మజ్ఞుఁడా ! తండ్రియట్లు గాపాడు చుంటివా ? అట్లే ప్రవ్రాజులను గాపాడు చుంటివా? నిద్రాలస్యములు, భయము, క్రోధము, మార్దవము దీర్ఘసూత్రము-ఈ షడనర్థములను పృష్ఠమొనరించి యుంటివా? నారదుఁడింతటి ప్రసంగ్గమొనరించెను. కురువృషభుఁడు మహాత్ముఁడు యుధిష్ఠిరుఁడు బ్రాహ్మణసత్తముఁడగు నారదుని యుపదేశమునాలకించెను ప్రణామ మాచరించి పాదాభివందన మొనరించెను. తుష్టుఁడై ధర్మరాజు దేవరూపుండగు నా నారదునితో నిట్లు పలికెను. ''నీవు పలికిన ప్రకార మట్లే గావించెదను ప్రజ్ఞమో యింకను నభివృద్ధి నొందినదాయెను'' అని వచించెను. ధర్మజుఁడిట్లుగా నాచరించి సాగర మేఖలమగు మహినెల్లఁ బొందెను నారదుఁడు ధర్మజునితో

తుదిగా "ఇట్లు ప్రవర్తించు రాజు-చాతుర్వర్ణ్య సంరక్షణమందున్న ప్రభువు ఇహమందు సుఖవంతుడై విహరించి, దేవేంద్ర లోకమునకుం బోగలఁడు" అని పలికెను.

నారదుఁడు రాజలక్షణము గూర్చియు, మంత్రులు, పురోహితుఁడు, జ్యోతిష్యుఁడు, వైద్యుఁడు, పెద్దలు, సామన్యులు, యువకులు వీరిని గూర్చియు, రాజపరివారమునుంగూర్చి యువివరించెను స్వపర రాష్ట్ర ప్రవర్తనమును గూర్చియు, చతురంగ (సైన్య) బల విషయమును గూర్చియు, కర్షక కృషీవలులు మున్నగు వారిని గూర్చియు, వివరించెను. ప్రధానరాజదోషము గూర్చి తెల్పినాడు. చివరగా రాజు స్వాయుము, చూడవలసిన విషయములను (దఖలు పుచ్చుకొనవలసినవి) పేర్కొనెను.

రాజలక్షణము

ధర్మార్థకామములను కాల విభాగమొనరించి యనుభవింపవలెను అవి సంశ్లిష్టముగాకుండ ప్రవర్తింపవలెను పూర్వు లాచరించిన ప్రకారము వానిని సేవింపవలెను.

1 షడ్రాజ గుణములు కల్గియుండవలెను.

2 సప్తోపాయములను తెలియవలెను.

3 చతుర్దశ పరీక్షగావించుచు ప్రవర్తింపవలెను, స్వపర విషయములందు జాగరూకుఁడై ప్రవర్తింపవలెను

4 అష్టకర్మలను సంధాన మొనరించి సేవింపవలెను.

5 సప్తప్రకృతులు లోపింపకుండ చూడవలెను నిశ్చితార్థమును చెచ్చెర నములు పఱచవలెను, ఆట్టి దానికి విఘ్న మూపాదింపరాదు. కృతకదూతలచే మంత్రాంగము భేదింపకుండ చూడవలెను.

మిత్రోదాసీన శత్రువుల చికీర్షితమెఱింగి ప్రవర్తింపవలెను. సంధి విగ్రహములను చక్కగాఁ బ్రవర్తింపఁజేయవలెను. ఉదాసీనులందును మాధ్యములందును వృత్తి ననుమతించి యుండవలెను. మంత్రాంగము పైకి పొక్కకుండఁగాపాడవలెను. ఉత్తమాధమ మధ్యములగు పరిజనులను గుర్తెఱింగి ఉత్తమాధమ మధ్యమ కార్యములందు వారి వారిని నియోగింపవలెను. ఉత్తమాధమమధ్యను జనుల నెఱింగి యనురూప కార్యములందు వారివారిని ప్రోత్సహించి వినియోగించు కొనవలెను.

అధ్యులెల్ల సర్వశః అనురక్తులై యుండునట్లు చేయువలెను. ధర్మకారుణికులు, సర్వశాస్త్రకోవిదులు నగుయువకులను యోధముఖ్యులనుఁగావింపవలెను. సహస్రమూర్ఖులను విక్రయించియైన నొక్క పండితుని సంపాదించుకొనవలెను పండితు లాపదవచ్చినపుడు మిగుల నుపకరించెదరు. పితృపైతామహ క్రమమైన శ్రేష్ఠులైన యమాత్యులకు శ్రేష్ఠ కర్మలందు నియోగింపవలెను. విద్యావినీతులు, జ్ఞానవిశారదులు నగువారిని యథార్హగుణముఁగా సత్కరించి యాదరింపవలెను.

రాజు ఎక్కువగా నిద్ర పోరాదు, సకాలమున మేల్కాంచవలెను. మొదటి రెండు యామములు పండుకొని పశ్చిమ యామమున నర్థచింతనముగావింపవలెను. అలంకృతుఁడై మంత్రులతోఁ గూడ ప్రజలకు దర్శన మీయవలెను. శరీర మనోబాధలు లేకుండ ఔషధసేవ వృద్ధుల సేవ గావింప వలయును వాజపేయము, పుండరీకము మొదలగు క్రతువుల నేకచిత్తుఁడై శాస్త్ర విధి ననుసరించి గావింపవలెను. జ్ఞాతులను, గురువులను, వృద్ధులను, దేవతలను, తాపసులను, చైత్యవృక్షములను, బ్రాహ్మణులను నమస్కరించవలెను.

రాజు శోకమును, మన్యువును ప్రోత్సహింపరాదు. ప్రియా ప్రియములను పరీక్షించి దండ్యులందు పూజ్యులందు సమవర్తియై యుండవలెను. యమవతు ప్రవర్తింపవలెను బాహ్యాభ్యంతర రక్ష గల్గి యుండవలెను. రక్ష గావించు వారికే రక్ష కల్గింపవలెను. శత్రువులకు విదితుడు కాకుండా సర్వదా ప్రతి పన్నుఁడై, నిత్య యుక్తుఁడై, రిపునిరీక్షణముఁగావింపవలెను. యుద్ధ మృతులగు వారి భార్యలు దౌర్గత్య మొందకుండ కాపాడవలెను భయపడి వచ్చిన వాఁడు, క్షీణమైన శత్రువు, యుద్ధ విజితుఁడు నగువారిని పుత్రవతు రక్షింపవలెను. భూమండలమునకెల్ల సముఁడై, నిశ్శంకితుఁడై తల్లి దండ్రుల ట్లుండవలెను.

---

1 సంధి, విగ్రహము, యానము, ఆసనము, ద్వైదీభావము, సమాశ్రియము - ఇవి షడ్రాజ గుణములు.

2 మంత్రము, ఔషధము, ఇంద్రజాలము, సామము, దానము, భేదము, దండము—ఇవి సప్తోపాయములు.

3 కచ్చిదధ్యాయము ౧౦౬–౧౧౨ శ్లోకములు,

4 అష్టకర్మ ” :- స్వపరజనుల నెఱుంగుట, సేద్యము వర్తకము, కోటలో జేరుట, అగడ్త కట్టుట, ఏనుగుల గట్టుట, గనులు మొదలగు వానిపై పన్ను తీసుకొనుట, అనాథల కాదరువు కల్గించుట,

5 సప్త ప్రకృతులు :- రాజు, మంత్రులు, స్నేహితుల, బొక్కసము, రాజ్యమై భవము, కోటలు, సేనలు.

మొదట తాను జితేంద్రియుడై ప్రమత్తులు నజితేంద్రియులు నగుపరులను జయింపవలెను. దృఢమూలుడై పరుల నెదిరించి జయింపవలెను. జయింపబడిన వారిని రక్షింపవలెను. సామదాన భేదదండోపాయములను క్రమముగా గావింపవలెను. శత్రువు వ్యసన మగ్నుడగుట నెఱింగి 1 త్రివిధబలము వీక్షించి వేగ నెదిరింప వలయును. 2 అష్టాంగయుక్తమైన 3 చతుర్విధ బలము గల్గి సమర్థులగు బలముఖ్యులచే నడిపింపబడినదిగా గావించి (సునీతమైనది గావించి) రిపు ప్రతి వర్ధనముగా నుంచవలెను. బలముఖ్యులను సత్కరించి మన్నింప వలెను. పరరాష్ట్రమందలి పంటకాలమును, పంటను దాచు కాలమును నెఱింగి పరుల నెదరింప వలెను. ప్రాప్తకాలమున పార్ష్ణిమూలము నెఱింగి వ్యవసాయము, పరాజయము నెఱింగి యుద్ధ యాత్ర సాగింపవలయును. పరరాష్ట్ర ముఖ్యులకు యథార్థముగ రహస్యమున రత్నము లొసంగవలెను బల ముఖ్యులను సత్కరించి మన్నింపవలెను సైన్యమునకు బత్తెము, వేతనము సంప్రాప్తకాలమున నీయవలెను ముగ్గురు ముగ్గురు దూతలను నియమించి పరపక్షమున

---

1 త్రివిధ బలము:- ప్రభుశక్తి, మంత్రశక్తి, ఉత్సాహశక్తి.

2 అష్టాంగములు :- రథములు, గుఱ్ఱములు, కాలిబంటులు, యుద్ధ భటులు, పనులు చేయించెడి వారు, ఆచార్య ముఖ్యులు, వేగులవారు.

3 చతుర్విధ బలము :- మూల బలము, మిత్రబలము, భృత్య బలము, ఆటవిక బలము.

1 పదునెనుమది యధికారపదములను, స్వపక్షమున పదునైదు అధికార పదములను పరీక్షించి తెలియుచుండవలెను ఆ దూతల విషయములు - ఒక జట్టువారి విషయమింకొక జట్టు వారికి విశదము కాకుండ చేయవలయును. ధర్మకామార్థ దర్శినియగు నిట్టి బుద్ధి యందు వర్తించురాజు ఆయువును, యశస్సును పొందగలడు ఇట్టి బుద్ధి గల్గి వర్తించు రాజు మహిని జయించి యత్యంతము సుఖ మొందగలడు.

## మంత్రులు.

ఆత్మసములు, వృద్ధులు, శుద్ధులు, సంబోధనక్షములు, కులీనులు, అనురక్తులునైన మంత్రులుండవలెను. సంవృతమంత్రము వారియందుండవలెను. మఱియు శాస్త్రకోవిదులై యుండవలయును. మేధావి, శూరుడు, దాంతుడు, విచక్షణుడు నగువాడు అమాత్యుడొక్క-రుండే రాజును గాని, రాజ పుత్రునిగా మహచ్ఛ్రియము నొందింప గలడు

ఉగ్రదండమున ప్రజ లుద్వేగులు గాకుండ మంత్రులు రాష్ట్ర

---

అష్టాదశ పదములు :— 1 మంత్రి 2 పురోహితుడు 3 యువరాజు 4 సేనానాయకుడు 5 ద్వారపాలుడు 6 అంతఃపుర విచారకుడు 7 చెరసాల అధికారి 8 బొక్కస సదారుడు 9 కార్యాకార్యముల నెఱింగించి ప్రవర్తింప జేయువాడు. 10 న్యాయాధికారి 11 జీతము లిచ్చువాడు 12 నగరాధ్యక్షుడు 13 సభాధికారి 14 ధర్మాధికారి 15 దండనాధికారి 16 దుర్గరక్షకుడు 17 పొలిమేర కాపాడువాడు 18 అడవులు గాపాడు - ఇందు స్వపక్షమున మంత్రి పురోహితుడు యువరాజు—ఈ మూడు పెద్ద పదవుల పరీక్షయందు ప్రత్యేకముగు పెద్ద ప్రయత్న మొనరించుట కార్యమని గుర్తింపవలయును.

మును శాసింపవలయును. ఉగ్రదండనము బహ్వనర్థహేతువు కాగలదు ఉన్నతాధికారులగు మంత్రు లిందు గడు జాగరూకులై దండమును ప్రవర్తింప చేయదగును.

పురోహితుడు, ఋత్విక్కులు

వినయ సంపన్నుడు, కులపుత్రుడు, బహుశ్రుతుడు, అసూయ లేనివాడు, అసంకీర్ణుడు నగువాడు పురోహితుడై యుండవలెను.

అగ్ని కార్యయుక్తులై, విధిజ్ఞులు, మతిమంతులు. ఋజుస్వభావులు నగువారు ఋత్విక్కు లుండవలెను. కాలమందు హుతము, హోష్యమాణ మెఱిగించువారై యుండవలయును.

జ్యోతిష్యులు

అంగనిష్ణాతులగు జ్యోతిష్యులు ఉత్పాతములనెల్ల నెఱింగి తెలుపువారు కావలెను.

సైన్యాధి పతులు.

హృష్టుడు, శూరుడు, మతిమంతుడు, ధృతిమంతుడు, శుచి, కులీనుడు, అనురక్తుడు, దక్షుడు నగువాడు సర్వసైన్యాధిపతి గావలయును.

సర్వయుద్ధ విశారదులు, దృష్టావదాతులు, విక్రాంతులు నగువారు బల ముఖ్యులై యుండవలెను.

వైద్యులు

అష్టాంగ చికిత్సా విశారదులై, సుహృదులై, అనురక్తులై వైద్యు లుండవలెను. ఆరోగ్యదాయకులుగా వారుండవలెను.

---

షడ్రాజ గుణములు, సప్తోపాయములు, త్రివిధోపాయములు— ఈ మొదలగువాని వివరణము తెలియను. కొందఱు శ్లేషించియున్న దియే యిందు నేనును వ్రాసితిని. పాఠకులు విమర్శించి విజ్ఞాతులగుట యావశ్యకము. భారత గ్రంథాలోడనముననే యివియెల్ల నిర్ధరింప దగునని విజ్ఞప్తి గావించుచున్నాను.

## రాజ్య ముండవలసిన రీతి

ఆప్తులు, అలుబ్ధులు, క్రమికులు, నగువారు కార్యములందను ష్ఠితులై యుండవలయును. కులపుత్రులు ప్రధానులగుచు ననురక్తులై రాజునిమిత్తముగా యుద్ధమందు ప్రాణమర్పించువారుగా సదా యుండవలెను. భూమిపాలురెల్ల ప్రధానతః రాజానురక్తులై రాజు నిమిత్తము ప్రాణములు విడుచువారుగా నుండవలెను పరిజనులు పురుషకారమున కర్మశోభనొందిన వారలగుచు నధికమాన మొందుటయు, నధికమగు బత్తెము, వేతనము. పొందువారు కావలెను కోశము, కోష్ఠము, వాహనము, ద్వారము, ఆయుధము, ఆయము— ఇవి కృతకల్యాణులగు పరిజనులచే ననుష్ఠింప బడవలెను. సమ విషమములందు బలానుగతులైన పరిజనులు చోరులను పట్టి దండించుచు విషయములందు (దుర్గమమార్గాన్వేషణ సంచారులగుచు) రాజ్య రక్షణ గావింపవలెను. మంగళహస్తులై రాజు నెదుట పరిజనులుండవలెను. రక్తాంబరధరులు, ఖడ్గహస్తులై అలంకృతులైన భటులు రాజు నొద్ద రక్షణార్థ ముపాసించి యుండవలెను. స్వపరరాష్ట్రములందలి ప్రభుత్వోద్యోగు లర్థప్రవర్తకులు కావలెను (అధితిష్ఠంతి) వారు పరస్పరముగా రక్షితులు కావలెను. అభ్యవహార్యములు, గాత్ర సంఘర్షణములు, ఘ్రేయములు ఇవి రాజాను మతిగా రక్షింప బడవలెను.

ఆదాయములోని అర్ధభాగము, చతుర్థభాగము, త్రిభాగముగా వ్యయమగుట శోభనము ఆయవ్యయములందు నియుక్తులైన గణకలేఖకులు పూర్వాహ్ణమందు నిత్యము రాజు యొక్క ఆయవ్యయముల నొప్పగింప సంసిద్ధులై యుండవలెను.

సర్వ విద్యలందును గుణతః అర్చావిధాన మేర్పడవలెను. బ్రాహ్మణులు, సాధువులు రాజునకు శుభశ్రేయము పలుకువారుగా నుండవలెను. త్రయీమూలమగు ధర్మమునందు బూర్వాచరితముగా జనులుండునట్లు-కర్మ ప్రవర్తకు లగునట్లు రాజ్యక్రమ మ్నుండవలెను. బ్రాహ్మణులు మృష్టాన్నములు, సాధుభోజనము గావించువారు గావలెను. గుణోపేతులగు విప్రవరులు రాజ్య పీఠమును మన్నించు వారై ఆప్తదక్షిణల నొందుచు సంతృప్తులు కావలెను.

సాధుజనులు రాజవార్త ననుసరించి ప్రవర్తింపవలెను, వార్తా సంశ్రితమందే లోకము సుఖ మొందగలదు. జ్ఞాతులు, గురువులు, వృద్ధులు, వణిజులు, శిల్పులు — ఆశ్రితులగు వీరలు దుర్గతిపాలు కాకుండా రాజు ధనధాన్యములచే నభీక్ష్ణ మనుగ్రహింపవలెను. పండితులను చేరదీయవలెను. మూర్ఖులను విసర్జింపవలెను.

రాష్ట్రమందు తటాకములు పూర్ణముగను, బృహత్తుగను నుండి యథాభాగశః ఉపయోగపడవలెను దేవమాతృకలు లేనిదే కృషి కొనసాగదు. నూటికి నాలగవవంతున (4%) ఋణానుగ్రహము కర్షకున కుండవలెను. కృషీవలులు తుష్టులై యుండవలెను

స్త్రీల నోదార్పవలెను. వారిని రక్షింపవలెను. వారియందు శ్రద్ధ చూపవలదు. వారికి గుహ్య మెఱిగింప తగదు

నగర గుప్త్యర్థము గ్రామములు నగరములట్లు కావలెను. గ్రామ గుప్త్యర్థము ఘోషములు గ్రామములట్లు కావలెను. రాజార్పణ

ముగా నివియెల్ల నుండవలెను. *జనపదములందలి శూరులు, కృత ప్రజ్ఞులునగు వారు పంచపంచానుష్ఠానమొనర్చువారై కూడి క్షేమ మొనగూర్చవలెను.

పానము, ద్యూతము, క్రీడ, స్త్రీలు, వీనినిమిత్తమగు రాజవ్యయముపూర్వాహ్ణమందు జరుగునట్టిదైన వ్యయము - ఈ వ్యసన వినియోగము ఖర్చువెచ్చములు పైకి తెలియరాదు.

రాజ్యమునకు చెఱుపుఁగల్గించునవి.

కర్మాంతములను గమనింపక పరోక్ష ప్రవృత్తినుండిన రాజు యొక్క కార్యములు దుష్ట సంసర్గముచే విపరీత ఫలదాయకము లగును. ఉగ్రప్రతిగృహీతయగు రాజు అవమానమొందును, పతితుఁడగును. ఆత్యయికమైనదివిని, దానిని గూర్చి చింతనమొనర్చియు రాజు అంతఃపురవర్తియై ప్రియములనుభవింపరాదు.

---

*జనపదోద్యోగులు:- ప్రశాస్తి, సమాహర్త, సంవిధాత, లేఖకుడు, సాక్షి, అను నైదుపదములు.

సైనికులకిచ్చు బత్తెము, వేతనము లాగికొనరాదు, కాలాతిక్రమమున నివియొసంగుటయు దౌర్గత్యహేతువగును. అందువలన మహాదనర్థము కాఁగలదు. కర్షకుల వితనములు, బత్తెములు కొఱతకాఁగూడదు లోభమునఁగాని, మోహమునఁగాని, మానమునగాని అర్థిప్రత్యర్థులు ప్రాప్తించునపుడు వారినిఁదఱుమఁగొట్టరాదు. (న పాస్యసి కథంచన) లోభమువగాఁని, మోహమునఁగాని, విస్రంభమునఁగాని, ప్రణయమునఁగాని ఆశ్రితులవృత్తులను నాపుదలఁగావింపరాదు.

చోరులచేతను, లుబ్ధులచేతను, కుమారులచేతను, స్త్రీబలముచేతను, రాజులచేతను, రాష్ట్రము పీడింపఁబడరాదు. (ఒకదానికన్న నొకటిగా నివి బలీయమైనవని యెఱుఁగవలెను. అందఱికంటె దుష్టప్రభువువలననే రాష్ట్రపీడ భరింపరానిదిగా నేర్పడగలదని తెలియవలెను.) లుబ్ధులు, చోరులు, వైరులు, అప్రాప్తవ్యవహారులు నగువారు కర్మలం దధిష్ఠించియుండరాదు. శాసనాతిగులై, కామాత్ములై, స్వేచ్ఛులై, బహ్వర్థులను తమకుఁదోచిన విధముగా నొకటేరే గావింపఁజూచువార లుండఁగూడదు. అట్టివారు విసర్జింపఁబడవలెను. పదవికేత్రులై పౌరులుగాని, రాష్ట్రవాసులుగాని రాజ విరోధులై యుండరాదు.

అర్థమం దసంమూఢులు, హితకాములు అనుసరించునట్టి ప్రియావర్తనులు నగువారిని కిల్బిష మేర్పడకముందే కర్మలనుండి యపకర్షఁగావింపరాదు. ఆర్యుఁడు, విశుద్ధాత్ముఁడు నగువానిని చోరకర్మయందు గ్రుకిఁ (ఏర్పఱచి) అదృష్టశాస్త్రకుశలులైనవారు (అధికారులు) లోభకారణముగ నాశుచిమంతుని వధింపజూచెద రట్టిది తటస్థింపకుండ యుండవలెను. చెడుపని గావింపఁబడినపుడు వ్యక్తమైనవాఁడు, మఱియు సకారణముగ దొంగయని నిర్ధారణమైనవాఁడునగు నేరస్థుని ద్రవ్య లాభమున నధికారులు విడిచి వేయజూతురట్లు గాకుండ

నుండవలెను. ఉన్నతాధికారులగువారు అధికార బలమున ధనావృతు లగుచు కడువిపరీత మాచరింప నొడిగట్టెదరు. అభ్యుదయవిధుల ఉత్పన్న ములను - అర్థములను వారెంతయేని మిథ్యగావింపఁజూతు రట్లుఁగాకుండ రాజు జాగరూకుఁడై మెలకువఁగల్గి ప్రవర్తింపవలెను.

శత్రుపీడఁ గావింపరాదు. దుర్బలుని బలమునఁ బీడింపరాదు. బలవంతుని మంత్రమునఁ బీడింపరాదు. ఈ రెండువిధములగు పీడనలు పరరాజులందుగావింపక రాజు శత్రువిజయమొంది పిమ్మట వారినాదరించి కాపాడవలసియున్నది

## రాజదోషములు పదునాలుఁగు.

నాస్తిక్యము, అనృతము, క్రోధము, ప్రమాదము, దీర్ఘసూత్రత్వము, జ్ఞానుల కదర్శనుఁడగుట, ఆలస్యము, పంచవృత్తిత్వము, అర్థములఁగూర్చి తానొక్కఁడుగాఁ జింతించుట, మఱియు ననర్థజ్ఞులతోఁ జింతించుట, నిశ్చితములైనవి అనారంభముగావించుట, మంత్రమును రక్షింపకుండుట, మంగళాద్య ప్రయోగము, సర్వతః ప్రత్యుత్థానము ఈరాజదోషము లుండకూడదు, కృతమూలులగుఁ బార్థివులును నిందువలనఁ బ్రాయశః వినాశమొందువారు కాఁగలరు.

## షడనర్థములు

నిద్రాలస్యము, భయము, క్రోధము, మార్దవము, దీర్ఘసూత్రత్వము—వీనిని పృష్ఠగతముగావించి రాజు ప్రవర్తింపవలెను. ('నిద్రాలస్యము' అని రెంటిని నొకటిగా నుల్లేఖించుట గమనింపఁదగినది.)

## రాజు స్వయము గావింపవలసిన కృత్యములు

దూరదేశాగతులగు వణిజుల విషయమై కడుజాగరూకత యుండవలెను. పెద్దలు, అర్థతత్త్వజ్ఞులు నగువారి ధర్మార్థ సహితము

ధర్మార్థ దర్శనమునకు మాట మన్నింపవలెను. కృషి తంత్రము లందు, గోవులు, పుష్ప ఫలములు, మధు సర్పిషములు-వీని యందేర్పడిన ద్రవ్యము ద్విజాతులకు వినియోగింపవలెను. శిల్పులకు సర్వసదుపాయములుఁ గావింపవలెను, చాతుర్మాస్యగ్రాసము వారి కుండునట్లుఁగావింపఁదగును. కృతమెఱుంగుట, తత్కర్తన ప్రశంసించుట, సత్పురుషమధ్యమున గౌరవించి సత్కరించుటఁ, గావింపవలెను. (గౌరవించవలెను మఱియు సత్కరించవలెను.) సర్వసూత్రములు (వాహన సర్వసూత్రిములు) ధనుర్వేద యంత్ర సూత్రములు, ఆయుధ సర్వస్వము, విషయోగములు-శత్రునాశనమైన వన్నియు రాజు స్వయ మెఱింగి యుండవలెను అగ్నివ్యాళరోగరక్షోభయ రహితముగా స్వరాష్ట్రమునుఁ గాపాడవలెను అంధులు, దుర్గతులు మున్నగు ననాథలను తండ్రియట్లు కాపాడవలెను, అట్లే ప్రవ్రాజితులను కాపాడవలెను షడనర్థములను పృష్ఠ మొనర్పవలెను.

రాజు స్వపరరాష్ట్రములందు సమర్థులనెల్ల తన కనుకూల వర్తను లగునటుఁ గావించుకొనవలయును పండితులు, వృద్ధులు మున్నగువారు రాజునకు మేలు కోరువారు గావలయును కార్య శూరులను ప్రశంసించి రాజు వారిని లెస్సగా వినియోగించుకొనవలయును; మఱియు వారి నుత్సాహవంతులనుఁ గావింపవలయును. శిల్పు , కళావేత్తలు, కర్షకులు మున్నగువారిని ప్రోత్సహింపవలయును. రిపులు, వ్యతిరేకులు, ఉదాసీనులు-ఎల్లఱను పరీక్షించుచు రాజు ప్రయత్నపడుచు జాగరూకుఁడై ప్రవర్తింప వలయును. రాజు శారీరక మానసిక వ్యథలు లేకుండ చేసికొనవలయును, అలంకృతుఁడై ప్రజలకు దర్శనీయుఁడు గావలయును. భూమ్యాకాశములందేర్పడు మంచి చెడుగులను ముందుగాఁగనిపెట్టి రాష్ట్రరక్షఁగావింపవలయును. తీక్ష్ణదండ మొనరింపఁదగదు. దస్యులబాధ, వంచకుల మోసము గాకుండ నిరీక్షింప వలయును సర్వప్రజలను తండ్రియట్లు రాజు గా పాడవలయును.

రాజు యుద్ధ తంత్రముల నెల్ల స్వయముగా నెఱుంగ వలయును. చతురంగ సైన్యమును ప్రతిభావంతముగా గావింపవలయును. ఆయుధములు, విష ప్రయోగాదులు రాజు స్వయముగా నెఱింగి ప్రవర్తింపవలయును. స్వపర రాష్ట్రములందు రత్నములు, ధనములు వినియోగించి రాజు దక్షుఁడు కావలయును. పంట కాలమందు, రాజులు వ్యసన మొందియున్న ప్పుడు, హీనులై యున్నప్పుడు, దండయాత్రఁ గావింపవలయును. ఇది రాజ ధర్మమగుచున్నది. ఆయుధ విషప్రయోగాదులందు, దండ యాత్రలందు, స్వపర రాష్ట్రములను వశ్యమొనరించుకొను ప్రయత్న మందు రాజు పరమాస్తికుఁడై సనాతనధర్మ ప్రవర్తకుఁడై యుండ వలయును. ఉన్నతాధికారుల విషయమందు, దూరదేశాగతులగు వణిజులందు రాజు సదా కన్నుఁగల్గి రాజ్యమునుఁ గాపాడవలయును. రాజ ప్రభావజుష్టమై రాజ్య తంత్రముండునని నారదుఁడు బహుదూర మెఱిగించినాఁడు. రాజసూయమనునది ప్రపంచ రాజ్యములన్నిటికి సంబంధించినది గాన పాండవు లతి జాగరూకులై ప్రవర్తింపఁదగునని తెల్పుచు నట్లు రాజసూయ మొనరించినందున దుర్మార్గ వర్తనులెల్ల దెగిపోయి లోక శాంతి యేర్పడఁ గలదని నారదుఁడు పరమార్థము తెల్పినాఁడు.

## పాండురాజ సందేశము.

$భగవన్ న్యాయ మాహైతం యథావ ద్ధర్మ నిశ్చయమ్
యథాశక్తి యథాన్యాయం క్రియతేఽయం విధి ర్మయా ౬3
రాజభి ర్య ద్యథా కార్యం పురావైశ న్న సంశయః
యథా న్యాయోప నీతార్థం కృతం హేతుమ దర్థవత్| 3
వయంతు సత్పథం తేషాం యాతు మిచ్ఛా మహే ప్రభో!
నతు శక్యం తథాగంతుం యథాతై ర్నియతాత్మభిః ౪

(భగవాన్ ! మీరు నయమునఁ బలికిన ధర్మ నిశ్చయమును యథాశక్తిగా యథాన్యాయముగా నే నాచరించువాఁడ నయ్యెదను. రాజు నెయ్యది యెట్లు చేయందగియున్నదో వారట్లు నడుచుకొని యున్నారు. హేతుయుక్తముగను, అర్థవతుగను, న్యాయోపనీతార్థముగను పూర్వులచే పూర్వమునుండియు ననుష్ఠితం బగుచున్నది. ప్రభో ! మేమును వారి సత్పథముననే ప్రవర్తింప నిచ్ఛగించెదము. ఆట్టి నియతాత్ములు నడచియున్న రీతిగా నడుచుటకు శక్యముగా నేరదుకదా– అని ధర్మరాజు నమ్రతను వ్యక్తీకరించినాఁడు.) నారదోపదేశమునకు కృతజ్ఞతను వ్యక్తీకరించి ధర్మరాజు చిత్రముగా, గార్వవచనప్రసక్తి నిట్లుఁగావించుచున్నాఁడు.

---

$ 'నేను పూర్వులట్లు నడచెదను 'అని పలికిన మర్యాదవ్యక్తమును ధర్మజుఁ డింకనును దారముగా; (క్రియతేఽయం విధిర్మయా' (నాచేత నవ్విధియే యనుసరింపఁ బడుచున్నది.) అని పలికినాఁడు. ఈ మాట బాధ్యతాయుతమగు మర్యాదను వ్యక్తీకరించుచున్నది.

§ తంతు విశ్రాంత మాలక్ష్య దేవర్షి మమితద్యుతిమ్
ఏవ ముక్త్వా సధర్మాత్మా వాక్యం తదభి పూజ్యచ ౫
ముహూర్తా త్ప్రాప్త కాలంచ దృష్ట్వా లోకచరం మునిమ్
నారదం సుస్థ మాసీన ముపాసీనో యుధిష్ఠిరః ౬
అపృచ్ఛ త్పాండవ స్తత్ర రాజమధ్యే మహాద్యుతిః
భవాన్ సంచరతే లోకాన్ సదా నానావిధాన్ బహూన్ ౭
బ్రహ్మణా నిర్మితాన్ పూర్వం ప్రేక్షమాణో మనోజవః
ఈదృశీ భవితా కాచి ద్దృష్ట పూర్వా సభా క్వచిత్ ౮
ఇతో వా శ్రేయసీ బ్రహ్మం స్తన్మమా చక్ష్వ పృచ్ఛతః

---

పూర్వపు రాజులు విధ్యుక్త ధర్మప్రవర్తకులు అని పలికి ధర్మరాజు 'వయంతు' (మేము) అని చకచకగా నెత్తుకొనినాడు. ఇది పెద్ద నమ్రతను, విశిష్టతను, సమర్థించుచున్నది పూర్వుల సత్పథమును బోన యత్నించెదము అని కాక 'వయంతు సత్పథం తేషాం యాతు మిచ్ఛా మహే ప్రభో!' అని ధర్మజుఁడు పలికినాఁడు. 'ఇచ్ఛామహే' అనునది యాడకువను, నాత్మవిశ్వాసమును నింపుచున్నది 'వయంతు' అనుదానిలోని 'తు' అనునది గంభీర భావమును వెదజల్లుచున్నది. 'ప్రభో' అను సంబోధన మిచ్చట యర్థ విస్తార మగుచున్నది.

'నతు శక్యం తథాగంతుం.' (వారివలెనే నడుచుట శక్యము కాదు) ఈ మాటను ధర్మజుఁడు నిదానముగా సమీచీనముగా నుచ్చరించినాఁడు. 'యథా తైర్నియ తాత్మభిః' (నియతాత్ము లగు పూర్వులట్లు వర్తింపనలవికాదు) అని పలికి ధర్మరాజు పెద్దల నడవడియం దాదరము వ్యక్తీకరించినాఁడు. పూర్వ రాజుల కన్న మేల్మి పరిస్థితిని ప్రవర్తించు పాండవముఖ్యుఁడు ధర్మరాజు వినయ సంపద నెల్ల నీ మాటలందు ప్రకటించినాఁడు.

---

§ 'విశ్రాంత మాలక్ష్య' అనునది సమయ నిరీక్షణ ఘనతము వ్యక్తీకరించుచున్నది 'ముహూర్త త్ప్రాప్తకాలంచ' అనునది. నేద

(ధర్మరాజు డిట్లుగాఁ బలికి నారదుఁడు విశ్రాంతుడఁగుట గమనించి ముహూర్తకాలము నిరీక్షించి ప్రాప్త కాలమం దిట్లు ప్రశ్నించెను. లోకచరుండగు నారదుఁడు స్వస్థముగాఁ గూర్చొనియుండగా ధర్మరాజాసీనుఁడై రాజ మధ్యమందిట్లుగాఁ బ్రశ్నించెను. భగవాన్! "బ్రహ్మచే పూర్వము నిర్మింపబడినవియు, నా నావిధములయినవియు నగు బహు లోకములను మీరు మనోజవమునఁ దిలకించుచు సంచరించెదరు. ఈ దృశమగు సభ నెచ్చటనైన నెప్పుడైనఁ దిలకించియున్నారా? ఇంతకన్న శ్రేయమైనది గాంచియున్నారా బ్రహ్మణ్యుఁడా ? " ప్రశ్నించుచున్నాను నాకది "తెలియజెప్పుఁడు" అని యడిగెను.)

'ఇంతకన్న నందమైన సభను చూచితిరా' అవి కాక 'ఇతోవా శ్రేయసీ బ్రహ్మ!' అని ధర్మరాజుడుదారముగా బలికినాఁడు. మయ సభ శ్రేయోదాయకమైనదను నభిప్రాయముఁ గల్గియున్న ధర్మరాజుఁడు శ్రేయోవంతములగు దివ్యసభలనుగూర్చి ప్రశ్నించినాఁడని సారస్యము

---

దీరిన నారదుని ప్రశ్న చేయు ధర్మజుని మర్యాదను, వ్యక్తీకరించు చున్నది. వేచియుండుట యందలి నిదానమును, ప్రశ్నించు సమయమును, అదుగందగు నిరీక్షణమును నిది వ్యక్తీకరించుచున్నది. సదా లోకచరండగు నారద మహామునిని రాజ మధ్యమందు ధర్మరాజు ప్రశ్నించుచున్నాఁడు. 'ఉపాసీనో యుధిష్ఠిరః, 'అపృచ్ఛ త్పాండవ స్తత్ర' అని గలదు, పాండవజ్యేష్ఠుఁ డుపాసించినాఁడనియు, పాండవుడు ప్రశ్నించినాఁడనియు భావము, ఇట్లే శ్లోకమందలి ధర్మరాజ స్వభాషితం, పాండవం ' అనుమాటలు గలవు. పాండవులందుకు సంబంధించిన విషయముగా ప్రసంగమేర్పడు చున్నదని యభిప్రాయము.

తచ్ఛ్రుత్వా నారద స్తస్య ధర్మరాజస్య భాషితం
పాండవం ప్రత్యువాచేదం స్మయ న్మధురయా గిరా ౯

మానుషేషు న మే తాత! దృష్ట పూర్వా నచ శ్రుతా
సభా మణిమయీ రాజన్! యథేయం తవ భారత ౧౦

సభాంతు పితృరాజస్య కరుణస్యచ ధీమతః
కథయిష్యే తథేంద్ర స్య కైలాస నిలయస్యచ ౧౧

బ్రహ్మణశ్చ సభాం దివ్యాం కథయిష్యే గత క్లమాం
దివ్యాం దివ్యై రభిప్రాయై రుపేతాం విశ్వరూపిణీమ్ ౧౨

దేవైః పితృగణై స్సాధ్యై ర్యజ్వభి ర్నియతాత్మభిః
జుష్టాం మునిగణై శ్శాంతై ర్వేదయజ్ఞై స్సుదక్షిణైః
యది తే శ్రవణే బుద్ధి ర్వర్త తే భరతర్ష భ! ౧౩

(తండ్రీ! మణిమయమైన యిట్టి దివ్య సభను మనుష్యులం దిదివఱకు చూడలేదు ఇంక యమ సభనుఁగూర్చి, వరుణ సభనుఁ గూర్చి, ఇంద్ర సభనుఁగూర్చి కైలాస నిలయుండగు కుబేరుని సభనుఁ గూర్చి బ్రహ్మ సభనుఁగూర్చి వివరించెదను. ఆ బ్రహ్మ సభ గతక్లమము, దివ్యము, దివ్యాభిప్రాయయుతము, విశ్వరూపిణియైనది, నియతాత్ములగు దేవతలు, పితృగణము, సాధ్యులు, నియతాత్ములగు యజ్వలు, శాంతాత్ములగు మునులు వీరలచే జుష్టమైనది అప్ప దక్షిణలుగల వేదయజ్ఞములు గలది. నీకు విన కుతూహలము (బుద్ధిః) గల్గిన వినుము- అని నారదుఁడు పలికెను.

ధర్మజుని సభను గూర్చి 'న దృష్ట పూర్వా' అని పలుకుచు నారదుడు సాభిప్రాయముగా 'సభాంతు పితృరాజస్య' అని మాట జోడించినాడు. పితృరాజ సభాగతుండగు పాండుని సందేశమునుఁగాని

వచ్చియున్న నారదుఁడిట్లు పలుకుట సాభిప్రాయమైనది. తండ్రి సందేశము వ్యక్తమగు ప్రసంగము ధర్మజునిచేఁగల్పింప బడుచున్నదని యిందు ధ్వని గలదు యమలోకమందున్న పాండురాజు సాంకల్ప ముగా నీ విషయమేర్పడుట విచిత్రముగా నున్నది (సాభిప్రాయ ముగఁ గూడ నున్నది )

‘ ఆ సభలఁ గూర్చి వివరింపవలసినది, విన కుతూహల మొందియున్నాము. ఏమి ద్రవ్యము లందు గలవు? పొడవెంత? వెడల్పెంత? పితామహుని సభలో నెవరుపాసించుచుండెదరు? దేవ రాజగు వాసవుఁడు, వైవస్వతుడగు యముడు, వరుణుఁడు, కుబేరుఁడు- వీరి సభలం దుపాసించువా రెవ్వరెవ్వరు? బ్రహ్మర్షీ! దీని నంతయు యథాన్యాయముగాఁ దెల్పుము. అని ధర్మరాజు పలుకగా నారదుఁడు సాభిప్రాయముగా ‘ శక్రస్యతు సభా దివ్యా ’ యని యింద్ర సభను గూర్చి ముందుగా వివరించి, లోకపాలకుల సభలు, బ్రహ్మ సభనుఁ గూర్చి వివరించెను. ఇంద్ర సభా విషయమున పాండుని సందేశము (రాజసూయము) సూచితమగుచున్నది.

సా సభా తాదృశీ దృష్ట మయా లోకేషు దుర్లభా
సభేఽయం రాజ శార్దూల మనుష్యేషు యథా తవ ౧౧౭
ఏతా మయా దృష్ట పూర్వా స్సభా దేవేషు భారత!
సభేఽయం మానుషే లోకే సర్వ శ్రేష్ఠ తమా తవ ౬౧

(లోకములందు దుర్లభమైన యాసభను చూచితిని. మనుష్యు లందు నీ సభవంటి యుత్తమ సభను-బ్రహ్మసభనుఁ దిలకించితిని దేవతలందట్టి సభలను పూర్వము చూచియుంటిని. మనుష్య లోక మందు నీ యీ సభ సర్వశ్రేష్ఠతమమైనది. అని నారదుఁడు తన ప్రసంగమును ముగించెను. లోక పాలక సభలు ‘ న శోకా న జరా ’ ఇట్లుగా దివ్యమైనవి. మనుజ లోకమందు బ్రహ్మ సభకు, దేవతలకు సభకు నీడగు సభ ధర్మజునకు లభ్యమైనది. మనుజ లోకమందు

మయసభ సర్వశ్రేష్ఠతమమైనది. అని తన ప్రసంగమును నారదుడు పర్యవసించినాడు. నారదుని ప్రసంగమును విని ధర్మరాజిట్లు పలికెను.

ప్రాయశో రాజలోక స్తే కథితో వదతాంవర
వైవస్వత సభాయాంతు యథా వదసి మే ప్రభో! ౧౨-౧

వరుణస్య సభాయాంతు నాగా స్తే కథితా విభో!
దైత్యేంద్రా శ్చాపి భూయిష్ఠా స్సరిత స్సాగరా స్తథా ౨

తథా ధనపతే ర్యక్షా గుహ్యకా రాక్షసా స్తథా
గంధర్వా స్సరస శ్చైవ భగవాంశ్చ వృషధ్వజః ౩

పితామహ సభాయాంతు కథితా స్తే మహర్షయః
సర్వే దేవనికాయాశ్చ సర్వశాస్త్రాణి చైవహ ౪

శక్రస్యతు సభాయాంతు దేవా స్సంకీర్తితా మునే
ఉద్దేశతశ్చ గంధర్వా వివిధాశ్చ మహర్షయః ౫

ఏక ఏవతు రాజర్షి ర్హరిశ్చంద్రో మహామునే!
కథిత స్తే సభాయాంవై దేవేంద్రస్య మహాత్మనః ౬

కిం కర్మ తే నా చరితం తపోవా నియత వ్రత!
యే నాసౌ సహశక్రేణ స్పర్ధతే సుమహాయశాః ౭

పితృ లోకగత శ్చైవ త్వయా విప్ర పితా మమ
దృష్టః పాండు ర్మహాభాగః కథం వాపి సమాగతః ౮

కి ముక్తవాంశ్చ భగవం స్తన్మ మాచక్ష్వ సువ్రత
త్వత్తః శ్రోతుం సర్వ మిదం పరం కౌతూహలంహి మే ౯

( ప్రభో, యమ సభయందు రాజలోకమంతయు నున్నట్లు పలికితివి. వరుణ సభయందు నాగములు, దైత్యేంద్రులు, సరిత్సాగరములున్నట్లు పలికితివి. కుబేర సభయందు యక్షులు గుహ్యకులు రాక్షసులు గంధర్వాప్సరసలు, వృషధ్వజుడు నున్నట్లు పలికితివి పితామహ సభయందు మహర్షులు, సర్వదేవనికాయములు, సర్వశాస్త్రము లున్నట్లు పలికితివి దేవేంద్ర సభను గూర్చి పలుకుచు దేవతలను కీర్తించుచు నుద్దేశ పూర్వకముగా గంధర్వులు, మహర్షులందున్నట్లు పలుకుచు హరిశ్చంద్ర రాజర్షి యొక్కఁడే యాదేవేంద్రుని సభయం దున్నట్లు చెప్పితివి. నియతవ్రతా! | ఆ రాజర్షి హరిశ్చంద్రునిచేఁగావింపఁబడిన కర్మయేది? తపమేది? శక్రుని స్పర్ధగావించుచు (నత డచ్చటనుండుటకు హేతువేది) పితృలోకగతుఁడగు నా తండ్రి పాండురా జెటులున్నాఁడు? ఆతఁడేమి సచించియున్నాఁడు? నా కది తెల్పవలసినది. నీ వలన నిదియంతయు వినఁగుతూహలము నాకుఁ గల్గినది'' అని ధర్మరాజు పలికెను.

యమ వరుణ కుబేరేంద్ర బ్రహ్మ సభ లనుఁగూర్చి తెల్పెదనని నారదుఁడు, (బహ్మేంద్ర యమ వరుణ కుబేరుల సభలనుఁగూర్చి వివరింపుమని ధర్మజుఁడు పలికెను. ఈ రెండు వరుసలందును ప్రదక్షిణాకార మున్నది. యమ సభాగతుఁడగు పాండుని సందేశమున లోకక్షయము లోకోద్ధారము-రెండునుఁగల్గఁగల వనునది నారదుని హృదయము. నారదుఁడు సభలను గూర్చి వివరించుటలో ఇంద్ర యమ వరుణ కుబేరుల సభలను తెల్పి చివరగా బ్రహ్మ సభనుఁ గూర్చి దెల్పినాడు ఇంద్ర సభయందు హరిశ్చంద్ర రాజర్షి యొకఁడే యున్నాఁడు. యమ సభయందు రాజ సహస్రముతో పాటు పాండు రాజున్నాఁడు-అని నారదుని వచనమునఁ దేలినది. ధర్మజున కిది జిజ్ఞాసనుఁగల్గించినది.

'యే నాసౌ సహ శక్రేణ స్పర్ధతే సుమహాయశాః ' అని హరిశ్చంద్రుని గూర్చి, ' పితృలోక గతశ్చైవ... పితా మమ ...కి ముక్తవాన్ ' అని పాండురాజును గూర్చి ధర్మరాజుడు పలికినాడు. 'శక్రేణ స్పర్ధతే' అనునది సాత్వికమైన వానిని వ్యక్తీకరించుచున్నది. 'యమ సభయందున్న' యని పలుకక 'పితృ లోక గతః పితా మమ కి ముక్తవాన్ ' అని తండ్రిని గూర్చి పలుకుట సాత్వికమైన ధర్మజుని జిజ్ఞాసను వ్యక్తీకరించుచున్నది. ధర్మజున కిట్లు జిజ్ఞాసను కల్గించిన నారదుడు హరిశ్చంద్రుని స్థానమును గూర్చి వెల్లడించుచు నది సందర్భముగా పాండురాజు సందేశమును వెల్లడించి కర్తవ్యమును సూచించువాడై యిట్లు పలికెను.

యన్మాం పృచ్ఛసి రాజేంద్ర హరిశ్చంద్రం ప్రతి ప్రభో!
తత్తేఽహం సంప్రవక్ష్యామి మాహాత్మ్యం తస్య ధీమతః 10

స రాజా బలవా నాసీ త్సమ్రా ట్సర్వమహీక్షితాం
తస్య సర్వే మహీపాలా శ్శాసనావనతాః స్థితాః ౧౧
తే నైకం రథ మాస్థాయ జైత్రం హేమవిభూషితం

శస్త్రప్రతాపేన జితాః ద్వీపా స్సప్త జనేశ్వర! ౧౨
స నిర్జిత్య మహీం కృత్స్నాం సశైలవనకాననామ్

ఆజహార మహారాజ రాజసూయం మహాక్రతుమ్ ౧౩
తస్య సర్వే మహీపాలా ధనా న్యాజహ్రు రాజ్ఞయా

ద్విజానాం పరివేష్టార స్తస్మిన్ యజ్ఞేచ తేఽభవన్ ౧౪
ఏతస్మా త్కారణా ద్రాజన్ హరిశ్చంద్రో విరాజతే

తేభ్యో రాజసహస్రేభ్య స్త ద్విద్ధి భరతర్షభ! ౧౮
సమాప్యచ హరిశ్చంద్రో మహాయజ్ఞం ప్రతాపవాన్

అభిషిక్తశ్చ శుశుభే సామ్రాజ్యేన నరాధిప! ౧౯
యే చాన్యేచ మహీపాలా రాజసూయం మహాక్రతుమ్

యాజంతే తే సహేంద్రేణ మోదంతే భరతర్షభ! ౨౦
యేచాపి నిధనం ప్రాప్తా స్సంగ్రామే ష్వపలాయినః

తే తత్ సదన మాసాద్య మోదంతే భరతర్షభ! ౨౧
తపసా యేచ తీవ్రేణ త్యజంతీహ కళేబరమ్

తే తత్ స్థానం సమా సాద్య శ్రీమంతో భాంతినిత్యశః ౨౨
పితాచ త్వాహ కౌంతేయ! పాండుః కౌరవనందన!

హరిశ్చంద్రే శ్రియం దృష్ట్వా నృపతౌ జాతవిస్మయః ౨౩
విజ్ఞాయ మానుషం లోక మాయాంతం మాం నరాధిప!

ప్రోవాచ ప్రణతో భూత్వా వదేథా స్త్వం యుధిష్ఠిరమ్ ౨౪
సమర్థోఽసి మహీం జేతుం భ్రాతర స్తే స్థితా వశే।

రాజసూయం క్రతుశ్రేష్ఠ మాహరస్వేతి భారత! ౨౫
త్వయీష్టవతి పుత్రేఽహం హరిశ్చంద్రవ దాశువై

మోదిష్యే బహులాః శశ్వ త్సమాః శక్రస్య సంసది ౨౬
ఏవం భవతు వక్ష్యేఽహం తవ పుత్రం నరాధిపమ్

భూలోకం యది గచ్ఛేయ మితి పాండు మథాబ్రువమ్ ౨౭
తస్య త్వం పురుషవ్యాఘ్ర! సంకల్పం కురు పాండవ!

గంతాసి త్వం మహేంద్రస్య పూర్వైస్సహ సలోకతామ్ ౨౮
బహువిఘ్నశ్చ నృపతే క్రతు రేష స్మృతో మహాన్

ఛిద్రా ణ్యస్యతు వాంఛంతి యజ్ఞఘ్నా బ్రహ్మరాక్షసాః ౨౯
యుద్ధంచ క్షత్రశమనం పృథివీక్షయకారణమ్

కించి దేవ నిమిత్తంచ భవ త్యత్ర క్షయావహమ్ 30
ఏత త్సంచింత్య రాజేంద్ర యత్ క్షేమం తత్సమాచర

అప్రమత్తోస్థితో నిత్యం చాతుర్వర్ణ్యస్య రక్షణే 3౧
భవ ఛైధస్వమోదస్వ ధనై స్తర్పయచ ద్విజాన్ 3౨

ఏత త్తే విస్తరేణోక్తం యన్మాం త్వ పరిపృచ్ఛసి
ఆపృచ్ఛే త్వాం గమిష్యామి దాశార్హనగరీం ప్రతి 3౨

ఏవ మాఖ్యాయ పార్థేభ్యో నారదో జనమేజయ!
జగామ తై ర్వృతో రాజ న్నృషిభి ర్యై స్సమాగతః 33
గతేతు నారదే పార్థో భ్రాతృభి స్సహ కౌరవ!

రాజసూయం క్రతుశ్రేష్ఠం చింతయామాస పార్థివః 3౪

ప్రభో, రాజేంద్ర, హరిశ్చంద్రునిఁగూర్చియేది సీవశీగితివో యామాహాత్మ్యమునుఁ దెల్పెదను. ఆతఁడు బలవంతుఁడై రాజులకెల్ల సమ్రాట్టుగానుండెను. ఆతనికి మహీపాలురెల్లను శాసనావగతులై యుండిరి. హరిశ్చంద్రు డేకరథుండై శస్త్రప్రతాపమున సప్తద్వీపము లను జయించెను సశైల వనకాననముగ మహినెల్ల నిర్జించి రాజ సూయ మహాక్రతువు నాచరించెను. హరిశ్చంద్రు నాజ్ఞనుఁగొని మహీపాలురెల్లను విత్తమునుఁగొనివచ్చి ద్విజపరివేష్టులగుచు నాతని యజ్ఞమందు నిల్చిరి. ఆ హరిశ్చంద్రుఁడు యాజకులకు పంచ గుణాధికముగ ద్రవిణమొసంగెను ప్రసర్పకాలమునసకలదిశాగతులగు బ్రాహ్మణుల నెల్ల దక్షిణభోజనములచేసంతృప్తులఁగావించెను. రత్నసం

తుష్టులై యాద్విజవరు లాశీర్వదించిరి. హరిశ్చంద్రుఁడా శుభాశీస్సులవలన తేజోవంతుఁడాయెను, యశోవంతుఁడాయెను. నృపులందధికుండాయెను. ఈ కారణముగ హరిశ్చంద్రుఁడా రాజసహస్రములకన్న మిన్నయై విరాజిల్లుచున్నాఁడు. ఏమహీపాలు లీరాజసూయ మహాక్రతువును యజించెదరో వారింద్రునితో సహామోదమొందెదరు. వెన్నియ్యక నిలిచిపోరాని యుద్ధనిహతులగు వారింద్రసదనమున మోద మొందెదరు. తీవ్రతప మొనర్చి యిచ్చట తనువుత్యజించువారా స్థానమొంది శ్రీమంతులై నిత్యము ప్రకాశించెదరు. కౌరవనందనా! హరిశ్చంద్రునందు వెలుంగు వైభవమును (శ్రియం) గాంచి జాతవిస్మితుడై నీ తండ్రి యిట్లు పలికెను. నేను మానుషలోకమునకు వచ్చునది తెలిసి ప్రణతుఁడై యిట్లు పలికెను "యుధిష్ఠిరునితో నిట్లు తెల్పుము. మహిని జయింప నీవు సమర్థుండ వగుదువు, భ్రాతలు నీవశమందున్నవారు, రాజసూయమును సంఘటింపుము (ఆహరస్వేతి) నీవట్లొనరించినచో నేనా హరిశ్చంద్రునట్లు శక్రసదనమునకు వేగఁబోగల నందు శాశ్వతముగా బహువత్సరములు మోదమొందువాఁడ నగుదును" ఇట్లని పాండురాజు నీకు దెల్పవలసినదని పలికెను. 'అట్లుగనే నీ పుత్రునితో భూలోకమునకుఁబోవునవసరమున నేను దెల్పెదను' అని పాండురాజు తోడ నప్పుడు పలికితిని. నీ వాతని సంకల్పమునుఁ గావింపుము. పూర్వులతో గూడి నీవు మహేంద్రలోకమునకుఁ బోవువాఁడ వగుదువు. బహువిఘ్నములుగల దీ మహాక్రతువని స్మృతము, యజ్ఞఘ్నులగు బ్రహ్మరాక్షసు లిందు ఛిద్రములను వాంఛించెదరు క్షత్రశమనము, పృథివీక్షయ కారణమునగు యుద్ధము క్షయావహమగు ఘోరసంగ్రామము కించిన్నిమిత్తముగనే రాఁగలదు. దీనినంతయు బాగుగా చింతించి రాజేంద్ర! యెయ్యది క్షేమమగు నయ్యది గావింపుము చాతుర్వర్ణ్య రక్షణమందు నిత్య మప్రమత్తోత్థితుఁడవై యుండి ద్విజులను విత్తములచే సంతప్తులను గావించి

ప్రవర్తింపుము నీవు పరిప్రశ్న గావించిన దెల్ల విస్తరించి పలికితిని. పోయి వచ్చెద నింక. ద్వారకకుఁబోయెదను.' అని నారదుఁడు ధర్మరాజుతోఁబలికెను. జనమేజయ ! పాండవుల కిట్లు తెల్పి నారదుఁడు ఋషులతోఁగూడ వెడలిపోయెను.

బలవంతుఁడైన హరిశ్చంద్రునకు శాసనావనతులై మహీపాలు రెల్లనుండిరి. అతఁడేక రథుఁడై సప్తద్వీపములతోఁగూడిన పృథ్వి నంతయు, సశైలవనకాననముగా జయించి రాజసూయ మహాక్రతువును గావించెను. ఆయజ్ఞమందు యాజకులను, బ్రాహ్మణుల నాతఁడు సంతృప్తులను గావించెను. అందువలన నా మహానుభావుఁడింద్రునితోఁగూడి మోదమొందు వాఁడాయెను. నారదుఁడు హరిశ్చంద్రునందలి రెండు యోగ్యతల నిట్లు తెల్పి రాజసూయక్రతు విశేషమును ఇంద్రలోక విశేషమును వివరించెను. రాజసూయమ్మాచరించిన ఘనుఁ డింద్రునితోడ మోద మొందగలఁడు. (౧) తీవ్ర పరాక్రమము నొనరించి యుద్ధ నిహతులైన శూరులింద్రసదనమునకుఁ బోయెదరు. (౨) తీవ్ర తపశ్చరణమున తను త్యాగ మొందినవారు తత్ స్థాన మొంది శ్రీమంతులై భాసించెదరు (౩) ఇట్లుగా నారదుఁడింద్రలోకమునకుఁ జేరువారి యోగ్యతలను మూడు విధములుగా వర్ణించెను. ఈ ప్రసంగ ముప్పట్టున కొంతయో ననుసరించి భావిపరిణామదశను సూచించుచున్నది.

నారదుఁడా పిమ్మట పితృలోకగతుండగు పాండుని సందేశ మును వినిపించెను. హరిశ్చంద్రుని యాపరమోత్తమ స్థానమునకు జాతవిస్మయుడై యుండిన పాండురాజు నారదాగమనమును విని యోగించుకొని ధర్మజునకు సందేశమంపెను. ధర్మరాజునందు రెండు యోగ్యతలు ఘనముగా గలవు 'సమర్థోసి మహీంజేయం' అనునది మొదటిది. ధర్మజుని యద్వితీయ సమర్థత నిది ప్రధానముగా

వ్యక్తీకరించుచున్నది. ‘ భ్రాతర స్తే స్థితా వశే ’ అనునది మఱి యొకసమర్థత. జగజ్జెట్టులైన తమ్ములు భీమాదులు నలువురు ధర్మరాజునకు వశ్యులుగా నున్నారు. ఇది పాండవుల యుత్తమత్వమును, ధర్మజుని పటిష్టతనుఁగూడ వ్యక్తీకరించుచున్నది.

మనుష్య లోకమునకు నారదుఁడు పోవుట నెఱింగి పాండు మహారాజీసందేశమును తెల్పెను. భూలోకమునకుఁబోవునపు డిది తెల్పెదనని నారదుఁడు బదులు పలికెను. ఉభయుల యొక్క సమయ చింతనము నిది వ్యక్తీకరించుచున్నది. నారదుఁడు పాండుని సందేశమును వినిపించి ధర్మజుని తమను ప్రోత్సహించినాఁడు. “ తస్యత్వం పురుష వ్యాఘ్ర ! సంకల్పం కురుపాండవ ! ” అని ప్రోత్సహించి, “గంతాసి త్వం మహేంద్రస్య పూర్వైః స్సహ సలోకతాం” అని దాని ఫలితమును వివరించెను. యజ్ఞ విధానమున దటస్థించు ఘోర పరిస్థితినిఁగూడ తెల్పుచు జాగరూకుఁడవై యజ్ఞ విధానమును నడపుము, చాతుర్వర్ణ్య రక్షకుండవు కమ్మ’ అని కర్తవ్యమును బోధించెను. ఉపదేశానంతరము నారదుఁడు ఋషిసహితుఁడై ద్వారకకు వెడలి పోవుట యిచ్చట నుల్లేఖింపఁ బడినది. ఇది శుభ పరిణామమును రూఢిఁగా వించుచున్నది.

సమర్థుండగు ధర్మరాజు జగజ్జెట్టులగుఁ దమ్ములతో రాజసూయమునుఁగూర్చి మొదట విచారించినాఁడు.

రాజసూయ నిశ్చయము.

ఋషే స్త ద్వచనం శ్రుత్వా నిశశ్వాస యుధిష్ఠిరః।
చింతయన్ రాజసూయేష్టిం న లేభే శర్మ భారత। ౧౩-౧
రాజర్షీణాంచ తం శ్రుత్వా మహిమానం మహాత్మనామ్
యజ్వనాం కర్మభిః పుణ్యై ర్లోకప్రాప్తిం సమీక్ష్యచ ౨
హరిశ్చంద్రంచ రాజర్షిం రోచమానం విశేషతః

యజ్వానం యజ్ఞ మాహర్తుం రాజసూయ మియేష సః 3
యుధిష్ఠిర స్తత స్సర్వా నర్చయిత్వా సభాసదః
ప్రత్యర్చితశ్చ తై స్సర్వై ర్యజ్ఞాయైవ మనోదధే ౪
స రాజసూయం రాజేంద్ర! కురుణా మృషభ స్తదా
ఆహర్తుం ప్రవణం చక్రే మన స్సంచింత్య చాసకృత్ ౫
భూయ శ్చాద్భుత వీర్యౌజా ధర్మ మే వాను చింతయన్
కిం హితం సర్వలోకానాం భవే దితి మనోదధే ౬
అనుగృహ్ణన్ ప్రజా స్సర్వా స్సర్వ ధర్మ భృతాం వరః
అవిశేషేణ సర్వేషాం హితం చక్రే యుధిష్ఠిరః ౭
సర్వేషాం దీయతాం దేయం ముష్ణన్ కోపమదా వుభౌ
సాధు ధర్మేతి ధర్మేతి నాన్యత్ శ్రూయేత భాషితమ్ ౮
ఏవం గతే తత స్తస్మిన్ పితరీ వా శ్వసన్ జనాః
న తస్య విద్యతే ద్వేష్టా తతోఽస్యాజాత శత్రుతా ౯
పరిగ్రహా న్నరేంద్రస్య భీమస్య పరిపాలనాత్
శత్రూణాం క్షపణాచ్చైవ బీభత్సో స్సవ్య సాచినః ౧౦
ధీమత స్సహదేవ స్య ధర్మాణా మనుశాసనాత్
వైనత్యా త్సర్వత శ్చైవ నకులస్య స్వభావతః ౧౧
అవిగ్రహవీత భయాః స్వకర్మ నిరతా స్సదా
నికామవర్షా స్స్ఫీతాశ్చ ఆసన్ జనపదా స్తథా ౧౨
వార్ధుషీ యజ్ఞ సత్త్వాని గోరక్షం కర్షణం వణిక్
విశేషా త్సర్వ మేవైతత్ సంజజ్ఞే రాజకర్మణా ౧౩
అనుకర్షంచ నిష్కర్షం వ్యాధి పావక మూర్ఛనం
సర్వ మేవ న తత్రాసీ ద్ధర్మ నిత్యే యుధిష్ఠిరే ౧౪

దస్యుభ్యో వంచకేభ్యశ్చ రాజ్ఞః ప్రతి పరస్పరం
రాజవల్లభత శ్చైవ నాశ్రూయత మృషా కృతమ్ ౧౫

ప్రియం కర్తు ముపస్థాతుం బలికర్మ స్వకర్మజం
అభిహర్తుం నృపాః షట్సు పృథక్ జాత్యైశ్చ నైగమైః ౧౬
వవృధే విషయ స్తత్ర ధర్మనిత్యే యుధిష్ఠిరే

కామతో ప్యుపయుంజానై రాజస్వై ర్లోభజై ర్జనైః ౧౭
సర్వవ్యాపీ సర్వగుణీ సర్వసాహస్స సర్వరాట్

యస్మి న్నధికృత స్సమ్రాట్ భ్రాజమానో మహాయశాః ౧౮
యత్ర రాజన్ దశదిశః పితృతో మాతృత స్తథా

అనురక్తాః ప్రజా ఆస న్నాగోపాలా ద్విజాతయః ౧౯
స మంత్రిణః సమానాయ్య భ్రాతౄంశ్చ వదతాంవరః

రాజసూయం ప్రతి తదా పునః పున రపృచ్ఛత ౨౦
తే పృచ్ఛ్యమానా స్సహితాః వచోర్థ్యం మంత్రిణ స్తదా

యుధిష్ఠిరం మహాప్రాజ్ఞం యియక్షు మిద మబ్రువన్ ౨౧
యే నాభిషిక్తో నృపతి ర్వారుణం గుణ మృచ్ఛతి

తేన రాజాపి తం కృత్స్నం సమ్రాడ్గుణ మభీప్సతి ౨౨
తస్య సమ్రా డ్గుణార్హస్య భవతః ! కురునందన

రాజసూయస్య సమయం మన్యంతే సుహృద స్తవ ౨3
తస్య యజ్ఞస్య సమయ స్స్వాధీనః క్షత్రసంపదా

సామ్నా షడగ్నయో యస్మిన్ శ్చీయంతే సంశితవ్రతైః ౨౪
దర్వీహోమా నుపాదాయ సర్వాన్ యః ప్రాప్నుతే క్రతూన్

అభిషేకంచ యస్యాంతే సర్వజి త్తేన చోచ్యతే ౨౫
సమర్థోఽసి మహాబాహో సర్వే తే వశగా వయమ్

ఆచిరాత్త్వం మహారాజ! రాజసూయ మవాప్స్యసి ౨౬
అవిచార్య మహారాజ రాజసూయే మనః కురు
ఇత్యేవం సుహృద స్సర్వే పృథక్చ సహ చాబ్రువన్ ౨౭
స ధర్మ్యం పాండవ స్తేషాం వచః శ్రుత్వా విశాంపతే!
ధృష్ట మిష్టం వరిష్ఠంచ జగ్రాహ మనసా రిహా ౨౮
శ్రుత్వా సుహృద్వచస్తచ్చ జానంశ్చాప్యాత్మనః క్షమమ్
పునః పునర్మనో దధ్రే రాజసూయాయ భారత! ౨౯
స భ్రాతృభిః పునర్ధీమా నృత్విగ్భిశ్చ మహాత్మభిః
మన్త్రిభిశ్చాపి సహితో ధర్మరాజో యుధిష్ఠిరః ౩౦
ధౌమ్య ద్వైపాయనాద్యైశ్చ మంత్రయామాస మంత్రవిత్
ఇయం యా రాజసూయస్య సమ్రాడర్హస్య సుక్రతోః ౩౧
శ్రద్దధానస్య వదతః స్పృహా మే సా కథం భవేత్
ఏవముక్తాస్తు తే తేన రాజ్ఞా రాజీవలోచన! ౩౨
ఇదమూచుర్వచః కాలే ధర్మరాజం యుధిష్ఠిరమ్
అర్హ స్త్వమసి ధర్మజ్ఞ రాజసూయం మహాక్రతుమ్ 33
అథైవ ముక్తే నృపతా వృత్విగ్భి ఋషిభిస్తథా
మంత్రిణో భ్రాతరశ్చాస్య తద్వచః ప్రత్యపూజయన్ ౩౪
సతు రాజా మహాప్రాజ్ఞః పునరేవాత్మ నాత్మవాన్
భూయో విమమృశే పార్థో లోకానాం హితకామ్యయా ౩౫
సామర్థ్యయోగం సంప్రేక్ష్య దేశకాలౌ వ్యయాగమౌ
విమృశ్య సమ్యక్ఛ్ధియా కుర్వన్ ప్రాజ్ఞో నసీదతి ౩౬
నహి యజ్ఞ సమారంభః కేవలాత్మ వినిశ్చయాత్
భవతీతి సమాజ్ఞాయ యత్నతః కార్యమున్నయన్ ౩౭
సనిశ్చయార్థం కార్యస్య కృష్ణమేవ జనార్దనం

సర్వలోకా త్పరం మత్వా జగామ మనసాహరిమ్ ౩౮
అప్రమేయం మహాబాహుం కామా జ్జాతమజంనృషు
పాండవస్త్రారు యామాస కర్మభిర్దేవసమ్మితై: ౩౯
నాస్య కించిద విజ్ఞాతంనాస్య కించి దకర్మజం
ససకించిన్న విషహేదితి కృష్ణ మమన్యత ౪౦
సతుతాం నైష్ఠికీం బుద్ధిం కృత్వాపార్థో యుధిష్ఠిరః
గురవద్భ్రాతగురవే ప్రాణిణోద్దూతమంజసా ౪౧
శీఘ్రగేన రథేనాశు సదూతః ప్రాప్యయాదవాణ్
ద్వారకా వాసినం కృష్ణం ద్వారవత్యాం సమాసదత్ ౪౨
దర్శనాకాంక్షిణం పార్థం దర్శనాకాంక్ష యాచ్యుతః
ఇంద్రసేనేన సహిత ఇంద్రప్రస్థ మగా త్తదా ౪౩
వ్యతీత్య వివిధాన్ దేశాం స్త్వరావాన్ క్షిప్రవాహనః
ఇంద్రప్రస్థగతం పార్థ మభ్యగచ్ఛ జ్జనార్దనః ౪౪
సగృహే పితృవద్ భ్రాత్రా ధర్మరాజేన పూజితః
భీమేనచ తతో పశ్య త్స్వసారం ప్రీతిమాన్ పితుః ౪౫
ప్రీతః ప్రీతేన సుహృదా రేమేస సహిత స్తదా
అర్జునేన యమాభ్యాంచ గురువత్ పర్యుపాసితః ౪౬
తం విశ్రాంతం శుభే దేశేక్షణినం కల్య మచ్యుతమ్
ధర్మరాజః సమాగమ్య జ్ఞాపయత్స్వం ప్రయోజనమ్ ౪౭
ప్రార్థితో రాజసూయో మేనచాసౌ కేవ లేప్సయా
ప్రాప్యతే యేన తత్తేహి విదితం కృష్ణ సర్వశః ౪౮
యస్మిన్ సర్వం సంభవతి యశ్చ సర్వత్ర పూజ్యతే
యశ్చ సర్వేశ్వరోరాజా రాజసూయం స విందతి ౪౯
తం రాజసూయం సుహృదః కార్య మా హుః సమేత్య తే

తత్రి మేనిశ్చితతమం తవ కృష్ణ గిరా భవేత్ ౧౦
కచ్చిద్ధి సౌహృదా దేవ నదోషం పరిచక్షతే
స్వార్థ హేతో స్తథైవాన్యే ప్రియ మేవ వదం త్యుత, ౧1
ప్రియమేవ పరీప్సంతే కేచి దాత్మని యద్ధితమ్
ఏవం ప్రాయాశ్చ దృశ్యంతే జనవాదాః ప్రయోజనే ౧౨
త్వంతు హేతూ నతీ త్యైతాన్ కామక్రోధౌ వ్యుదస్యచ
పరమం యత్ క్షమంలోకే యథా వద్వక్తు మర్హసి ౧3

(నారదుని వచనము విని ధర్మరాజు నిట్టూర్పు విడిచెను. రాజసూయేష్టిని జింతించుచు నూరటను బొందకుండెను. మహాత్ములగు రాజర్షుల మహిమను విని యాజకుల పుణ్యకర్మలచే లోకప్రాప్తిని సమీక్షించి, రాజర్షియగు హరిశ్చంద్రుడు విశేషముగా రోచమానుడనుటను దలంచి ధర్మరాజు యజ్ఞ విధానమం దభిప్రాయము గలవాడాయెను. ధర్మజుడు సభాసదుల నర్చించి వారందఱిచే ప్రత్యర్చితుండై యజ్ఞమందే తలంపు నొందినవాడాయెను. కురువృషభుండైన యుధిష్ఠిరుడు మనస్సునందనేక పర్యాయములు బాగుగా జింతించి రాజసూయ మాచరించుటకే సమీచీన మొనరించెను. మఱియు (భూయః) అద్భుత వీర్యౌజుడగు ధర్మజుడు ధర్మమునే చింతించుచు సర్వ లోకములకు నేది హితమగును—అని మనము నాయత్తము గావించెను. ప్రజల నందఱి ననుగ్రహించుచు సర్వ ధర్మ భృతాంవరుడైన యుధిష్ఠిరుడవిశేషముగ హితమునే యెల్లఱకు గావించెను. క్రోధమదముల రెంటిని విడనాడి సర్వులకేయంగును. మంచిది 'ధర్మేతి ధర్మేతి' యనిదే కాని వేఱుమాట వినవచ్చుటలేదు. (నాన్యత్ శ్రూయతే భాషితం) ఇట్లగుటంజేసి తండ్రి వలెనే జనులాతని విశ్వసించినవారలైరి. అతనికి

ద్వేషి గానరానందున (నవిద్యతే) నజాత శత్రుత్వ మనుభవతని యందు వర్ణించినది. నరేంద్రుఁడగు ధర్మజుని పరిగ్రహమువలన, భీముని పరిపాలనము వలన, బీభత్సుఁడు సవ్యసాచి యయ్యర్జునుని శత్రుక్షపణమువలన, ధీమంతుఁడగు సహదేవుని ధర్మాను శాసనము వలన, వినమ్రుఁడగు నకులుని వినయ విధేయతవలన, నపుడు జన పదము లెల్ల చక్కఁగా నుండెను. అవిగ్రహములు (కలహములు లేవు) వీతభయములు (భయహేతువులు లేవు) సదా స్వకర్మ నిరతములు. నికామ వర్షములు (యథేష్టవర్షపాతములు) గలవు మఱియు స్ఫీతములు (ఫలించినవి) ఇట్లుగా జన పదము లన్నియు నేర్పడియుండెను. వర్షి వ్యాపారము, యజ్ఞ, సత్వములు, గోరక్ష, కర్షణము, వ్యాపారము-రాజకర్మ వలననివి విశేషముగా నేర్పడినవి, సద్గుణి యోగ్యమైనవి. (ధర్మముగావీనిని ప్రభుత్వము నడిపించుటఁజేసి యభివృద్ధినొంది యోగ్యఫలదాయకములయినవి.) ధర్మనిత్యుఁడై యుధిష్ఠిరుఁడు రాజ్య పరిపాలనముఁగావించుట వలన సనుకర్షము, నివకర్షము, వ్యాధిపావక మూర్ఛనము-ఇత్యాదులపుడు లేవు. దస్యుల వలనఁగాని, పంచకులవలనఁగాని, పరస్పరముగా రాజులు ప్రవర్తించుటవలనఁగాని యట్లే రాజవల్లభులవలనఁగాని యేదియుమృగాకృతమైనదని వినవచ్చుటలేదు. స్వకర్మజమగు బలికర్మ (కప్పము చెల్లించుట)యను విధిగల్గిన నృపాలురు ప్రియమాచరించుటకు, నుపస్థానమునకు వర్తించువారలైయుండిరి. (అభిహర్తుం నృపాఃషట్పృ పృథక్ జాత్యైశ్చైవ నైగమైః) ధర్మనిత్యుఁడై యుధిష్ఠిరుఁడుండగా నప్పుడు రాజసులులో భజులు నగునట్టివారును యథేష్ట కామ సంతృప్తులగుచుండిరి. సాత్త్విక సంపద విశేషించి వర్తించు ధర్మజుని రాజ్యమందు రాజసులు మున్నగువారును. సంపూర్ణ కాములగుచుండిరి. అట్టివారును మనసార యనుభవింపఁబడిన విషయములు (విషయసుఖములు, దేశములు) సొంపుమీరియుండినవి దేనియందధిక్షతుఁడై సామ్రాట్టగు

ధర్మరాజు విరాజమానుఁడై పరమ యశస్సునొందెనోయీ! ధర్మరాజప్పుడు రాజసూయవిధితత్పరుఁడై సమయమునకు) సర్వవ్యాపి సర్వగుణుఁడు సర్వసాహసికుఁడు, సర్వరాట్ గాఁబరిశీతుండాయెను. రాజా (జనమేజయా!) గోపాలురు మొదలుగా ద్విజాతుల పర్యంతము ప్రజలెల్లరు దశదిశలందంతట తండ్రియందు, తల్లియందువలె ధర్మజుని రాజ్యమందనురక్తులైయుండిరి. ధర్మరాజు మంత్రులను, తమ్ములను సమావేశమొనరించి రాజసూయమునుఁగూర్చి మరల మరల ప్రశ్నించెను. మంత్రులందఱు యాగనిశ్చయుండగు నామహాప్రాజ్ఞునితోనిట్లు పలికిరి. అభిషిక్తుఁడగు నృపాలుఁడు వారుణగుణము నొంది సమ్రాడ్గుణము నొందగలవాఁడగును. సమ్రాడ్గుణార్హుండవగు నీకు రాజసూయమునకిది సమయమని నీ సుహృదులు తలంచుచున్నారు. షడగ్నులతో గొప్ప రాజసూయమొనరించి యభిషిక్తుఁడగువాఁడు సర్వజిత్తనఁబడును. మహాబాహూ! సమర్థుండవీవు మేమందఱము నీకు వశ్యులై యున్న వారము. అచిరకాలముననే మహారాజ! రాజసూయమొందఁగలవు. సంకోచమొందక రాజసూయమందు మనముంచుము. ఇట్లుగా సుహృదు లెల్ల లొక్కటిగాను, వేఱువేఱుగను పలికిరి. ధర్మరాజు ధర్మమైన వారిమాట విని ధృష్టము వరిష్ఠము నగుదానిని మనసా పరిగ్రహించెను. ధర్మరాజు సుహృద్వచనమువిని, యాత్మ సామర్థ్యము నెఱింగి పెక్కుమారులుగా రాజసూయయాగమందు మనసుంచువాఁడాయెను. ధర్మరాజు యుధిష్ఠిరుఁడప్పుడు తమ్ములు, ఋత్విక్కులు, మంత్రులు. ధౌమ్యద్వైపాయనాదులతోనుగూడి యాలోచించెను. సమ్రాడస్థానిపాలిటిదైనట్టి రాజసూయ క్రతుశ్రేష్ఠమందు శ్రద్ధఁబూనియున్న నాయీ స్పృహ యెట్లు కాఁగలదు, వచింపుడు' అని పలికెను. వారందఱు తదవసరమున 'రాజసూయ మహాక్రతువునకు నీవర్హుండవు' అని పలికిరి ఋత్విక్కులు, ఋషులు నిట్లు పలుకగా మంత్రులు, తమ్ములు నామాటను ప్రశంసించుచు మాట పలికిరి మహాప్రాజ్ఞుఁడు, ఆత్మవంతుడు

నగు ధర్మరాజు పునః యాలోచించుకొనియెను, విమర్శగావించుకొనెను. లోకహితకాముఁడై ధర్మరాజింతగా రాజసూయ మహాక్రతువు నందు—తద్విషయకమగు దృష్టిగలవాడాయెను. సామర్థ్య యోగమును పరికించి దేశకాలములను, వ్యయాగమములను గుర్తెఱింగి సమ్యక్ బుద్ధిగా విమర్శించుకొని కార్యమాచరించు ప్రాజ్ఞుఁడుహానినొందడు. కేవలాత్మ నిశ్చయమున నే యజ్ఞసమారంభము-కాజాలదని గుర్తెఱింగియత్నపరుఁడై కార్యమును వహించుచు ధర్మరాజుఁడు కృష్ణుని స్మరించెను. ఆ కార్య నిశ్చయుండా జనార్దనునే స్మరించెను. ఆ హరి సర్వలోకాత్పరుఁడని మనసాయాతని పొందెను. అప్రమేయుండగు కృష్ణుఁడు కామాత్ నరులందుద్భవించినవాఁడు. ఆ కృష్ణుని దేవసమ్మతమైన కార్యములనుఁదలంచి ధర్మరాజు (పార్థః) తర్కించుకొనెను అతని కవిజ్ఞాతమైనది, అకర్మజమైనది లేదనియు, నాతనికిలోఁ చఁని దొక్కటియు లేదనియు యుధిష్ఠిరుఁడు గృష్ణునిఁగూర్చి తలంచెను. యుధిష్ఠిరుండిట్లు వైష్ఠికమైన బుద్ధిగావించి భూతగురుండగుఁ గృష్ణునియొద్దకు దూత నంపెను ఆ దూత శీఘ్రగతినిఁ బోయి ద్వారకావాసియగుఁగృష్ణుని ద్వారకయందుఁ గాంచెను. దర్శనాకాంక్షితుండైయున్న ధర్మజునిఁ జూడ దర్శనాకాంక్ష గల్గి కృష్ణుఁడే తెంచెను. ఇంద్రసేనుని తోడ నింద్రప్రస్థమునకు వాసుదేవుఁడే తెంచెను. వివిధ దేశములనుఁగడచి జనార్దనుండప్పుడింద్రప్రస్థగతుండగు ధర్మజుని ఁజూడ నింద్రప్రస్థమున కేతెంచెను గృహమందు తండ్రి పూజింపఁబడినట్లు ధర్మజునిచేఁ గృష్ణుడు పూజింపఁబడెను. భీమునిచే తను పూజితుఁడై కృష్ణుండపుడు మేనత్త యగుఁగుంతిని చూచెను. ప్రీతుండగు గృష్ణుండు ప్రీతుండగు ధర్మజునితో సంతోషమునుండెను. అర్జునునిచే తను, నకుల సహదేవులచేతను, గురవతు పూజింపఁబడెను. రమ్యప్రదేశమున (శుభేదేశే) విశ్రాంతి నొందియున్న దక్షుండగు నచ్యుతుని సమీపించి (సమాగమ్య) ధర్మరాజు స్వప్రయోజన

మును వినిపించెను. (జ్ఞాపయత్వం ప్రయోజనం) రాజసూయమును గూర్చి నేను ప్రచోదితుఁడనైతిని (ప్రార్థితః) కేవలేప్సచేనది జరుగునది కాదు. ఏతత్ప్రాప్తి నీకు విదితమే. ఎవనియందు సర్వము సంభవించునో, యెవఁడు సర్వత్ర పూజితుఁడగునో, యెవఁడు సర్వేశ్వరుఁడగునో యట్టివాఁడు రాజసూయ మొందగలఁడు. ఆరాజసూయము కార్యమని సుహృదు లెల్లఱుచేరి పలుకుచున్నవారు. కృష్ణా! నీ వాక్యమున నిశ్చితతనుమది కావలసినది. కొందఱు సౌహృదయమున దోషమును చూడరు. కొందఱు స్వార్థహేతువుగా ప్రియమునే పలుకుదురు కొందఱు తమ హితమును తలంచి ప్రియమునే కోరెదరు (పరీప్సంతే) ఇట్లుగనే ప్రాయఃప్రయోజనమందు జనవాదము తేర్పడుచున్నవి. నీవీ హేతువులనెల్లఁగడచి కామక్రోధములను విడనాడి లోకమందేది పరమ క్షేమమగునో యట్లు వచింపుము'- అని ధర్మరాజు పలికెను.)

యమ సభయందుండిన (పితృలోక గతుండగు) పాండురాజు పంపిన సందేశమది. దానవ విశ్వకర్మ మయుఁడు నిర్మించిన సభయందా రాజసూయము ప్రవర్తింపవలసియున్నది. దానవరాజు వృషపర్వుని నిమిత్తముగా సేకరించిన ద్రవ్యములచే మయుఁడా సభను నిర్మించి ధర్మరాజునకు సమర్పించెను. రాజసూయము, క్షత్రియమనము, పృథివీక్షయ కారణమగుచున్నది. మఱియు పాండవుల కులమున కుద్ధారమైనది. లోకక్షేమమునుఁగల్గించునది. తండ్రి సందేశము, నారదుని ప్రేరణముగానున్న రాజసూయమునుఁ గావించు బాధ్యత పాండవులందు వర్తించినది ధర్మరాజు నారదోపదేశమును విని తమ్ములతో ముందుగా నాలోచించెను. పాండవులు యజ్ఞప్రవర్తకులగుట యిందువలన నిశ్చయమైనది. ౧౨ అధ్యాయము. (భ్రాతృభిస్సహ రాజసూయం చింత యామాస పార్థివః 3౧) ౧3 అధ్యాయములో మొదటి భాగమున ధర్మజుఁడు బాగుగా రాజసూయమునుఁగూర్చి చింతించిన విషయము గలదు. చివర భాగమున

నెల్లఱతో చింతించిన విషయము గలదు. ఈ యధ్యాయము మధ్య భాగమున పాండవుల రాజ్య పరిపాలనా విశేషము వర్ణింపఁబడినది. రాజసూయ క్రతు నిర్ణయమంను కృష్ణాను మోదమునుఁబొందఁగో రుట చిట్టచివర యందు చెప్పఁబడినది. రాజసూయక్రతు నిశ్చయ విషయమా యధ్యాయ మందిట్లుగా నిశ్చయింపఁబడినది.

నారదుఁడు రాజసూయ ప్రస్థాపన గావించి వెడలిన పిమ్మట ధర్మజుఁడు సర్వమునుఁదలపోసి చింత నొందెను ఇంద్రలోక విశేషమును, హరిశ్చంద్రు నున్నతిని పాండుని సందేశమును నెమగు వేసికొనెను; రాజసూయమందే స్పృహనొందెను. ఆ కురు వృష భుఁడు పలుమా రుగా వితర్కించుకొనెను. సర్వలోకమున కేది హిత మగు నంచు మనమందాలోచించెను. (౧–౭ శ్లోకములు) ధర్మజుడు రాజ్యపరిపాలన మొనరించి యెల్లరకు హితమూచరించు వాఁడాయెను ఆతని రాష్ట్రమందు వలన నెంతయో మేల్మినొందినది. సర్వ సౌఖ్య ముల నొందువారైరి ధర్మజుని రాజ్యపాలన మందెట్టిహానియు నెవ్విధమున నేర్పడుట లేదు. ( ౭–౧౭ శ్లోకములు ) పరమ ధర్మాత్ముఁడగు ధర్మరాజపుడు తనవారలతోడ పలుమారు పలువిధ ములుగా రాజసూయమునుఁగూర్చి వితర్కించెను, ఆత్మ సామర్థ్యమును తలపోసికొనెను. అపుడు యజ్ఞ నిశ్చయముఁగావించుకొనెను (౨౦–౩౫ శ్లోకములు) సర్వము తలపోసి ధర్మరాజు కార్యనిశ్చయార్థము కృష్ణుని స్మరించుకొనెను. (౩౬–౪౦ శ్లోకములు) కృష్ణుని పిలిపించి తన నిశ్చయమును ధర్మజుడు నివేదించెను. (౪౧–౫౩) శ్లోకములు.

సమర్థో ౭సి మహీం జేతుం భ్రాతరస్తే స్థితావశే
రాజసూయం క్రతుశ్రేష్ఠ మాహర స్వేతి భారత ! ౧౨–౨౩

ఇది పాండురాజు సందేశము.

తస్య త్వం పురుష వ్యాఘ్ర ! సంకల్పం కురుపాండవ !
గంతాసి త్వం మహేంద్రస్య పూర్వై స్సహ సలోకతామ్ ! ౨౭

ఇది నారదుని ప్రోత్సాహము.

యుధిష్ఠిర స్తత స్సర్వా నర్చయిత్వా సభాసదః
ప్రత్యర్చితశ్చ తై స్సర్వై ర్యజ్ఞాయైవ మనోదధే ౧౩౩౮
† సరాజసూయం రాజేంద్ర కురూణా మృషభ స్తదా
ఆహర్తుం ప్రవణం చక్రే మన స్సంచిత్య చాసకృత్ ౧

ఇది ధర్మజుని రాజసూయ నిశ్చయము.

సమంత్రిణః సమూనాయ్య భ్రాతౄంశ్చ వరతాంవరః
రాజసూయం ప్రతి తదా పునఃపున రపృచ్ఛత ౨౦

రాజసూయమును గూర్చి మంత్రులతోను, తమ్ములతోను మరల మరల నాలోచించుట నిది తెల్పుచున్నది

౨౧-౨౭ మంత్రులు. సుహృదులు ధర్మజుని ప్రోత్సహించుట నీ శ్లోకములు వివరించుచున్నవి.

శ్రుత్వా సుహృద్వచ స్తచ్చ జానం శ్చాప్యాత్మనః క్షమం
పునఃపునర్మనోదధే రాజసూయాయ భారత! ౨౭

రాజసూయమందు ధర్మరాజు మఱియు మఱియు మనోనిశ్చయము నేర్పఱచికొనెను. సుహృదుల ప్రోత్సాహము, అభిప్రాయమును దలంచి ధర్మరాజు క్రతునిశ్చయుఁడాయెను.

---

† (రాజేంద్ర) అను సంబోధన మిచోట విస్తృతార్థమైనది. జనమేజయుని 'రాజేంద్ర' అని సంబోధించి వైశంపాయనుని నీ విషయ మునుచ్చరించినాఁడు. 'రాజసూయం' అను పూర్వ పదము కురూణాం వృషభః అను పదము గమనింపఁదగినవి. కాఁగా నీ పాదము రత్నకాంతులను వెదజల్లునదిగా శోభించుచున్నది.)

అథైన ముక్తే నృపతా నృత్విగ్భి ర్ఋషిభి స్తదా
మంత్రిణో భ్రాతర శ్చాస్య తద్వచః ప్రత్యపూజయన్ 38

ఋత్విజులు, ఋషులు వచించిన మేల్మివచనములకు మంత్రులు, భ్రాతలు సమ్మోదమును వ్యక్తీకరించిరి.

ధర్మరాజిట్లుగా పలుమారు బహుదూరమెల్ల అతో నాలోచించి రాజసూయమును నిశ్చయించెను, ఈ నిర్ణయమును గూర్చి యాద్యంతములందిట్లు రెండు శ్లోకములు గలవు

భూయ శ్చాద్భుత వీర్యౌజా ధర్మమే వాను చింతయ|
కింహితం సర్వలోకానాం భవేదితి మనోదధే ౬

సతు రాజా మహాప్రాజ్ఞః పునరే నాత్మ నాత్మవాన్
భూయో విమమృశే పార్థో లోకానాం హితకామ్యయా 39

అద్భుత వీర్యౌజుండగు ధర్మరాజు ధర్మమునే తలంచి రాజసూయమందు మన ముంచెను. లోకహిత మెట్లగునని తలంచెను. ఇది మొదటి విషయము. మహాప్రాజ్ఞుడు, నాత్మవంతుండు నగు ధర్మరాజు తనలోదాను వితర్కించుకొని లోకహితకాముండై రాజసూయమునుంగూర్చి నిశ్చయించెను, ఆ నిశ్చయమును వెల్లడించు సమర్థమగు శ్లోకమూపై యిట్లుగలదు.

సామర్థ్యయోగం సంప్రేక్ష్య దేశకాలౌ వ్యయాగమౌ
విమృశ్య సమ్యక్చధియా కుర్వన్ ప్రాజ్ఞోనసీదతి ' 3౭

ధర్మజుడు సామర్థ్య యోగమును చింతించినాడు. పాండవ సామర్థ్యమపుడు యోగించు పరిస్థితి గలదు. పాండవ ప్రయత్నమునకు దేశకాలము లనుకూలముగా వేర్పడియున్నవి. దీని

నంతయు ధర్మజుఁడు లెస్సగా నిశ్చయించుకొనినాఁడు. మఱియు ధర్మరాజు వ్యయాగమములను విచారించినాఁడు. 'వ్యయాగమౌ' అనునది మఱియు సమం జసమగు తలంపైయున్నది. రాజసూయ మహాక్రతువున కెంత వ్యయమగుననునది మొదటివిషయము. రాఁబడి (ఆగమ) మంత మేరకు ప్రాప్తించగలదనునది రెండవ విషయము. అత్యుచ్చగా యాగము కొనసాగుటకే యాలోచన మమోఘమైనది. మహాప్రాజ్ఞుఁడు ధర్మ రాజు దీనంతయు నాలోకనముగావించి నిశ్చయించి రాజసూయ ప్రవర్తకుఁడు కాఁదలంచినాఁడు. ప్రాజ్ఞుఁడగు ధర్మరాజు చెడుపు కలుగని విశేషముగా నంతయు నిశ్చయించుకొని యునిదంతయు కేవలమాత్మ నిశ్చయమనియు, కృష్ణుని సంప్రదించి కార్యోద్యుక్తుఁడగుట సర్వశ్రేయమనియు నిశ్చయించుకొనినాఁడు లోక హితకాముఁడైన ధర్మరాజు సర్వలోకాత్మరుండగు కృష్ణుని మనస్సున స్మరించుకొనెను.

దూత శీఘ్రవాహనుఁడై పోయి ద్వారకా నివాసి యగు కృష్ణుని ద్వారకయందు దర్శించెను ధర్మజుని ప్రార్థనను నివేదించెను దర్శనా కాంక్షియగు ధర్మజుని దర్శనా కాంక్షుడై కృష్ణుఁడిందప్రసేన సహితుఁడై యింద్రప్రస్థమునకే తెంచెను గృహాగతుంశగు తండ్రిని పూజించినట్లు ధర్మజుఁడు కృష్ణునర్చించెను. భీముడు, కుంతియు మర్యాదను నడిపిరి. అర్జునుడు, నకుల సహదేవులు కృష్ణునర్చించిరి. కృష్ణుఁడు సేదదీరిన పిమ్మట ధర్మజుఁడు స్వప్రయోజనమును వినిపించెను.

ధర్మరాజు 'ప్రార్థితో రాజసూయోమే' అని పలికినాఁడు 'ప్రార్థితః' అనునది బాధ్యతను, విధ్యుక్తమునుగూడ సూచించుచున్నది. పాండుని సందేశమది, నారదోపదేశమది. ధర్మజుని చింత దాని

యందే, తమ్ముల యాశయమదియే, మంత్రుల సమ్మతి, సుహృదుల మేల్మిమాట, ఋషులయామోదమందు గలదు. దీనినంతయు చక్కగా క్రోడీకరించి యీ పదమర్థమిచ్చుచున్నది. కృష్ణునకంత పరిస్థితి నీ మాటలోనిమిడ్చి ధర్మజుఁడు పలికినాఁడని పారస్యము. పరమ కార్యము నిట్లు విన్నవించి ధర్మరాజు కార్య వచనమును చక్కగా ప్రోత్సహిస్తే గోన 'త త్త్వేకిం విదితం కృష్ణ సర్వశః' (నీకదియెల్ల సర్వ విదితము) అనినాఁడు. రాజసూయ సిద్ధి కృష్ణునకు విదితమని ధర్మజుఁడు పలికినాఁడు.

యస్మిన్ సర్వం సంభవతియశ్చ సర్వత్ర పూజ్యతే
యశ్చసర్వేశ్వరో రాజా ! రాజసూయం సవిందతి ౪౭
తం రాజసూయం సుహృదః కార్యమాహుః సమేత్యత్
తత్రమే నిశ్చితతమంతవ కృష్ణగిరా భవేత్ ౫౦

ధర్మజుఁడు రాజసూయ ఘనతను పేర్కొనినాఁడు, ఎవనియందు సర్వము సంభవమో యెవఁడు సర్వత్ర పూజ్యుఁడో, యెవఁడు సర్వేశ్వరుఁడోయా రాజు రాజసూయమొందగలఁడు. రాజసూయమిట్టిది. ఆరాజసూయము కార్యమని సుహృదులు చేరి పలుకుచున్నారని ధర్మజుఁడు విచిత్రోచిత వచనముచ్చరించినాఁడు. సుహృద్విశాన వచనముగా దీనిని పేర్కొనుట ధర్మజుని వినయ వైభవమును వ్యక్తీకరించుచున్నది. 'ఆ పరమ కర్తవ్య విశేషము నిశ్చితమమట కృష్ణ వాక్యమున' అని ధర్మజుఁడనుచున్నాఁడు. 'తత్రమే నిశ్చితతమం తవ కృష్ణ గిరా భవేత్' అను కృష్ణ వాక్యావశ్యకతను ధర్మజుఁడు విన్నవించినాఁడు. కార్య నిశ్చయమందు ప్రాయః యేర్పడు దోసగుల నెల్లడల గడచి సమర్థ వచనము ధర్మ మార్గమున వచింపుమంచు ధర్మజుఁడు కృష్ణుని

గోరినారు. సర్వ విజ్ఞాతుఁడగు ధర్మజుని మాట విని కృష్ణుఁడు నిశ్చిత మతమైన కార్య వచనమిట్లు పలికినాఁడు.

సర్వైర్గుణైర్మహారాజ ! రాజసూయం త్వమర్హసి
జానతస్త్వేవ తే సర్వం కించి ద్వక్ష్యామి భారత ! ౧౪౧
జామదగ్న్యేన రామేణ క్షత్రం యదవశేషితమ్
తస్మా దవరజంలోకే యదిదం క్షత్ర సంజ్ఞితం ౨
కృతోఽయం కుల సంకల్పః క్షత్రియై ర్వసుధాధిప !
నిదేశభాగ్భిస్తత్తేహి విదితం భరతర్షభ ! ౩
ఐలస్యే క్ష్వాకు వంశస్య ప్రకృతిం పరిచక్షతే !
రాజానః శ్రేణి బద్ధాశ్చ తథాన్యే క్షత్రియా భువి ౪
ఎలవంశాశ్చ యే రాజం స్తథైవే క్ష్వాకవో నృపాః
తాని చైకశతం విద్ధి కులాని భరతర్షభ ౫
యయాతే స్త్వేవ భోజానాం విస్తరో గుణతో మహాన్
భజతేఽద్య మహారాజ విస్తరంస చతుర్దిశమ్ ౬
తేషాంతథైవ తాంలక్ష్మీం సర్వక్షత్ర ముపాసతే ||
ఇదానీమేవ వై రాజన్ జరాసంధో మహీపతిః ౭
అభిభూయ శ్రియం తేషాం కులానా మభిషేచితః
స్థితో మూర్ధ్ని నరేంద్రాణా మోజ సాక్రమ్య సర్వశః ౮
సోఽవనిం మధ్యమాం భుక్త్వా మిథో భేద మమన్యత|
ప్రభుర్యస్తుపరో రాజా యస్మిన్నేకవశే జగత్ ౯
స సామ్రాజ్యం మహారాజ ప్రాప్తో భవతి యోగతః
తం స రాజా జరాసంధం సంశ్రిత్య కిల సర్వశః ౧౦

రాజన్ సేనాపతిర్జాతః శిశుపాలః ప్రతాపవాన్ ౧౧
తమేవచ మహారాజ శిష్యవత్సముపస్థితః
వక్రః కరూషాధిపతిర్మాయాయోధీ మహాబలః ౧౨
అపరౌచ మహావీర్యౌ మహాత్మానౌ సమాశ్రితౌ
జరాసంధం మహావీర్యంతౌ హంసడింభకావుభౌ ౧౨
దంతవక్రః కరూషశ్చకరభో మేఘవాహనః
మూర్ధ్నా దివ్యమణిం బిభ్రత్ యమద్భుతమణిం విదుః ౧౩
మురుంచ నరకంచైవ శాస్తియో యవనాధిపః
అపర్యంత బలో రాజా ప్రతీచ్యాం వరుణోయథా ! ౧౪
భగదత్తో మహారాజవృద్ధ స్తవపితుస్సఖా ౧౫
సవాచా ప్రణత స్తస్య కర్మణాచ విశేషతః
స్నేహబద్ధశ్చ మనసా పితృవద్భక్తిమాంస్త్వయి
ప్రతీచ్యాం దక్షిణం చాంతం పృథివ్యాః ప్రతియో నృపః ౧౬
మాతులో భవతః శూరః పురుజిత్కుంతివర్ధనః ౧౭
సతే సన్నతిమానేకః స్నేహతః శత్రుసూదనః
జరాసంధంగత స్త్వేవ పురాయో న మయా హతః
పురుషోత్తమ విజ్ఞాతోయోసౌ చేదిషు దుర్మతిః ౧౮
ఆత్మానం ప్రతిజానాతి లోకేఽస్మిన్ పురుషోత్తమం
ఆదత్తే సతతంమోహాద్యస్స చిహ్నంచ మామకమ్ ౧౯
వంగపుండ్రకిరాతేషు రాజా బలసమన్వితః
పౌండ్రకో వాసుదేవేతి యోసౌ లోకేఽభి విశ్రుతః ౨౦
చతుర్థభా ఙ్మహారాజ ! భోజ ఇంద్రసఖోబలీ

విద్యాబలాద్యోవ్యజయత్ సపాండ్యక్రథకైశికాన్ ॥ ౨౧
భ్రాతా యస్యాకృతిః శూరో జామదగ్న్యసమోఽభవత్
స భక్తో మాగధం రాజా భీష్మకః పరవీరహా ౨౨
ప్రియాణ్యాచరతః ప్రహ్వాన్ సదా సంబంధినస్తతః
భజతో నభజత్యస్మా నప్రియేషు వ్యవస్థితః ౨౩
న కులం న బలం రాజ న్నభ్యజానా త్తథాత్మనః
పశ్యమానో యశోదీప్తం జరాసంధ ముపాశ్రితః ౨౪
ఉదీచ్యాశ్చ తథా భోజాః కులా న్యష్టాదశ ప్రభో !
జరాసంధ భయాదేవ ప్రతీచందిశమాస్థితాః ౨౫
శూరసేనా భద్రకారాయోధాః సాల్వాః పటచ్చరాః
సుస్థలాశ్చ కటాదాశ్చ కుళిందాః కుంతిభిస్సహ ౨౬
సాల్వాయనాశ్చ రాజాన స్సోదర్యా నుచరై స్సహ
దక్షిణా యేచ పాంచాలాః పూర్వాః కుంతిషుకోసలాః ౨౭
తథోత్తరాం దిశంచాపి తరిత్యజ్యభయార్దితాః
మత్స్యా స్సన్న్యస్త పాదాశ్చ దక్షిణాం దిశ మాశ్రితాః ౨౮
తథైవ సర్వపాంచాలా జరాసంధ భయార్దితాః
స్వరాజ్యం సంపరిత్యజ్య విద్రుతా స్సర్వతో దిశమ్ ౨౯
కస్యచి త్త్వథ కాలస్య కంసో నిర్మథ్యయాదవాన్
బార్హద్రథ సుతేదేవ్యా ఉపాగచ్ఛ ద్వృథామతిః ౩౦
అస్తిప్రాప్తిశ్చ నామ్నాతే సహదేవానుజే బలే
బలేన తేన సజ్ఞాతీ నభిభూయ వృథామతిః ౩౧
శ్రైష్ఠ్యం ప్రాప్త స్సత స్యాసీ దతి వాపనయో మహాన్

భోజరాజస్య వృద్ధైశ్చ పీడ్యమానై ర్దురాత్మనా ౩౨
జ్ఞాతిత్రాణమభీప్సద్భి రస్మత్సంభావనా కృతా
దత్వాక్రూరాయ సుతనుం తా మాహుకసుతాం తదా ౩౩
సంకర్షణ ద్వితీయేన జ్ఞాతి కార్యం మయాకృతమ్
హతౌ కంస సునామానౌ మయా రామేణ చాప్యుత ౩౪
భయేతు సమతిక్రాంతే జరాసంధే సముద్యతే
మంత్రోఽయం మంత్రితో రాజన్ కులైరష్టాదశావరైః ౩౫
అనారమంతో నిఘ్నంతో మహాస్త్రైః శత్రుఘాతిభిః
న హన్యామో వయం తస్య త్రిభి ర్వర్షశతై ర్బలమ్ ౩౬
తస్య హ్యమరసంకాశౌ బలేన బలినాం వరౌ
నామభ్యాం హంస డింభకౌ వశస్త్రని ధనా వుభౌ ౩౭
తావుభౌ సహితౌ వీరౌ జరాసంధశ్చ వీర్యవాన్
త్రయస్త్రయాణాం లోకానాం పర్యాప్తా ఇతి మే మతిః ౩౮
నహి కేవల మస్మాకం యావంతోన్యేచ పార్థివాః
తథైవ తేషా మాసీచ్చ బుద్ధి ర్బుద్ధిమతాంవర ౩౯
అథహంస ఇతిఖ్యాతః కశ్చిదాసీ న్మహానృప :
రామేణ సహత స్తత్ర సంగ్రామే ఽష్టాదశావరే ౪౦
హతో హంస ఇతి ప్రోక్త మథకేనాపి భారత !
తచ్ఛ్రుత్వా డింభకో రాజ న్యమునాంభస్య మజ్జత ౪౦
వినాహంసేన లోకే ఽస్మి న్నాహం జీవితు ముత్సహే
ఇత్యేతాం మతిమాస్థాయ డింభకోని ధనం గతః ౪౨

తథాతు డింభకం శ్రుత్వా హంసః పరపురం జయ
ప్రసేదే యమునా మేవసో ऽ పి తస్యాం న్యమంజత ౪౩

తౌసరాజా జరాసంధః శ్రుత్వాచనిధనం గతౌ
పురం శూన్యేన మనసా ప్రియయా భరతర్షభ ! ౪౪

తతో వయ మమిత్రఘ్న తస్మిన్ ప్రతిగతే నృపే
పునరానం దిన స్సర్వే మధురాయాం వసామహే ౪౫

యదాత్వభ్యేత్య పితరం సావై రాజీవలోచనా
కంస భార్యా జరాసంధం దుహితా మాగధం నృపమ్ ౪౬

చోదయత్యేవ రాజేంద్ర ! పతివ్యసన దుఃఖితా
పతిఘ్నం మే జహీ త్యేవం పునః పునరరిందమ ౪౭

తతో వయం మహారాజ తన్మంత్రం పూర్వ మంత్రితం
సంస్మరంతో విమనసో వ్యపయాతా నరాధిప ! ౪౮

పృథక్త్వేన మహారాజ సంక్షిప్య మహతీం శ్రియం
పలాయామో భయా త్తస్యససుత జ్ఞాతి బాంధవాః ౪౯

ఇతి సంచింత్య సర్వేస్మ ప్రతీచీం దిశమాశ్రితా
కుశస్థలీంపురం రమ్యాంరైవ తేనోప శోభితామ్ ౫౦

తతో నివేశం తస్యాంచ కృతవంతో వయం నృప
తథైవ దుర్గ సంస్కారం దేవైరపి దురాసదం ౫౧

స్త్రియోఽపియస్యాంయుధ్యేయుః కిమువృష్ణి మహారథాః
తస్యాంవయమమిత్రఘ్న నివసామోఽకుతో భయాః ౫౨

ఆలోచ్యగిరిముఖ్యంతం మాగధం తీర్ణమేవచ
యాదవాః కురుశార్దూల పరాంముదమవాప్నువన్ ౫౩

ఏవం వయం జరాసంధా దభితః కృతకిల్బిషాః
సామర్థ్యవంత స్సంబంధా ద్గోమంతం సముపాశ్రితాః ౫౪
త్రియోజనాయతం సద్మ త్రిస్కంధం యోజనాదధి
యోజనాంతే శతద్వారం వీరవిక్రమతోరణమ్ ౫౫
అష్టదశావరై ర్నద్ధం క్షత్రియైర్యుద్ధదుర్మదైః
అష్టాదశసహస్రాణి భ్రాతౄణాం సంతినఃకులే ౫౬
ఆహుకస్యశతం పుత్రా ఏకైక స్త్రిదశా వరః
చారుదేష్ణస్సహ భ్రాత్రా చక్రదేవోఽథ సాత్యకిః ౫౭
అహంచరో హిణేయశ్చ సాంబశ్శౌరిసమో యుధి
ఏవమేతే రథాస్సప్త రాజన్నన్యా న్నిబోధమే ౫౮
కృతవర్మా హ్యనాధృష్టిః సమీకస్సమితిం జయః
కంకశ్శంకుశ్చ కుంతిశ్చ సప్తైతేవై మహారథాః ౫౯
పుత్రౌ చాంధక భోజస్య వృద్ధా రాజాచ తే దశ
వజ్రసంహననా వీరా వీర్యవంతో మహారథాః ౬౦
స్మరంతో మధ్యమం దేశం వృష్ణిమధ్యే వ్యవస్థితాః ౬౧
సత్వం సమ్రాడ్గుణైరుక్తః సదా భరత సత్తమ!
క్షత్రే సమ్రాజ మాత్మానం కర్తుమర్హసి భారత! ౬౨
నతు శక్యం జరాసంధే జీవమానే మహాబలే
రాజసూయం త్వయావాప్తు మేషా రాజన్మతిర్మమ ౬౩
తేన రుద్ధాహి రాజానః సర్వేజిత్వా గిరివ్రజే
కందరే పర్వతేంద్రస్య సింహేనేవ మహాద్విపాః ౬౪
సహి రాజా జరాసంధో యియక్షు ర్వసుధాధిపైః
మహాదేవం మహాత్మాన ముమాపతి మరిందమ ౬౫

ఆరాధ్య తపసోగ్రేణ నిర్జితాస్తేన పార్థివాః
ప్రతిజ్ఞాయాశ్చపారం సగతః పార్థివ సత్తమః ౬౬
సహి నిర్జిత్య నిర్జిత్య పార్థివాన్ పృతనాగతాన్
పురమానీయ బధ్వాచ చకార పురుషవ్రజమ్ ౬౭
వయంచైవ మహారాజ జరాసంధభయాత్తదా
మధురాం సంపరిత్యజ్య గతా ద్వారవతీం పురీమ్ ౬౮
యది త్వేతన్మహారాజ! యజ్ఞం ప్రాప్తుమభీప్ససి
యతస్వ తేషాంమోక్షాయ జరాసంధ వధాయచ ౬౯
సమారంభోనశక్యోయ మన్యథా కురునందన!
రాజసూయస్య కార్త్స్న్యేన కర్తుం మతిమతాంవర! ౭౦
ఇత్యేషా మేమతీ రాజన్యథావామన్యసేఽనఘ!
ఏవంగతే సమాచక్ష్వ స్వయం నిశ్చిత్యహేతుభిః ౭౧

(మహారాజా! సర్వగుణములచే రాజసూయమునకు నీవర్హుండవగుదువు సర్వమెఱింగియున్నట్టి నీకిపుడు కొంత వచించెదను. ఇపుడిపుడే జరాసంధుఁడను మహీపతి రాజుల నాపదల నెల్లడల గడచియున్నాడు. రాజన్యమూర్ధ్ని స్థితుండై యున్నాఁడు ఓజస్సుచే రాజుల నెల్లనాక్రమించి యసమానుఁడనని తలంచియున్నాఁడు. ఎవఁడు పరమ ప్రభుఁడో, జగమెల్లనే యొక్కనికి వశ్యమైయుండునో వాఁడు సామ్రాజ్యము నొందగలవాఁడగును. అట్టి జరాసంధునాశ్రయించి శిశుపాలుఁడాతనికి సేనానియై యేర్పడినాఁడు. మాయాయోధియైన కరూశాధిపతి వక్రుఁడు జరాసంధునకు శిష్యవతు వర్తించియున్నాఁడు. మహావీర్యులగు హంసడింభకులు, దంతవక్త్రాదులు, జరాసంధ పక్షస్థులై

యున్నారు. బిభ్రిన్మణియగు భగదత్తుఁడు-నీకు పితృసఖుండాతండును నీయందు భక్తియున్నవాఁడైనను వాచాకర్మణా జరాసంధునందు స్నేహాబద్ధుఁడై యున్నాఁడు. నీమాతులుఁడు శూరుఁడు పురుజిత్తొకఁడు మాత్రము స్నేహమున నిన్ను చేరియున్నవాఁడు. పుండ్రక వాసుదేవాదులు జరాసంధ పక్షస్థులైయున్నారు. పరశురామతుల్యుండగు శూరుఁడు కృతియను భ్రాంతయుండినను భీష్మకుఁడు జరాసంధునందు మొగ్గియున్నాఁడు. ప్రియములనే యాచరించి భజించు మమ్ముల నాతఁడనుసరించలేదు. మా సందర్భమును పరిగణింపలేఁడు. కులమును, బలమును విస్మరించి జరాసంధుని యశస్సునుగాంచి వానినాశ్రయించి నవాఁడైయున్నాఁడు. జరాసంధ భయార్దితులు రాజులు దిక్కులు పట్టియున్నారు స్వరాజ్యమునుపరిత్యజించి దిక్కులకు పాఱియున్నారు. కొంత కాలమునకు వృద్ధామతియగు కంసుఁడస్తి ప్రాప్తియను కన్యల నిరువురను-జరాసంధ పుత్రికలను చేబట్టి బహు దుర్మార్గుఁడై వర్తించెను. కంసుని బాధలు భరింపలేక భోజరాజాదులు మాకది తెల్పగా నేను కంసుని, బలరాముఁడు సునాముని తుదముట్టించితిమి. జ్ఞాతికార్య మిట్లాచరించితిమి. కంస భయము తీరగా నప్పుడు జరాసంధుని విజృంభణమేర్పడినది. అది గమనించి మేము-పదునెనిమిది కులములవార మిట్లు తలంచితిమి-మున్నూరు వత్సరము లెదిరించి పోరాడినను గూడ జరాసంధుని బలసంపదను పడఁగొట్టఁజాలము (అనారమంతో విఘ్నంతో మహాస్త్రైః...నహన్యామో—త్రిభిర్వర్షశతైః). అశస్త్రనిధనులైన హంసడింభకులు, జరాసందుడు—ఈ ముువ్వురు ముల్లోకములకు పర్యాప్తమైనవారు—అని నాయభిప్రాయము. ఈ తలంపు మాకు మాత్రమే కాదు, ఎందరు రాజులు గలరో వారంద ఱికిట్టి యభిప్రా

యమే యేర్పడినది. ఇటుండగా యాదవులతోడి పదునెనిమిదవ యుద్ధమందు 'హంసుఁడనువాఁడు బలరామునిచే హతుఁడాయెను.' అనుమాట యెట్లో కలిగినది. అది విని డింభకుఁడు యమునలో మునిగి పోయెను. హంసుడు లేనిదీ యీ లోకమందు జీవింపజాలనంచు డింభకుడు చనిపోయెను. (డింభకోని ధనం గతః) డింభకుడు నిధనుఁడగుట విని హంసుఁడును నాయమునందే మునిగిపోయి నిధనుఁడాయెను, హంస డింభకులిద్దరు నిట్లుగా నశస్త్రనిధనులగుటనుఁగాంచి వృథామతియగు జరాసంధుడు శూన్య మనస్కుఁడై పురమును ప్రవేశించెను, మేము పొంగి మధురలోనుంటిమి. కంస భార్య పతి వ్యసనదుఃఖితయై తండ్రి జరాసంధునితో 'నా భర్తను చంపినవానినిఁదునుముట్టింపుము.' అని మరల మరల ప్రబోధించెను. ఈ ప్రమాదమును సంస్మరించి మేము విమనస్కులమైతిమి. ముందుగనే మేము నిశ్చయించుకొని మధురా నగరమును విడిచి కుశస్థలిని జేరికొంటిమి. దేవతలకు మదురాసదమైన దుర్గమేర్పఱచుకొని యందుంటిమి. స్త్రీలుకూడ నూయందు యుద్ధ మొనర్పువారలైయున్నారింక మహారథుల సంగతి చెప్పనేల. ఇట్లుగా మేము భయము విడిచియటనున్నవారము. గిరిముఖ్యమును తిలకించి మాగధుని నతిక్రమించితిమని తలంచి యాదవులు పరమమోద మొందిరి. జరాసంధునిచేనల్ల కృతకిల్బిషులమగు మేమపుడు సామర్థ్యవంతులమై యష్టాదశకులము లవారము గోమంతమును చేరికొంటిమి. మూఁడు యోజనములు నిడివి, యోజనము వెడల్పు గల్గిన యిరువది యొక్క సకంధములుగల దుర్భేద్యదుర్గమును నిర్మించుకొంటిమి, శత ద్వారము, వీరవిక్రమ తోరణముగల్గి దుర్మదులగుక్షత్రియులచే నేర్పడి మా దుర్గము రక్షితమగుచున్నది. వెలకొలఁదిగా భ్రాతలు, సుతులు మాకుల రక్షగావించువారలైయున్నారు. మేటి వీరులు మహారథులు

పేలువురు మాయందున్నారు. ( వజ్ర సంహననా వీరా వీర్యవంతో మహారథాః ) ఆ నీవు సదా సమ్రాడ్గుణయుక్తుండవు, క్షత్ర సమాజమందు సమ్రాట్టగుట కర్హుఁడవు. జరాసంధుఁడు జీవించియుండగా రాజసూయము పొంద సాధ్యపడదని నాతలంపు. రాజు లందఱు వానిచే గిరివ్రజమం దరికట్ట బడియున్నారు. ఆ రాజులను బలి యిచ్చి జరాసంధుఁడు రుద్రయాగ మొనర్ప సమకట్టినాఁడు. ఉగ్ర తపమున నుమాపతి నారాధించిన వానిచే రాజులు నిర్జితులైనారు. జరాసంధుడు తన ప్రతిజ్ఞను పూర్తిగావించు వాఁడుగానున్నాఁడు. పృతనాగతులగు రాజులను నిర్జించి నిర్జించి యా జరాసంధుఁ డారాజులను పురమునకు గొనివచ్చి బంధించి పురుష వ్రజమును కావించెను. మేమును జరాసంధ భయమున మధురను విడిచి ద్వారకా నగరమునకు వెడలి పోయితిమి యజ్ఞ ప్రాప్తిని దలఁచుచో నీ రాజులను విముక్తి నొందించుటకు, జరాసంధ వధకు యత్నింపుము. అన్యథా యీ సమారంభము శక్యము కాదు. మతిమతాం వరుడా ! రాజసూయము సంపూర్తిగావించుట కన్యథా వీలుపడదు అనఘ ! యిది నా యభిప్రాయము నీవు తలంచినట్లే ఇట్లుకాగా స్వీయము హేతువులచే నిశ్చయించి యేర్పడ బలుకుము— అని కృష్ణుఁడు పలికెను. )

విచక్షణుఁడగు ధర్మరాజు బహుదూరమాలోచించి, మంత్రాంగ మొనరించి, యాత్మసామర్థ్య యోగము నెఱింగి రాజసూయ ప్రవర్తకుఁడయినాఁడు కృష్ణుని రావించి రాజసూయ నిశ్చయమును ఘనోచితముగా వెల్లడించినాఁడు. ' సర్వగుణములచేత రాజసూయమునకీ వర్హుండవు ' అని కృష్ణుడు ప్రసంగమారంభించి సంగతి

యాదవులు ద్వారకయందు పటిష్ఠులై జరాసంధునకు వశ్యము కాని వారై యుండిరి. కృష్ణుఁడు పరిస్థితినిట్లు దెల్పి బాధ్యత యేర్పడిన యుధిష్ఠిరున కది తగుసమయమని, సమార్పిట్టగుట యావశ్యకమని కార్యవచనము పిమ్మట పలికినాఁడు. జరాసంధుఁడు బ్రతికియుండగా రాజసూయము నెఱ వేఱదు కావున వానిని మదముట్టించుట యావశ్యకమని కృష్ణుఁడు వచించినాడు. మఱియు నిజపరిస్థితి నిట్లుగా కృష్ణుఁడు వివరించినాఁడు.

జరాసంధుడు రుద్రయాగమందు రాజులను బలిగావింప దలంచినాడు. రాజులను బంధించి రాజుల మందను గావించి యున్నాడు. దుష్టము, ఘోరమునగు యజ్ఞ విధానమందు లంపటు డగు దురాత్ముని జరాసంధుని ప్రయత్నమున కడ్డుతగులుట విధి, బంధువులగు రాజులను విడిపించుట కర్తవ్యము, జరాసంధ వధ ముఖ్య కర్తవ్యము-అని కృష్ణుఁడు వివరించినాఁడు. లోకమును కలగుండు గావించుచు, రాజులను పశువులను గావించి, దుష్ట యజ్ఞమునుఁ గావింప నున్నుఁడగు జరాసంధుని వధించి, బంధితులగు రాజులను విడిపించి, పిమ్మట నుత్తమమగు రాజసూయ మహాక్రతువు నాచరించుట కార్యమని కృష్ణుఁడు పలికినాఁడు. జరాసంధుఁడు తెగిపోయిన లోకము పాండవులందు వర్తింపఁగలదని కృష్ణుఁడు సూచించినాఁడు. సర్వలోక హితమిందువలన కాగలదనియు సూచించినాఁడు కృష్ణుఁ డింతప్రసంగముఁగావించి ధర్మజుని తలంపయ్యాదియే ' యని ప్రసంగమును ముగింపునకుఁ దెచ్చుట రసవంతముగా నున్నది. ' హేతువులచే నిశ్చయించుకొని కార్యప్రవర్తకుడఁవుకమ్ము' అంచు ధర్మజుని పరమ ముఖ్యునిగాఁ బర్యవసించుచు కృష్ణుఁడు తన ప్రసంగమును ముగించినాఁడు.

ఉక్తం త్వయా బుద్ధిమతా యన్నాన్యో వక్తు మర్హతి
సంశయానాంహి నిర్మోక్తా త్వంనాన్యో విద్యతే భువి॥ ౧౫-౧

గృహే గృహేహి రాజాన స్స్వస్య స్వస్య ప్రియం కరాః
నచ సామ్రాజ్య మాప్తాస్తే సమ్రాట్ శబ్దోహికృచ్ఛ్రభాక్ ౨

కథం పరానుభావజ్ఞః స్వం ప్రశంసితు మర్హతి
పరేణ సమవేతస్తుయః ప్రశస్య స్సపూజ్యతే 3

విశాలా బహుళా భూమి ర్బహురత్న సమాచితా
దూరం గత్వా విజానాతి శ్రేయో కృష్ణికులో ద్వహ ౪

శమ మేవ పరం మన్యే శమాత్ క్షేమం భవేన్మమ
ఆరంభే పారమేష్ఠ్యంతు న ప్రాప్య మితిమే మతిః ౫

ఏవ మేతేహి జానంతి కులే జాతా మన స్వినః
కశ్చి త్కదాచి దేతేషాం భవే చ్ఛ్రేష్ఠో జనార్దన ౬

వయం చైవ మహాభాగ జరాసంధ భయా త్తదా
శంకితాః స్మమహాభాగ దౌరాత్మ్యా త్తస్యచానఘ ౭

అహంహి తవ దుర్ధర్ష భుజవీర్యాశ్రయః ప్రభో
నాత్మానం బలినం మన్యే త్వయి తస్మా ద్విశంకితే ౮

త్వత్సకా శాచ్చ రామాచ్చ భీమసేనాచ్చ మాధవ
అర్జునాద్వా మహా బాహూచా హంతుం శక్యో నవైతివై ౯

ఏవం జానన్ హివార్ష్ణేయ విమృశామి పునః పునః
త్వంమే ప్రమాణభూతోఽసి సర్వకార్యేషు కేశవ ౧౦

తచ్ఛ్రుత్వా చాబ్రవీద్భీమో వాక్యం వాక్య విశారదః
భీమః ‚‚అనారంభపరో రాజా వల్మీక ఇవ సీదతి ౧౧

దుర్బల శ్చాను పాయేన బలినంయోఽధితిష్ఠతి
అతంద్రితస్తు ప్రాయేణ దుర్బలో బలినం రిపుమ్ ౧౨

జయే త్సమ్యక్ ప్రయోగేన నీత్యార్థా నాత్మనో హితాణ
కృష్ణే నయో మయి బలం జయః పార్థే ధనం జయే
మాగధం సాధయిష్యామ ఇష్టిం త్రియ ఇవాగ్నయః
కృష్ణః’’
అర్థా నారభతే బాలో నానుబంధ మవేక్షతే
తస్మాదరిం నమృష్యంతి బాల మర్థ పరాయణమ్ ౧౪

హిత్వా కరాణ మావనాశ్వః పాలనాచ్చ భగీరథం
కార్తవీర్య స్తపోవీర్యా ద్బలాత్తు భరతో విభుః ౧౫

బుద్ధ్యామరు త్తస్తాణ పంచ సమ్రాజ స్త్వాను శుశ్రుమ
సామ్రాజ్య మిచ్ఛతేస్తేతు సర్వాకారం యుధిష్ఠిర ౧౬

మంత్రాణ వశ్యా ననుమ్యశన్నేన మేవసతాంయుగే
నిగ్రాహ్యాలక్షణం ప్రాప్తిః ధర్మార్థనయలక్షణైః ౧౭

బార్హద్రథో జరాసంధ స్తద్విద్ధి భరతర్షభ !
నహ్యేన మనురుధ్యంతె కులా న్యేకశతం నృపాః ౧౮

తస్మాదిహి బలాదేవ సామ్రాజ్యం కురు తేహిసః
రత్నభాజోహి రాజానో జరాసంధము పాసతే ౧౯

నచతుష్యతి తేనాపి బాల్యాదనయ మాస్థితః
మూర్ధాభిషిక్తం నృపతిం ప్రధానపురుషో బలాత్ ౨౦

ఆదత్తేనచనోదృష్టోఽభాగః పురుషతః క్వచిత్
ఏవం సర్వాన్ వశేచక్రే జరాసంధశ్శతావరాన్ ౨౧

తం దుర్బలతరోరాజా కథం పార్థఉపైష్యతి
ప్రోక్షితానాం ప్రమృష్టానాం రాజ్ఞాం పశుపతేర్గృహే ౨౨

పశూనామివ కాప్రీతిర్జీవితే భరతర్షభ!
క్షత్రియశ్శస్త్రమరణో యదాభవతి సత్కృతః ౨౩

తతస్సమాగధం సంఖ్యే ప్రతిబాధేమయద్వయమ్
షడశీతిస్సమానీతాశ్శేషా రాజం శ్చతుర్దశ ౨౪

జరాసంధేన రాజానస్తతః క్రూరంప్రవర్త్స్యతే|| ౨౫

ప్రాప్నుయాత్సయశోదీప్తం తత్రయో విఘ్నమాచరేత్
జయేద్యశ్చ జరాసంధంస సమ్రాణ్ణియతం భవేత్ ౨౬

(ధర్మరాజు కృష్ణునితోనిట్లనెను— బుద్ధిమంతుడను నీవేర్పడ బలికిన దింకెవ్వాఁడును పలుక నర్హుండుకాఁడు. సంశయనిరోక్త నీవుగాక నేడొకండే భువియందు లేఁడు. (సవిద్యతే) గృహగృహమందు రాజులు స్వకీయస్వకీయ ప్రియంకరులగుదురు. వారు సామ్రాజ్య

మొందినవారు కారు. సామ్రాట్ శబ్దము కష్టతరమైనది. పరాను భావ మును గ్రహించిన వాఁడెవ్వఁడు స్వప్రశంస కెట్లర్హుండగును. పరునిచే ననునేతుఁడై యెవఁడు ప్రశంసింపఁ బడునో వాఁడు పూజ్యుండగును. విశాలము బహుళమైనది భూమి. బహురత్న సమంచితమైనది. వృష్ణికులోద్భవా! కృష్ణ! దూరముపోయి శ్రేయమెఱుఁగగలను. శమమే పరమని తలంచెదఁ శమముననే నాకు క్షేమంబగును. పార మేష్ఠ్యంబైన యజ్ఞారంభమందది పొందబడదని తలంపఁగుచున్నది. కులజాతులగు మనస్వివను నిలిక్లైతెలియుదు రందొకానొకఁడు శ్రేష్ఠుండగు చున్నాఁడు. మేముగూడ జరాసంధ భయమున, నానిదౌరాత్మ్యమున శంకితులమే యపుడయితిమి. నేనయిన దుర్ధర్షుఁడా! ప్రభో! త్వద్భుజా శ్రయుండనుగదా, నన్ను బలవంతుఁడనని తలంపను. నీయందందువలన విశంకయగుటను (నీయందే విశంకయగునపుడింక త్వద్భుజాశ్రయుండ నగు నన్ను నేనెట్లు బలవంతుండనని తలంచువాఁడనగుదును.) త్వత్సకాశ మున, బలరామునివలన, భీమునివలన మాధవా! అర్జునునివలనఁగాని మహాబాహో! (జరాసంధుని) జంప శక్యమా కాదా యేమియనుచు (దలంచితిమి) ఇట్లెఱింగియు వార్ష్ణేయుఁడా! మరలమరల విమర్శించు చున్నాను. కేశవ! సర్వకార్యములందు నీవే నాకు ప్రమాణభూతుండ వైయున్నావు— ధర్మజుని యీమాటలువిని వాక్యవిశారదుండగు భీముఁడిట్లుపలికెను. అనారంభపరుండగు రాజు వల్మీకమట్ల కరిగిపోవును అనుపాయముగా బలవంతు నెదిరించు దుర్బలుండును నట్లే (యగును) ప్రాయేన దుర్బలుఁడగువాఁడు–అతంద్రితుఁడగువాఁడు బలవద్రిపుని సమ్యక్ప్రయోగమునఁ జయింపగలుగును; ఆత్మహితార్థముల సమర్థించి పొందగలుగును కృష్ణునందు నయము, నాయందు బలము, పార్థుఁడు ధనంజయునందు జయము–త్రేతాగ్నులిష్టిని సాగించినట్లు మేము మాగధుని–జరాసంధుని సాధించెదము అని పలికెను. అపుడు కృష్ణుఁ

డిట్లు పలికెను. బాలుండగువాఁడర్థము లనారంభించును, అనుబంధమును గాననేరడు. కావున నర్థపరాయణుండగు నట్టిబాలుండగు శత్రువును సహింపరు. అజయ్యుల జయించి యౌవనాశ్వుఁడు (మాంధాత)పాలనమున భగీరథుఁడును, తపోవీర్యమున గార్తవీర్యుఁడు, బలమున భరతుడు, సంపదవలన మరుత్తు-నీయైదుగురు సమ్రాట్టులైరని వింటిమి. సతాం యుగమందలి వీరింబోలె సామ్రాజ్యమిచ్ఛయించు నీయందును సర్వాకారముగా నిదంతయు (నీయైదు విశిష్టములును) నేర్పడి యున్నది. ధర్మార్థనయ లక్షణములచే నిగ్రాహ్యాలక్షణమే ప్రాప్తియగును. జరాసంధుని విషయముగా దీని నంతయుగమనించుము. నూటయొకట కులములవారు-నృపులు నానినరికట్టలేకున్నారు. అందువలన వాఁడిపుడు బలముచేతనే సామ్రాజ్యము గావించుచున్నాఁడు. రత్నభాజకులగు రాజులు జరాసంధుని నుపాసించువారై యున్నారు, అయినను వాఁడు తుష్టినొందక బాల్యమున నీయనయమందేయున్న వాఁడు. మూర్ధాభిషిక్తుండగు నృపాలునెల్ల జరాసంధుడు-ప్రధాన పురుషు నట్లు ప్రవర్తించువాఁడై పట్టినొంచుచున్నాడు. (ఆధత్త) పురుషులంద భాగమఁ నృపాలుడు (జరాసంధుని పాఁలబడనివాఁడు) మనలో నెవ్వఁడు కానరాఁడు జరాసంధుఁడట్లు పెక్కు-రాజులను వశ్యమొనర్చుకొనినాఁడు, వానిని దుర్బలతరుడగు రాజెట్లుగా సమీపింపగలఁడు. జరాసంధుఁడు రాజులను పశుపతిగృహమందు పశువులుగా బంధించియున్నాఁడు. ప్రోక్షితులు, ప్రమృష్టులునగు నారాజులకు జీవితమందేమిగలదు. శస్త్రమరణమొందు క్షత్రియుఁడపుడు సత్కృతుఁడు కాగలఁడా? మనము జరాసంధుని బాధింప గల్గుచో, రాజా! ఎనుబదియార్గురు వానిచేగొని తేబడి బంధితులై యున్నారు, ఇంక పదునాల్గురు తరువాయి, అదిపూర్తియగుచో నా జరాసంధునిచే క్రూరము ప్రవర్తింపగలదు. అద్దాని కెవఁడు విఘ్నమాచరించునో

వాఁడు దీప్తమైన యశమును పొందగలఁడు. జరాసంధుని జయించిన వాఁడు నియతముగా సమ్రాట్టగును. అని కృష్ణుఁడు పలికెను.)

మధురను విడిచి కుశస్థలమునకుఁబోయి యాదవులు జరాసంధ భయము విడిచియుండిరి. దూరమునకుఁబోయి యాదవులు శ్రేయ మొందువారైరి. యాదవులు కాలూని సామర్థ్యవంతులైనారుకాని జరాసంధునెదిరించువారు కాలేరు; శమించియుండిరి. కృష్ణుని యీ మాటలు స్మరించుకొని ధర్మజుడు 'దూరంగత్వా విజానాతి శ్రేయోవృష్ణికులోద్వహా' అనిపలికినాఁడు. వృథామతియగుఁగంసుడు శ్రేష్ఠత్వమొంది యాదవులను హింసింపదొడంగెను. కంసుఁడు బహు దుర్మార్గుడు. శ్రేష్ఠత్వము వానికి లభ్యమైనది. అందువలన వాఁడు హెచ్చుప్రవర్తించి యాదవులచేనశించెను. కంసునిభార్య-జరాసంధుని కూతురు. జరాసంధునితో పతి వ్యసన దుఃఖితయై 'నా పతినిఁ జంపినవానినిఁ జంపుము' అని పదే పదే చెప్పెను. జరాసంధుఁడిట్లు యాదవులతోడి వైర నిర్బంధమొంది యాదవులను పలుమా రెదిరించెను. ఆ జరాసంధుని నెదిరించుట సాధ్యము కాదని తలంచి యాదవులు దూరమేగి యుండిరి. కృష్ణుని యీ మాటలు స్మరించు కొని ధర్మజుడు 'శమమేవ పరంమన్యే శమాత్ క్షేమం భవేన్మమ' అని పలికినాఁడు జరాసంధుఁడు రుద్రయాగ ప్రయత్నమున నుండి రాజుల మందనేర్పఱచి యున్నాఁడు. యాదవులును వానికి వెఱచి మధురను విడిచి వచ్చియు వాని నెదిరించువారు కాలేదు కృష్ణుని యీ మాటలు స్మరించుకొని ధర్మరాజు 'సమ్రాట్ శబ్దోహి కృచ్ఛ్రభాక్, ఆరంభే పారమేష్ఠ్యంతు నప్రాప్య మితిమేమతిః' అని పలికినాఁడు. 'మనస్వినులగు కులజాతు లిది యెఱింగియున్న

విషయమే ' అని ధర్మజుఁడు 'కచ్చతః దాచిదేతేషాం భవే చ్ఛ్రేష్ఠో జనార్దన ' అని పలికినాఁడు. * ధర్మరాజుని యీ యాత్మ విశ్వాసము నిది సూచించుచున్నది. పాండవ యాదవులకు వధార్హుఁడుగా దేలిన జరాసంధుని సామోపాయమునసనే తుదముట్టింపఁ దగునని ధర్మజుఁడు తన మంత్రాంగమున నూహించియే యున్నాఁడు. దానినే ధర్మజుఁడు చిత్రముగా "త్వత్సకాశాచ్చ రామాచ్చ భీమసేనాశ్చ మాధవ అర్జునాద్వా" అనినాఁడు. కృష్ణ సకాశమున భీమార్జునులం దొకరు జరాసంధుని వధింప సాధ్యమగునని పాండవులూహించినట్లు సూచితమైనది ధర్మజుఁడీమాట నింకను చిత్రముగా బలికినాడు. "అర్జునాద్వా మహాబాహో! హంతుం శక్యో నవేతివై" అనినాఁడు. రాజసూయమును ప్రోత్సహించి పలికి జరాసంధ పరాక్రమమును మిక్కిలిగా వరించి కృష్ణుడు శంకాస్థానమేర్పరచినాఁడు. ధర్మజుడుఁను లోక శ్రేష్ఠత్వ విషయముచ్చరించి జరాసంధ వధ సాధ్యమే యని సూచించుచు శంకాస్థానమే యేర్పఱిచినాఁడు. పూర్వ నిశ్చిత కార్యా విరోధముగా నుత్తర వచనము ధర్మజుఁడు పలికినాఁడు.

ఏవం జానన్ హి వార్ష్ణేయ విమృశామి పునః పునః
త్వాం మే ప్రమాణ భూతోఽసి సర్వ కార్యేషు కేశవ !

అనినాఁడు. ఆ తగు సమయమున వాక్య విశారదుఁడగు భీముఁడు కార్య నిశ్చయమును సూచించెను.

---

*శ్రేష్ఠులగుచుండువా రెల్లప్పుడు లోకమందుగుదురు. సర్వ శ్రేష్ఠతముండగు వాఁడు దైవ నిర్ణయమున పూర్వముగాఁ దోచ గలఁడు. ధర్మ ప్రవర్తకుండు సర్వ శ్రేష్ఠతముండు మరియు నరుడుగాఁ దోచఁగలఁడు.

"తచ్ఛ్రుత్వా చాబ్రవీద్భీమో వాక్యం వాక్యవిశారదః" అని యిచ్చట గలదు. జరాసంధ వధ తనయందే నత్రించియున్నదని భీముడుచిత ప్రసంగము గావించు చున్నాడని "తచ్ఛ్రుత్వాచ" అనునది వ్యక్తీకరించుచున్నది.

"అనారంభపరుడగు రాజు పుట్టపలె గరగిపోవును" అని భీముడనినాడు "అనారంభపరో రాజా" అని భీముడెంతయో సాభిప్రాయమగుమాట పలికి పరిస్థితి నంతయు నాక్రమించి ప్రసంగించు చున్నాడు. "ప్రయత్నము చేయని రాజు" అని దీని యర్థము కాదు. పాండవులు చేయదగిన ప్రయత్నము నిర్ణయించుకొనియే యున్నారు కృష్ణునందు కార్య నిశ్చయము తీరు నిల్చి యుండుటను గమనించి "అనారంభ పరుడగు రాజు" అని పలికి భీముడు కార్యమునకూతను గల్గించుచున్నాడు. ఇందలి "పరో రాజా" అనునది ధర్మజుని కార్యరంగమునకుఁ గొనివచ్చు పెద్ద మాటగా నున్నది. భీముఁ డర్థ యుక్తమైన మాట గంభీరముగాఁ బలికినాడు జరానంధుడు బలవత్తరుఁడు కాఁడు, పాండవులు దుర్బలులు కారు. బలవద్రిపుడుగా నుండిన జరాసంధుని సమ్యక్ప్రయోగమున సులువుగా నిరుపద్రవముగా సాధింపవచ్చునని పర్యవసానము తేల్చి తానే జరాసంధుని వధించెదనని భీముడు మాట కల్గించుచున్నాడు జరాసంధుడప్పటికే బలవత్తరుడుగా లోకమందు గానవచ్చుచుండుటను కృష్ణుడు, ధర్మజుడు పలికి యున్నారు గాన భీముడును దుర్బలః ...బలినం, దుర్బలో బలినంరిపుం" అని చిత్రము పలికి తుది మాట యిట్లనెను.

కృష్ణే నయోమయి బలంజయః పార్థే ధనంజయే
మాగధం సాధయిష్యామ ఇష్టింత్రయ ఇవాగ్నయః

కృష్ణ సకాశమున బలరాము భీమార్జునులం దొక్కరి వలన జరాసంధుఁడీల్గవలసి యున్నదని ధర్మరాజుఁడు సూచించినాఁడు. బలరాముఁ డుంఁడలేదు. "అర్జునాత్వా" అని ధర్మరాజుఁడనియున్నాఁడు. ముఖ్యవృత్తిచేత భీమునందే కార్యభార మేర్పడినది. కృష్ణ భీము లొక పాదమందు, అర్జునుడింకొక పాదమందును నిర్దేశింపబడి యున్నారు. కాఁగా కృష్ణ భీమార్జునులు మువ్వురుఁ బోయి యికార్యమందు ప్రవర్తింపవలసి యున్నదని భీముఁడు నిర్ధారించినాఁడు. కృష్ణునందు నీతి, నాయందు బలము, పార్థునందు—ధనంజయునందు—జయము—భీముఁడిట్లుగా నిర్ధారించినాఁడు. * ఇచ్చట క్రియాపదము లేకుండుట బహు గంభీరమైనది, క్రియా పదము లేనిచో విషయము మువ్వురియందు సమర్థముగా వర్తించును ఆ మువ్వురు జగదేక వీరులు. నయబల విజయ సంశోభితులు. కృష్ణుఁడు నయము గావింప జయశీలుండగు నర్జునుని సమక్షమందు భీముని బలము జరాసంధుని తుద ముట్టింప గలదను సమరస భావ మిందునలన నేర్పడుచున్నది. క్రేతాగ్నుల దృష్టాంతమును భీముఁడు పలుకుట యాతని హృదయ సారమును వ్యక్తీకరించుచున్నది. కృష్ణార్జునుల మధ్యగా భీముఁడు తన్ను గూర్చి పలికి బలప్రకటనము గావించుట నమ్రతము, వీరత్వము నింపుచున్నది. నయము కృష్ణునందు, బల జయములు భీమార్జునుల యందు బలుకుట మఱియు సందర్భపోషణమైయున్నది. కార్యారంభము ఉపాయము సమర్థింపఁబడినది. నిదానము, సమ్యక్ప్రయోగము

---

* క్రియాపదము చేర్చిన కృష్ణునందు నయమున్నదని, భీమునందు బలమున్నదని, యర్జునునియందు జయమున్నదని మాత్రమే—ప్రత్యేక లక్షణములు మువ్వురందున్నటుల యర్థమగును. నయబల జయములు మువ్వురందు గలవను సొగసు క్రియాపదము లేకుండిననే ధ్వనింపఁ గలదు.

సూచింపఁబడినవి. జగజెట్టులు ముప్వురి పరమసాహస కృత్యము వెల్లడింపఁబడినది. భీముఁడిట్లు కార్య నిశ్చయము పలుకఁగా కృష్ణుడు జరాసంధుని బాలమతిని, ధర్మజుని గుణసంపదను దడవుచు ప్రోత్సాహ వచనములు పలికెన్.

బాలుఁడర్థముల నాచరించునే కాని యనుబంధ మరయలేఁడు. కావున నట్టి యర్థపరాయణుండగు బాలుని (బాల బుద్ధి గలవానిని) సహింపరుఁ, అట్టి శత్రువు నుపేక్షింపరు. అని కృష్ణుఁడనినాఁడు. (తస్మాదరిం నమృష్యంతి బాలమర్థ పరాయణం) ఈ శ్లోకమందు కర్త్రుపదము లేదు. ఇందువలన జరాసంధుడు చెడువాఁడు — అని కాక 'వధార్హుఁడు', అని యర్థమిచ్చుచున్నది. పై శ్లోకములు దీనినే పుష్టీకరించుచున్నది.

మాంధాత, భగీరథుఁడు, కార్తవీర్యుఁడు, భరతుఁడు, మరుత్తు-సామ్రాజ్య మొందిన తీరును కృష్ణుఁడు సాభిప్రాయుఁడై పలికినాఁడు. అయిదుగురను కృష్ణుఁడు నిర్దేశించి పలికినాఁడు. ఇది పంచ పాండవుల బాధ్యతను తెల్పుచున్నది. సంపూర్ణతను వ్యక్తీకరించు చున్నది. అందు మొదట యౌవనాశ్వి, అని మాంధాతనుగూర్చి పేరొకొనుట మఱియు సమంజసముగా నున్నది. పాండుని సందేశ మందు వర్తించు ధర్మజుని బాధ్యతనిది వివరించుచున్నది. మాంధాత సామ్రాజ్య మొందుటకు 'జిత్వాఽజయ్యాన్' అను గుణము-సమర్థతను వచించుట మఱియు నమోఘముగా నున్నది. సామ్రాజ్య మొందిన పూర్వులయిదుగురందు నైదువిశేషములను కృష్ణుడు వచించి యుధిష్ఠిరుఁడు—పాండవులు సర్వాకారులు, సర్వ పూర్ణులని ధ్వనింపజేసినాఁడు. ధర్మార్థనయ లక్షణమైనదా ప్రయత్నమగును. స్వకులములవారి నణగ ద్రొక్కుట, రాజులను

పీడించుట, అనుసరించి వర్తించువారికిది నిరకటము గల్గించుట నిట్లుగా జరాసంధుఁడు లోకకంటకుఁడుగా—కొఱ్ఱుగా ప్రవర్తించుచున్నాఁడు, బలాత్కారముగా సామ్రాజ్యమొనరించుచున్నాడు. వానిని రాజు లెదరింపలేకున్నారు. ఎల్లఱకు రోషము, విముఖత్వ మేర్పడి యున్నది. మఱియు నసహ్యాముగా జరాసంధుడు రాజులను పశువుల మందగావించినాడు. జీవితాశ లేకున్న యారాజులను మఱియు ఘోరము, రుద్రునకు బలినీయ దలంచియున్నాఁడు. పశుపతి నిట్లుగా నారాధించు పరమతామసికుఁడా జరాసంధుఁడు. కావున శస్త్రస్ఫురణ సత్కృతులు రాజు లిందు ప్రవర్తింపదగినదే. ఆ జరాసంధుని బాధింపఁగల్గిననే శాంతి, రాచపాటి కాగలదు. జరాసంధుఁ డిపుడెనుబది యాఱుగురు రాజులను బంధించియున్నాఁడు. ఇంక పదునాల్గుర కొఱకై వాఁడు ప్రయత్నించుచున్నాఁడు. అది వాఁడు సాధించిన పక్షమందు క్రూరత్వ మేర్పడఁగలదు—అని కృష్ణుఁడని నాఁడు "జరాసంధుడు క్రూరమాచరించును అని కాక" క్రూరత్వ మేర్పడును" అని పలుకుట గమనింపదగినది. ఆ క్రూరత్వము జరుగకుండ లోకరక్షకులు గావింపవలసియున్నదని కృష్ణుడిందు ధ్వనింప జేసినాడు. జరాసంధుని యీ ప్రయత్నమునకు విఘ్న మాచరించుట దీప్తమగుయశమగును. ఆ యశోదీప్తికి లోక వశ్యము, లోకానుకూలత యేర్పడగలదు. జరాసంధుని జయించిన వాడు నియతముగా సామ్రాట్టగును. ఈ రెండును పాండవులందవసరము, విహితమునై యున్నవి—అని కృష్ణుడు పర్యవసానము గావించినాడు. భీముని కార్యవచనము, కృష్ణుని ప్రోత్సాహము విని ధర్మరాజిట్లు పలికెను.

సత్రమాద్గుణ మభీప్సన్ వై యుష్మాన్ స్వార్థ పరాయణః
కథం ప్రహిణుయాం కృష్ణ సోఽహం కేవలసాహసాత్ ౧౬-౧

భీమార్జునావుభౌ నేత్రే మనో మన్యే జనార్దనమ్
మన శ్చక్షుర్విహీనస్య కీదృశం జీవితం భవేత్ ౨

జరాసంధబలం ప్రాప్య దుష్పారం భీమ విక్రమమ్
యమోఽపి నవిజేతా జౌ తత్రవః కిం విచేష్టితమ్ 3

అస్మిం స్త్వర్థాంతరే యుక్త మనర్థః ప్రతిపద్యతే
తస్మాన్న ప్రతిపత్తిస్తు కార్యా యుక్తా మతా మమ ౪

యథాహం విమృశా మ్యేక స్తత్తావత్ శూ్రయతాం మమ
సన్న్యాసం రోచయే సాధు కార్యస్యాస్య జనార్దన ! ౫

ప్రతిహంతి మనో మేఽద్య రాజసూయో దురాహరః ౬

పార్థః ప్రాప్య ధనుః శ్రేష్ఠ మక్షయ్యౌచ మహేషుధీ
రథం ధ్వజం సభాంచైవ యుధిష్ఠిరమ భాషత ౭

అర్జునః:-ధనుః శస్త్రం శరా వీర్యం పక్షో భూమి ర్యశో బలమ్
ప్రాప్త మేత న్మయా రాజన్ దుష్ప్రాపం యదభీప్సితమ్ ౮

కులే జన్మ ప్రశంసంతి వైద్యా స్సాధు సునిశ్చితాః
బలేన సదృశం నాస్తి వీర్యంతు మమరోచతే ౯

కృతివీర్య కులే జాతో నిర్వీర్యః కిం కరిష్యతి?
నిర్వీర్యేతు కులే జాతో వీర్యవాంస్తు విశిష్యతే ౧౦

క్షత్రియ స్సర్వశో రాజ న్యస్య వృద్ధి ర్ద్విష జ్జయే
స్సర్వై గ్గుణై ర్విహీనోపి వీర్యవాన్ హి తరే ద్రిపూన్          ౧౧

సర్వైరిపుగణై ర్యుక్తో నిర్వీర్యః కిం కరిష్యతి?
గుణీభూతా గుణాతిస్సు ర్వేష్ఠంతిహి పరాక్రమే          ౧౨

జయస్య హేతు స్సిద్ధిర్హి కర్మదైవంచ సంశ్రితమ్
సంయుక్తోహి బలైః కశ్చి త్ప్రమాదా న్నోపయుజ్యతే          ౧౩

తేన ద్వారేణ శత్రుభ్యః క్షీయతే సబలో రిపుః
దైన్యం యథా బలవతి తథా మోహో బలాన్వితే          ౧౪

తావుభౌ నాశకౌ హేతూ రాజ్ఞాత్యాజ్యౌ జయార్థినా
జరాసంధ వినాశంచ రాజ్ఞాంచ పరిరక్షణమ్          ౧౫

యది కుర్యామ యజ్ఞార్థం కిం తతఃపరమం భవేత్
అనారంభేహి నియతో భవే దగుణ నిశ్చయః          ౧౬

గుణా న్ని సంశయా ద్రాజ న్నైర్గుణ్యం మన్యసే కథమ్ ౧౭

కాషాయం సులభం పశ్చాన్మునీనాం శమ మిచ్ఛతామ్
సామ్రాజ్యంతు భవేచ్ఛక్యం వయం యోత్స్యా మహేపరాన్  ౧౮

(సద్గుణ మపేక్షించి స్వార్థ పరాయణుడనై కేవల సాహసమున మిమ్ముల నిందెట్లు ప్రవర్తింపఁజేయగలను. భీమార్జును లిద్దఱు నేత్రములు, జనార్దనుఁడు మానసమని భావించుచున్నవాఁడను. మనము, కండ్లు లేనివానికి జీవిత మెట్టిదిగా నగును. దుష్పారము, భీమ విక్రమమునగు జరాసంధుని బలమును జేరి యముండును

యుద్ధమున జయముఁగొనఁజాలఁడు. అట్టియెడ మీరు గావించు చికీర్షిత మేమిగలదు. ఈ యర్థాంతరమంద నర్థ మేర్పడఁగల దందువలన నప్రతిపత్తియే కార్యమది యుక్తమని నాయభిప్రాయము. నేనుగా విమర్శ గావించుకొనిన దిది వినవలసినది. జనార్దన. సన్యాసమునే బాగని యికార్యముపట్ల నా కభిమతమగుచున్నది (సన్యాసం రోచయేసాధు) ఇందు నామనంబు ప్రతిహత మగు చున్నది. రాజసూయము దురాహరము—అని ధర్మజుఁడు పలికెను. ధనుః శ్రేష్ఠమును, అక్షయ తూణీరములను, రథమును, ధ్వజమును, సభను పొందియున్నయర్జునుఁ డపుడు ధర్మజునితో నిట్లు వచించెను—ధనస్సు, శస్త్రము, శరము, వీర్యము, పక్షము, భూమి, యశము, బలము—ఇవన్నియు నాచే ప్రాప్తమైనవి. అభీప్సితము దుష్ప్రాప మెట్లగును? § (దుష్ప్రాపంయద భీప్సితమ్) విద్వాంసులు కుల జన్మ మును కొనియాడె దరది సాధువనియు నిశ్చయించియున్నారు. బలముతో సదృశమైనది లేదు వీరత్వమే (పరాక్రమమే) నాకు రుచించుచున్నది. కృత వీర్యకులమందుఁ బుట్టిన నిర్వీర్యుఁడేమి గావింపఁగలఁడు. నిర్వీర్యముగుఁగులమందుఁబుట్టిననునా వీర్యవంతుఁడే విశేషించు వాఁడగును. క్షత్రియుండు సర్వశః రాజా! ఎవ్వాని యభివృద్ధి శత్రుజయమం మున్నదో యావీర్యవంతుఁడు సర్వ గుణ విహీనుండయ్యు రిపుల నతిక్రమించి చరింపగలఁడు. సమస్త గుణ యుక్తుండయ్యు నిర్వీర్యుఁడేమి చేయంగలఁడు. గుణము లన్నియు గుణీభూతమై పరాక్రమమందు నిలిచియున్నవి. జయమునకు హేతువు

---

§ దుష్ప్రాపం యదభీప్సితం—అసాధ్య పరికరములు, సాధన సంపత్తి నొందుట యమనదేయ భీష్టసిద్ధి హేతువని భావము.

సిద్ధియే. అది కర్మదైవ సంశ్రితమైనది. బలసంయుక్తుఁడగు ప్రమాదమున (కర్మదైవ సంశ్రితమైన జయహేతువగు సిద్ధిని పొందువాఁడు కానిచో-ప్రమాదా న్నోపయుజ్యతే) తద్వారా సబల రిపుండు శత్రువులచే క్షీణతనొందు వాఁడగును. బలవంతునందు దైవ్యమెట్లో యట్లే బలాన్వితునందు మోహామునునగును. ఆ రెండును నాశ హేతువులు. జయార్థులగు రాజులచేనవి త్యాజ్యమైనవి. జరాసంధ వినాశనము, రాజ్ఞ పరిరక్షణము యజ్ఞార్థమొనర్చితిమేని యంతకు మించినదేమిగలదు, కార్య సన్యాసములంబూఁనియనారంభ మదియ గుచో నందువలన సగుణ నిశ్చయమగును. (కార్యమునుండి బుద్దిని మరలించి యారంభమే కావింపనపుడది గుణము కాదని నిశ్చయము) గుణము నిస్సంశయముకాగా రాజా! నైర్గుణ్యమునెట్లు తలంతువు? శమ మిచ్ఛయించిన మునులకు నిశ్చయాంతర కాలమున కాషాయము సులభమేయగును. సామ్రాజ్యము శక్యమే. మనము పరులతోఁడ పోరాడుదము-అని యర్జునుఁడు పలికెను)

జరాసంధుని యపారబలమునకు లోకమెల్ల కలగుండు నొం దుచున్నది. యాదవులును దానిని సాధించువారుగా నుండలేరు. ధర్మజుడీవిషయమెల్ల స్మరింపజేయువాఁడై యట్టి జరాసంధుని నెదిరించు టయనునది కేవల సాహసమనియు, స్వార్థపరాయణత్వమున మనో నేత్రములవంటి కృష్ణ భీమార్జునులనిందుఁ బ్రవర్తింపజేయుట యుచిత ము కాదనియు ధర్మజుఁడు మాట పలికినాఁడు. మఱియు నియ్యర్థాంత ర మందనర్థము గానవచ్చుచున్నది గాన మనస్సు తనకు వెనుకాడు నది యగుచున్నదని ధర్మజుఁడనినాఁడు.

'సమ్రాడ్గుణ మభీప్సన్' అని ధర్మజుఁడు మాట ప్రారంభించి నాఁడు. తస్యసమ్రాడ్గుణార్హస్య' అని ధర్మజుని మంత్రులు మున్నగు

వారు మంత్రాంగమందు తలంచి యున్నారు. 'సర్వైర్గుణైర్మహారాజ' అని కృష్ణుడు మాట ప్రారంభించినాడు. ధర్మజుని సామ్రాజ్య ప్రయత్నము గుణయుక్తమగు ధర్మోచితమని యీ మాటలు వివరించు చున్నవి. జరాసంధుడు కేవల బలముననే సామ్రాట్టుగా దలంచి యున్నాడు. ఆ జరాసంధుని జయించువాడవశ్యము సామ్రాట్టు కాఁగలఁడు' అని కృష్ణుడు వెల్లడించినాడు. జరాసంధవధానంత రము పరిస్థితి విషమింపవచ్చునందువలన రాజసూయము దురాహర మను శంకను ధర్మజుఁడాసమయమున వ్యక్తీకరించినాడు. 'ప్రతిహంతి మనోమేద్య రాజసూయో దురాహరః' అనినాడు. దివ్యపరికరములు గల్గిన వాఁడర్జునుఁడు, దివ్యమైన శుభపాండువులకు లభించినది. జరాసంధ వధానంతర మొకవేళ వాని బలమెదిరించినను నది నిరుప యోగము కాఁగలదని యర్జునుఁడనుచున్నాఁడు. జరాసంధుఁడనేక పర్యాయము లెత్తినెల్ల యాధవులను సాధించియుండలేదు. మఱియు హీనుఁడగుచు వచ్చినాఁడు. అర్జునుఁడజయ్యుఁడు, అజయ్యులగు కృష్ణార్జునులను జరాసంధుని బలమెదిరించుయు నిరుప యోగమే కాఁగలదని యర్జునుఁడీ మాటవలన ధ్వనింపజేసినాఁడు. జరాసంధుని బలము నిరుపయోగమైనది. పాండవ బలసంపద యోగ్యమైనది. కావున జయము తథ్యమని యర్జునుఁడు వ్యక్తీకరించినాఁడు.

కృష్ణుఁడు నయమార్గ మెఱిగించినాఁడు, భీముఁడు బలప్రకట నము గావించినాఁడు, అర్జునుఁడు జయహేతువును పలికినాఁడు. 'గుణీ భూతా గుణాన్సర్వేతిష్ఠంతిహి పరాక్రమే' అని యర్జునుఁడు పరాక్రమ విశేషమును సువ్యక్తము గావించినాఁడు మఱియు జయశీలుఁడగు నర్జునుండు శత్రువులచే సబలరిపుంశు క్షీణత నొందువాఁడు కాఁగలఁ డని వచించినాఁడు. బలవంతులందు దైన్యము, బలాన్వితునందు మోహము— ఈ రెండును నాశహేతువులని పలుకుచు నర్జునుఁడు

పాండవులు బలవంతులనియు, జరాసంధుడు బలాన్వితుండనియు, మోహగ్రస్తుండై యున్న యా జరాసంధు నవలీల దుదముట్టించి, రాజులను రక్షించుట యుచితమనియు, యజ్ఞ ప్రవర్తకులగుట మేల్మికార్యమనియు, వ్యక్తీకరించినాడు. "అనారంభేహి నియతో భవేదగుణనిశ్చయః" అనినాడు. సమ్రాట్ శబ్దము కష్టసాధ్యము, కార్యసన్యాసమే సాధువు. శమమే మేలు ఇట్లని ధర్మజుని ప్రసంగము గానవచ్చుటచే నద్దానింబురస్కరించుకొని యర్జునుడు "శమ మిచ్ఛయించుమునులకు కాషాయము సులభమైనది,' పాండవులకు సామ్రాజ్యము శక్యమైనది" అని చిత్రము పలికినాడు. "వయంతో త్స్యామహే పరాః" అనినాడు. "యజ్ఞప్రాప్తికి రాజులను విడిపించుట, జరాసంధ వధ గావింపవలసినది" (యతస్వతేషాం మోక్షాయ జరాసంధ వధాయచ) అని కృష్ణుడు పలికినాడు. యజ్ఞమునకుంగాను జరాసంధ వినాశనము, రాజ్ఞ పరిరక్షణము గావించుటకన్న పరమ మేది గలదు? (జరాసంధ వినాశం చ రాజ్ఞాంచ పరిరక్షణం। యదికుర్యాయ యజ్ఞార్థం) అని యర్జునుడు పలికినాడు. జరాసంధ వధ యని కృష్ణుడు, జరాసంధ వినాశమని యర్జునుడు పలికిరి. యుధిష్ఠిరార్జునుల మాటలు విని వాసుదేవుండిట్లు పలికెను.

వాసుదేవః

జాతస్య భారతే వంశే తథా కుంత్యాఃసుతస్యచ
యావై యుక్తామతిస్సేయ మర్జునేన ప్రదర్శితా ౧౭-౧

నస్మ మృత్యుం వయం విద్మరాత్రౌ వాయదివా దివా
నచాపి కంచి దమరమయుద్ధే నామ శుశ్రుమ ౨

ఏతావదేవ పురుషైః కార్యం హృదయతోషణం
నయేవ విధిదృష్టేన యమువక్రమ తే పరాః 3

సునయస్యానపాయస్య సంయోగే పరమక్రియః
సంగత్యా జాయతేఽసామ్యంచనభవేద్ద్వయోః
అనయస్యానుపాయస్య సంయుగే పరమః క్షయః ౪

సంశయోజాయతే సామ్యాజ్జయశ్చ నభవేద్ద్వయో ౫

తేవయం నయమాస్థాయ శత్రుదేహ సమీపగాః
కథమంతంనగచ్ఛేమ వృక్షస్యేవనదీరయాః ౬

పరరంధ్రే సమాక్రాంతాః స్వరంధ్రా వరణేస్థితాః
వ్యూఢానీకై రతిబలై ర్నయుధ్యే దరిభి స్సహ ౭

ఇతి బుద్ధిమతాంనీతి స్తన్మమాపీహరోచతే
అనవద్యాహ్యాసం బుద్ధాః ప్రవిష్టాశ్శత్రుసద్మతత్ ౮

శత్రుదేశముపాక్రమ్యతం కామంప్రాప్నుయామహే
ఏకోహ్యేవశ్రియంనిత్యం బిభర్తి పురుషర్షభః ౯

అంతరాత్మేవభూతానాంతత్ క్షయం చైవలక్షయే ౧౦

అథవైనం నిహత్యాజౌ శేషేణాపి సమాహతాః
ప్రాప్నుయామతతస్స్వర్గంజ్ఞాతిత్రాణ పరాయణాః ౧౧

యుధిష్ఠిరః

కృష్ణకోఽయం జరాసంధఃకింవీర్యఃకిం పరాక్రమః
యస్త్వాంస్పృష్ట్వాగ్ని సదృశం నదగ్ధశ్శలభోయథా। ౧౨

కృష్ణః

శృణు రాజన్ జరాసన్ధో యద్వీర్యో యత్పరాక్రమః ।
యథా దో పేక్షితో౽స్మాభిర్బహుశః కృతవిప్రియః ॥ ౧౩

(వాసుదేవుఁడిట్లు పలికెను. భారతవంశమందు జన్మించియున్న కుంతీసుతునకేది యుక్తమతియో యదియర్జునునిచేనిపుడు ప్రదర్శింపఁబడినది. మృత్యువు రాత్రియో పగటనో యెఱుంగను యుద్ధమున నమరత్వమనియు వినినది లేదు. నయమున విధి దృష్టమున పరుల నెదిరించుటయే యయ్యదియే హృదయతో షణంబగు పురుషుల కార్య(మగును) సునీతిగలవానికి (సునయస్య) అనపాయునకు (భద్రిత గలవానికి) నం యోగమందు పరమక్రిమముకున్నది. అభివృద్ధి హేతువు కాఁగలదు.) సంగతివలన నసామ్యము కలుగును. ఇరువది మధ్య సామ్యమనునదియునుండదు. అవినీతునకు (అనయస్య) అనుపాయునకు (ఉపాయ హీనునకు) సంయుగమందు (చేరికయందు, యుద్ధమందు పరమతుయ మున్నది) సామ్యముచే సంశయము కలుగుచున్నది. జయమనున దిరువురకుఁగా నేరదు. నయమున (నయమాస్థాయ) శత్రుదేహ సమీపస్థులమగునట్టి మేము నదీరయము వృక్షమును పెల్లగించునట్లుగా నెందుకు మేము మదిగాంచకుందుము. జరాసంధునంతము నెట్లు సాధింపకుందుము. (కథ మంతంనగచ్ఛేమ) పరరంధ్రములందు సమాక్రాంతులై, స్వరంధ్రాకరణమందు జాగరూకులైయుండి వ్యూఢానీకము గల్గి యతి బలఁడైయున్నట్టి రిపులతో యుద్ధమాడకుండ కార్యప్రవర్తకులమగుటయే బుద్ధిమంతులనీతి (విధానమగును.) అయ్యదియే నాకిప్పుడు తోఁచుచున్నది. (రోచయే) అవవద్యులమై అసంబుద్ధులమై (మెలఁకువగల్గి ప్రచ్ఛన్న వర్తనులమై) యా శత్రు సద్మమును ప్రవేశించెదము, శత్రుదేశము నావరించి

యాకామమును పొందెదము, భూతములకంత రాత్మయట్లొకట పురుష ర్షభుండే సిరిని నిత్యము వహించియుండును, అక్షయమునుగూడ లక్షించియున్నాఁడు అట్లుగాక వానిని యుద్ధమందు సంహరించి శేషించిన వారిచేఁగొట్టబడు దుమేని యపుడు జ్ఞాతిత్రాణ పరాయణులమగు మేము స్వర్గమును పొందెదము. అని పలికెను, "కృష్ణ! ఎవడా జరాసంధుఁడు. ఏమి వీర్యము, ఏమి పరాక్రమము వానికి. అసదృశుఁడగు నిన్ను ముట్టిమిడతయట్లు నూడిపోని యాతడెవ్వఁడు అని ధర్మజుఁడు పలుకగా కృష్ణుఁడు రాజా! "జరాసంధుఁడేమి వీర్యము గలవాఁడో, పరాక్రమము గలవాడో, బహు విప్రియ కారణుఁడాతఁ డెట్లుగా మాచే నపేక్షితుడైనాఁడో వినుము. అని పలికెను.

భారతమున కృష్ణుని మాటలకు మూఁడు మకుటములుగాన వచ్చుచున్నవి. ఆధ్యాత్మిక విషయ ప్రసంగమున "భగవాన్" అని రాజకీయాదులందు కృష్ణః అని మకుటములుగలవు. యాదవుఁడుగా ప్రతిఫలించునపుడు వాసుదేవః అని యుండును. ఈ రాజసూయ ఘట్టమున కృష్ణ వాసుదేవ మకుటములు రెండునుగలవు. ఆలోచన మందెల్ల గృహుడుగను, బాధ్యతయందు వాసుదేవుఁడుగను నుల్లేఖింపఁ బడి యున్నాఁడు.

భారత యాదవ సంబంధముగా నర్జునుని ప్రశంసించి "యుక్త మది యర్జుననే పరిదర్శితమైనది" అని వాసుదేవుఁడు పలికినాఁడు. చావనునది రాత్రియో, పగటనో కలిగియే తీరును యుద్ధము లేకుండినను నమరత్వముండ నేయుండదు అనుచు జరాసంధవధ రాత్రి కాలమందని వాసుదేవుఁడు సూచించినాఁడు. పాండవ ప్రయత్నము సమీచీనమనియు, జరాసంధ కృత్యమనాలోచితమనియు జరాసంధుడు

పాండవులకు సాటికాఁడని వాసుదేవుఁడు పలికినాఁడు. సునయస్యానపాయస్య సంయోగే పరమక్రమః అనునది పాండవ బలసంపదను 'అనయస్యానుపాయస్య సంయుగే పరమ క్షయః' అనునది జరాసంధ బలసంపదను సూచించుచున్నది. 'సంయోగే' అని పాండవ బల విషయమందు, సంయుగే అని జరాసంధ బల విషయమందునుండుట గమనింపఁదగినది. మఱియు పాండవ విషయముగా 'సంగత్యాజాయతేఽసామ్యం' అని జరాసంధ విషయముగా 'సంశయో జాయతే సామ్యాత్' అని యుండుట గమనింపఁదగినది. జరాసంధుఁడిపుడు యుద్ధగతుఁడగుచో యథార్థము బయలుపడగలదని వాసుదేవుఁడిందువలన సూచించినాఁడు. అపుడు జరాసంధుడసామ్యస్థితినొంది విజితుఁడు కాఁగలడఁని వాసుదేవుఁడు నిర్ధారించినాఁడు. ఎకాయెకిని బోయి జరాసంధుని సమీపించినచో నపుడే కార్యము ముగింపు కాఁగలదని వాసుదేవుఁడనినాఁడు. 'తేవయం నయ మాస్థాయ శత్రుదేహ సమీపగాః' అను వాసుదేవ వచనమిదియే సూచించుచున్నది. యాదవుఁడిచ్చోట "అంతేం" అను పదముచ్చరించుట సందర్భ పోషణముగానున్నది. మెలకువగాబ్రిచ్ఛన్నచారులమైపోయి ఈ కార్యము సాధించెదమని పలుకుచు వాసుదేవుఁడు 'ఏకో హ్యేవశ్రియం నిత్యం బిభర్తి పురుషర్షభః' అనుచు నదృష్ట విశేషము తమయందేయని ధ్వనింపఁజేసినాఁడు. జరాసంధ వధానంతర కాలమున నాపదయను సంశయమపుడుగలదు. దానిని బురస్కరించుకొని వాసుదేవుఁడు 'ప్రాప్నుయామ తతస్స్వర్గం జ్ఞాతిత్రాణ పరాయణాః' అనినాఁడు. జ్ఞాతులను కాపాడెదము అని కాక జ్ఞాతిత్రాణ పరాయణత్వమున (ఆ ధర్మమున) వర్తించు తమకుత్తమగతి కాఁగలదని వాసుదేవుఁడు పలికినాఁడు. ఈ మాట పరమ యోగ్యముగానున్నది. ఈ మాట విని ధర్మరాజు 'ఎవఁడా జరాసంధుఁడు' అని ప్రశ్నించినాఁడు. కృష్ణాగ్నియందు జరా

సంధ శలభమేల మాడిపోలేదని ధర్మజుఁడనుట కార్య స్వభావమందే వర్తించుచున్నది.

కృష్ణుఁడు జరాసంధ వీర్య పరాక్రమములను, తమకు విప్రియ మాచరించిన యా జరాసంధును పేక్షించి తాముండిన విషయమును నిట్లు తెల్పెను.

మగధ దేశమును బృహద్రథుఁడను రాజు పరిపాలించుచుండెను. మూడక్షౌహిణులు బలముగల్గి సమరదర్పితుఁడై యా బృహద్రథుఁ డుండెను. అతఁడు కాశీరాజు కుమార్తెలను కవలలను పెండ్లాడెను. 'మీయందు నేనతిగా వర్తింపను. (సమవర్తినై యుందును — నాతి వర్తిష్యే)' అని సమయము గావించి యా బృహద్రథుఁడు గంగా యమునా మధ్యగతుఁడగు సాగరునట్లు భార్యలతోడ విహరించెను.

విషయేషు నిమగ్నస్య తస్యయౌవన మభ్యగాత్
నచ వంశకరః పుత్రి స్తస్యా జాయత కశ్చన ౨౨

(విషయనిమగ్నుఁడైనయా బృహద్రథునకు యౌవనమతిక్రమించెను. వంశకరుఁడైన పుత్రుఁడాయిరువురిలో నొకర్తెకును కలుగలేదు. అనేక హోమములు, పుత్రకామేష్టి మొదలగు నవి గావించియుఁ గులవర్ధనుఁడగు పుత్రుని నాబృహద్రథుఁడు పొందలేదు. గౌతమవంశజుఁడగు చండకౌశికుఁడను ఋషిసత్తముని వృక్షమూలమున దర్శించి బృహద్రథుఁడు భార్యాసహితుఁడై రత్నములచేనా ఋషి వర్యునర్చించెను. ఆ ఋషిసత్తముఁడు 'పరితుష్టుఁడ నైతిని, వరము కోరుము' అనెను.

తతస్సభార్యః ప్రణత స్తమువాచ బృహద్రథః
పుత్రదర్శననైరా శ్యాత్యద్బాష్ప సందిగ్ధయాగిరా ౨౬

రాజా:- భగవన్ రాజ్యముత్సృజ్య ప్రస్థితోఽహం తపోవనమ్
కింవరేణాల్ప భాగ్యస్యకిం రాజ్యే నాప్రజస్యమె ౨౭

కృష్ణః:- ఏతచ్ఛ్రుత్వామునిర్ధ్యాన మగమత్ క్షుభితేంద్రియః
తస్యైవచామ్ర వృక్షస్యచ్ఛాయాయాం సముపావిశత్ ౨౮

బృహద్రథుడు సభార్యుండైయిట్లు పలికెను. పుత్రదర్శననైరాశ్యమున బాష్పగద్గద స్వరముననిట్లు పలికెను. 'భగవాన్! రాజ్యము విడిచి తపోవనమునకే తెంచితి నింకనల్ప భాగ్యుండగు వరమునఁ బ్రయోజనమేమిగలదు? సంతతి లేని నాకు రాజ్యమున నేమి గలదు?' అనెను. అదివిని యామౌనిక్షుభితేంద్రియుఁడై యదేయామ్ర వృక్షచ్ఛాయయందు నిలిచెను.) చండకౌశికుఁడు 'పరితుష్టినొందితిని, వరము కోరుము' అని పలికెను. యౌవనమతిక్రమించి పుత్రదర్శననైరాశ్యుఁడైయున్న బృహద్రథుఁడపుడు మంచిమాట పలుకలేదు. "అల్ప భాగ్యుడను, సంతతి లేని నాకు రాజ్యమేల?" అని నిరాశగా మాటాడినాఁడు సంతతికొఱకు మని మాట పలుకవచ్చునట్లు పలుకకుండుట యాబృహద్రథుని కర్మగానున్నది. రాజట్లు మాటాడుటను వినిన చండకౌశికుఁడు ప్రసన్నుఁడు కాలేక పోయెను. క్షుభితేంద్రియుఁడై యున్న యామౌనియపుడే యొకరమగు నామ్రఫలమొకటి వృక్షమునుండి తనయుత్సంగమునఁ బడుటఁగాంచి యద్దానినభిమంత్రించి రాజునకిచ్చి 'గచ్ఛరాజన్ కృతార్థోఽసి నివర్తస్వనరాధిప' (పొమ్మురాజా! కృతార్థుఁడవైతివి. మరలిపొమ్ము) అనిపలికెను. 'గచ్ఛ, నివర్తస్వ' అనుమాటలాఋషియొక్క అప్రసన్న

మగు హృదయమును నిరూపించుచున్నవి బృహద్రథుఁడు స్వగృహా
మున కేతెంచి తనసమయము ప్రకారమాపండునిరువురు భార్యల
కొసంగెను. వారాపండును చెరియొక చెంపభుజించి గర్భములు
ధరించిరి. ఒకశిశువునిమిత్తముగా నీయఁబడిన యాపండును వారిరు
వురు భుజించుట ధర్మమార్గము కానేరదు. కామపురుషార్థమే కాని
ధర్మ పురుషార్థమిచ్చోట వర్తింపనందున నాఫలమిట్లు విపరీత
మాయెను. ఒకఁడే శిశువుయిరువురియందు సగముసగముగానుద్భ
వించెను (ఏకాక్షిబాహుచరణే హ్యర్ధోదరముఖస్ఫిచీ) అక్కఁ
చెల్లెండ్రదిగాంచి గడగడలాడియుద్విగ్న మనస్కలయిరి. ఉసురుతో
నున్న యాశరీరశకలముల నర్ధరాత్రియందు చతుష్పథమందు పారవే
యించిరి. మాంసశోణిత భోజనయగు జరయను రాక్షసికియామాంస
శకలమును గాంచుట తటస్థించెను. ఆశరీర శకలమునుగొనిపోఁ
దలంచిన యారాక్షసి సులువుగాఁగొనిపోవుటకు విధానబలచోదితయై
యొకటిగాఁ జేర్చెను. అదియెట్లొనర్పగాతత్ క్షణము ఏకమూర్తిధరుఁ
డగుఁ వీరుఁడగు కుమారుఁడుగా నాశరీరశకలము లేర్పడెను ఆరాక్షసి
విస్మయోత్ఫుల్లలోచనయై వజ్రసారమయమగు నాశిశువును మోయఁ
జాలక పోయెను ఏకమూర్తి ధరుఁడైనయాశిశువు మేఘములురిమి
నట్లేడ్చె నందుకంతఃపురము సంభ్రాతమాయెను. రాజుదేశమందున్న
నాకీబాలుని చంపుటతగదని చింతించునా జరయొద్దకపుడు రాజు,
రాణులు, అందఱువచ్చిరి. మనుజరూపమును ధరించి యారాక్షసి
బృహద్రథునితోనిట్లు పలికెను. "నేను జరయను పేరుగలదానను.
నీ గృహమందు పూజింపఁబడి సుఖమున్నదానను. మనుష్యుల ప్రతి
గృహమందును నేను నిత్యముందును. దానవవినాశనమునకై
బ్రహ్మచే సృజింపఁబడితిని దైవవశమున నీ బాలకుని శరీరశకల
మును చేర్చితిని మేరువునైన మ్రింగగలదాననింక నీబాలకుఁడెంత నీచే

సత్కృతనగు నేనీబాలకుని నీకర్పించుచున్నాను" అని పలికి మాయ మాయెను (అంతరదీయత). జరచే సంధింపఁ బడినందున నాశిశువు జరాసంధుఁడను నామమొందెను. కొంతకాలమునకు చండ కౌశికుఁడు మరల బృహద్రథునిదరికివచ్చి జరాసంధునిగూర్చి యిట్లు పలికెను.

§ సర్వ మేతన్మయా జ్ఞాతం రాజన్ దివ్యేనచక్షుషా
పుత్రస్తుశృణు రాజేంద్ర!యాదృశోఽయం భవిష్యతి ౧౮-౫

అస్యరూపంచ సత్వంచ బలమూర్జిత మేవచ
ఏమశ్రియా సముదితః పుత్రోస్తు న నసంశయః ౬

ప్రాపయిష్యతి తత్సర్వం విక్రమేణ సమన్వితః
అస్యవీర్యవతో వీర్యంనానుయాస్యంతి పార్థివాః ౭

పతతో వైనతేయస్యగతి మన్యే యథాఖగాః
వినాశముపయాస్యంతియే చాస్య పరిపంథినః ౮

దేవైరపి విసృష్టాని శస్త్రాణ్యస్య మహీపతే
నరుజం జనయిష్యంతిగిరేరివ నదీరయాః ౯

సర్వ మూర్ధాభిషిక్తానామేష మూర్ధ్నిజ్వలిష్యతి
ప్రభాహరోఽయం సర్వేషాం జ్యోతిషా మివభాస్కరః ౧౦

ఏవ మాసాద్య రాజాన స్సమృద్ధబల వాహనాః
వినాశముపయాస్యంతి శలభా ఇవ పావకమ్ ౧౧

---

§ బలాత్కారముగసామ్రాజ్యమొనరించు జరాసంధుని దౌష్ట్యమిందు వెల్లడింపఁబడినది. హరిశ్చంద్రుని సామ్రాజ్యము, ధర్మజుని సామ్రాజ్య మెట్లున్నదియునిచ్చోట పరికింపఁదగియున్నవి.

ఏవఞ్శ్రియస్సముదితా స్సర్వ రాజ్ఞాం గ్రహీష్యతి
వర్షావస్యో దీర్ణజలా నదీర్నద నదీపతిః|| ౧౨

ఏషధారయితా సమ్యక్ చాతుర్వర్ణ్యం మహాబలః
శుభాశుభ మివస్థితా సర్వ సస్యధరా ధరా ౧౩

అస్యాజ్ఞావశగా స్సర్వే భవిష్యంతి నరాధిపాః
సర్వభూతాత్మభూతస్య వాయోరివ శరీరిణః ౧౪

యన్మాం పృచ్ఛసి రాజేంద్ర హరిశ్చంద్రం ప్రతిప్రభో
తత్తేఽహం సంప్రవక్ష్యామి మాహాత్మ్యం తస్యధీమతః. ౧౨-౧౦

స రాజా బలవానాసీ త్సమ్రాట్సర్వమహీక్షితాం
తస్యసర్వే మహీపాలా శ్శాసనావనతాః స్థితాః ౧౧

తేనైకం రథమాస్థాయ జైత్రం హేమ విభూషితం
శస్త్ర ప్రతాపేన జితాఃద్వీపా స్సప్త జనేశ్వర ! ౧౨

స నిర్జిత్యమహీం కృత్స్నాం సశైలవన కాననాం
ఆజహార మహారాజ రాజ సూయం మహాక్రతుమ్ ౧౩

తస్య సర్వే మహీపాలా ధనా న్యాజహ్రు రాజ్ఞయా
ద్విజానాం పరివేష్టార స్తస్మిన్ యజ్ఞేచ తేభవన్ ౧౪

ప్రాదాచ్చ ద్రవిణం ప్రీత్యా యాచకానాం నరేశ్వరః
యథోక్తవంత స్తే తస్మింస్తతః పంచగుణాధికం ౧౫

ఏష రుద్రం మహాదేవం త్రిపురాంతకరం హరం
సర్వలోకే ష్వతిబలస్సాక్షాత్ ద్రక్ష్యతి మాగధః ౧౪

ఏవం బ్రువన్నేవ మునిస్స్వకార్య మివ చింతయన్
విసర్జయామాస నృపం బృహద్రథ మథారిహన్ ౧౫

(దివ్య చక్షుస్సుచేనంతయు దెలియుటమైనది. రాజేంద్ర!
నీ పుత్రుఁడెటువంటివాఁడగునో వినుము. వాని రూపము, సత్వముఁ,
బలముఁ, ఊర్జితమంతయుఁ దెల్పెదను. నీపుత్రుఁడు సంపదోద్భవుఁడగును
నిస్సంశయము. విక్రమ సమన్వితుఁడై సర్వము సంప్రాప్తింపఁ జేయ
గలఁడు. పక్షులు గరుత్మంతుని నతిక్రమింపజాలనట్లు వీర్యవంతుఁడగు
నీపుత్రునకు పార్థివులు వీర్యమున సరివచ్చువారు కారు. ఆతని
శత్రువులు వినాశమొందెదరు. నదరయము పర్వతము నేమియుఁ

అతర్పయచ్చ వివిధైర్వసుభి ర్బ్రాహ్మణాం స్తదా
ప్రసర్పకాలే సంప్రాప్తే నానా దిగ్భ్య స్సమాగతాన్ ౧౬

భక్ష్యభోజ్యైశ్చ వివిధైర్యథా కామపురస్కృతైః ౧౭

రత్నౌఘ తర్పితై స్తుష్టైర్ద్విజైశ్చ సముదాహృతం
తేజస్వీ చ యశస్వీ చ నృపేభ్యోఽప్యధికోఽభవత్ ౧౮

ఏతస్మాత్కారణాద్రాజన్ హరిశ్చంద్రో విరాజతే
తేభ్యో రాజసహస్రేభ్యస్తద్విద్ధి భరతర్షభ ౧౯

సమాప్య చ హరిశ్చంద్రో మహాయజ్ఞం ప్రతాపవాన్
అభిషిక్తశ్చ శుశుభే సామ్రాజ్యేన నరాధిప! ౨౦

గావింపలేనటుల దేవవిసృష్ట శస్త్రంబులును వానికి సుజముఁ గావింపఁ జాలవు జ్యోతిస్సుల ప్రభను హరించు భాస్కరునట్లు సర్వ మూర్ధాభిషిక్తుల మూర్ధమందు వాఁడు జ్వలించువాఁడగును వాని నెదిరించు రాజులు సమృద్ధ బలవాహనులయ్యు అగ్నిని ప్రవేశించు శలభములట్లు వినాశనమొందగలరు. వర్షాకాలమందు నదీనదముల జలములనుబోలె వాఁడు సర్వరాజ సంపదలను గ్రహించువాఁడగును చాతుర్వర్ణ్యము వారిని చక్కఁగా ధరించెను. సర్వసస్యధరయగు

---

(ప్రభో! రాజేంద్ర! హరిశ్చంద్రుని గూర్చి ఏది నీవడిగితివో యామహాత్మ్యమును తెల్పెదను. ఆతఁడు బలవంతుఁడై రాజులకెల్ల సమ్రాట్టుగానుండెను. ఆతనికి మహీపాలురెల్లరు శాసనావనతులై యుండిరి హరిశ్చంద్రుఁ డేకరథుండై శస్త్రప్రతాపమున సప్తద్వీపములను జయించెను. సశైలవనకాననముగ మహినెల్ల నిర్జించి రాజసూయమహాక్రతువు నాచరించెను. హరిశ్చంద్రునాజ్ఞనుగొని మహీపాలురెల్లరు విత్తమును గొనివచ్చి ద్విజపరివేష్టులై యాతని యజ్ఞమునను నిల్చిరి ఆ హరిశ్చంద్రుఁడు యాజకులకు పంచగుణాధికముగ దక్షిణ మొసంగెను. ప్రసర్పకాలమున సకలదిశాగతులగు బ్రాహ్మణులనెల్ల దక్షిణ భోజనములచే సంతృప్తులఁగావించెను. రత్న సంతుష్టులై యాద్విజవరులాశీర్వదించిరి. హరిశ్చంద్రుఁడాశుభాశీస్సులవలన తేజోవంతుఁడాయెను, యశోవంతుఁడాయెను, నృపులందధికుండాయెను ఈ కారణమున హరిశ్చంద్రుఁడా రాజసహస్రముకన్న మిన్నయై విరాజల్లుచున్నాఁడు.)

రాజవెల్లడు హరిశ్చంద్రునకు శాసనావనతులై యుండిరి. సశైలవనకాననముగా మహినెల్ల జయించి హరిశ్చంద్రుడు రాజసూయమహాక్రతువు నొనరించి ధర్మాచరణకల్యుడై విప్రాశీర్వాదములనొందెను. అది కారణముగ నతఁడు తేజోవంతుఁడు, యశోవంతుఁ

వసుంధర శుభాశుభవస్తుస్థితమైయుండును సర్వభూతాత్మభూతుఁడగు వాయువునకు దేహులెల్లు నరాధిపు లెల్లరు వానికి ఆజ్ఞాబద్ధులు కాఁగలరు సర్వలోకమందలి బలవంతుఁడగు నామాగధుఁడు రుద్రుని-మహాదేవుని - త్రిపురాంతకుని — హరుని సాక్షాత్ దర్శింపగలఁడు—ఇట్లు పలుకుచునే స్వకార్యమును చింతించినవాఁడు వలెనే యీ చండకౌశికుఁడు బృహద్రథుని నిసర్జించి వెడలిపోయెను.)

---

డునై రాజులందు మిన్నయై శోభించెను. జరాసంధుఁడు రాజలోకమునకెల్ల కంటకుఁడాయెను. వారి సంపదలనెల్ల దోచికొనియు సంతృప్తుఁడు కాకుండెను రౌద్రజ్ఞమున రాజద్రోహమొనరించువాఁడుగానేర్పడెను. శంకరుని రుద్రమూర్తిగా దర్శించెను.

స రాజసూయం రాజేంద్రకుమారాణామృషభ స్తదా
ఆహర్తుం ప్రవణం చక్రేమనస్సంచిత్య చాసకృత్ ౧౩-౫

భూయశ్చాద్భుతవీర్యౌజా ధర్మమే వానుచింతయన్
కింహితం సర్వలోకానాం భవేదితి మనోదధే ౬

అనుగృహ్ణ ప్రజాస్సర్వాసర్వధర్మభృతాంవరః
అవిశేషణ సర్వేషాం హితం చక్రేయుధిష్ఠిరః ౭

సర్వేషాం దీయతాం దేయం ముష్ణ కోపమదావుభౌ
సాధు ధర్మేతి ధర్మేతి నాన్యత్ శ్రూయేత భాషితమ్ ౯

సర్వ రాజ వినాశనము, సర్వ నరేశ్వరైశ్వర్యహరణము గావించు వాఁడు జరాసంధుఁడు, దేవతలను లక్ష్యమొనరింపఁడు, రాజుల నెత్తిపై కొట్టువాసివలెనుండగలఁడు, రాజులకూపిరి సలప నీయఁడు. శంకరుని రౌద్రమూర్తిగా దర్శించును. ఇట్లని చండకౌశికుని ప్రసంగము నిరూపించుచున్నది. (చాతుర్వర్ణ్యమువారిని చక్కగా

---

ఏవం గతే తత స్తస్మిన్ పితరీవాశ్వసన్ జనాః
నతస్య విద్యతే ద్వేష్టా తతో౽స్యాజాత శత్రుతా ౯

పరిగ్రహాన్నరేంద్రస్య భీమస్య పరిపాలనాత్
శత్రూణాం క్షపణాచ్చైవ బీభత్సో స్సవ్యసాచినః ౧౦

ధీమతస్సహదేవస్య ధర్మాణా మనుశాసనాత్
వైనత్యాత్సర్వత శ్చైవ నకులస్య స్వభావతః ౧౧

అవిగ్రహవీతభయాః స్వకర్మనిరతా స్సదా
నికామవర్షా స్స్ఫీతాశ్చ ఆసన్ జనపదా స్తథా ౧౨

వార్ధుషీయజ్ఞసత్త్వాని గోరక్షం కర్షణం వణిక్
విశేషాత్సర్వ మే వైతత్ సంజజ్ఞే రాజకర్మణా ౧౩

అనుకర్షం చ నిష్కర్షం వ్యాధిపావకమూర్ఛనం
సర్వమేవ న తత్రాసీ ద్ధర్మ నిత్యే యుధిష్ఠిరే ౧౪

దస్యుభ్యో వంచకేభ్యశ్చ రాజ్ఞః ప్రతి పరస్పరం
రాజవల్లభతశ్చైవ నాశ్రూయత మృషా కృతమ్ ౧౫

ప్రియం కర్తుముపస్థాతుం బలికర్మ స్వకర్మజం
అభిహర్తుం నృపాః షట్సు పృథక్ జాత్యైశ్చ నైగమైః ౧౬

ధరించును. సర్వ సస్యధరయగు వసుంధర శుభాశుభమట్ల స్థితమై యుండును." అని చండకౌశికుఁడు వచించినది గమనింపఁదగినది, జరాసంధుఁడు చాతుర్వర్ణ్య సంరక్షకుఁడనియిందు లేదని, సర్వసస్యధరయగు జరాసంధుని వసుంధర శుభముకాదు, అశుభముకాదని పర్యవసాన

---

పవృధే విషయ స్తత్ర ధర్మనిత్యే యుధిష్ఠిరే
కామతోఽప్యుపయుంజానై రాజస్సై ర్లోభజైర్జనైః ౧౭

సర్వవ్యాపీ సర్వగుణీ సర్వసాహస్ర సర్వరాట్
యస్మిన్నధికృతస్సమ్రాట్ భ్రాజమానో మహాయశాః ౧౮

యత్ర రాజన్ దశదిశః పితృతో మాతృత స్తథా
అనురక్తాః ప్రజా ఆసన్నా గోపాలా ద్విజాతయః ౧౯

(కురువృషభుఁడైన యుధిష్ఠిరుఁడు మనసునందనేక పర్యాయములు బాగుగాఁ జింతించి రాజసూయమాచరించుటకే సమీచీనమొనరించెను. మఱియు నద్భుత వీర్యాఢ్యుఁడగు ధర్మజుఁడు ధర్మమునే చింతిచుచు సర్వలోకములకునేది హితమగును అని మనము నాయత్తముగావించెను. ప్రజలనందఱ ననుగ్రహించుచు సర్వధర్మ భృతాంవరుఁడైన యుధిష్ఠిరుఁడవిశేషముగ హితమునే యెల్లఱకుఁ గావించెను. క్రోపమదముల రెంటిని విడనాడి సర్వులకీయందగును. మంచిది; ధర్మేతి ధర్మేతియనియే కాని వేఱుమాట వినవచ్చుటలేదు. ఇట్లుంగుటంజేసి తండ్రివలెనే జనులాతని విశ్వసించినవారైరి. ఆతనికి ద్వేషి కానరానందున నజాతశత్రుత్వమునన దతనియందు వర్తించినది. నరేంద్రుఁడగు ధర్మజుని పరిగ్రహమువలన, భీముని పరిపాలనమువలన, అర్జునుని శత్రుక్షపణమువలన, ధీమంతుఁడగుసహదేవుని ధర్మానుసరణమున, వినమ్రుఁడగు నకులుని వినయవిధేయతవలన నపుడు జనపదములెల్ల

మగుచున్నది. బలాత్కారముగా సామ్రాజ్యమనుభవించు జరాసంధుని పరిస్థితినింత మాత్రము వచించి చండకౌశికుఁడు తటాలున రాజును విడిచి వెడలిపోయినాఁడు. స్వకార్యమును చింతించినవాఁడువలె

---

చకొర్కఁగానుండెను. కలహములు లేవు, భయహేతువులు లేవు. సదా స్వకర్మ నిరతములు, నికామవర్షములు, స్ఫీతములునై జనపదములన్నియు నేర్పడియుండెను వడ్డి వ్యాపారము, యజ్ఞసత్వములు, గోరక్ష, కర్షణము, వ్యాపారము రాజకర్మవలన నవిశేషముగా నేర్పడినవి, సద్వినియోగమైనవి. ధర్మనిత్యుఁడై యుధిష్ఠిరుఁడు రాజ్య పరిపాలనము గావించుటవలన నను కర్షము, నిష్కర్షము, వ్యాధిపావకమూర్ఛనము — ఇత్యాదులపుడు లేవు దస్యులవలనఁగాని, వంచకులవలనఁగాని పరస్పరముగా రాజులుప్రవర్తించుటవలనఁగాని, యల్లే రాజవల్లభులవలనఁగాని యేదియు మృషాకృతమైనదని వినవచ్చుట లేదు స్వకర్మజమగు బలికర్మయగు విధిగల్గిన నృపాలురు ప్రియమాచరించుటకు నుపస్థానమునకు వర్తించువారలైయుండిరి ధర్మనిత్యుడై యుధిష్ఠిరుఁడుండగానపుడు రాజసులు, లోభులునగునట్టివారుమ యథేష్ట కామసంతృప్తులగుచుండిరి సాత్వికసంపద విశేషించి వర్తించు ధర్మజుని రాజ్యమందు రాజసులు మున్నగువారును సంపూర్ణ కాములగుచుండిరి. అట్టివారును మనసారయనుయనుభవింపఁబడిన విషయములు (విషయసుఖములు, దేశములు) సొంపు మీరియుండినవి. దేనియందధికృతుఁడై సామ్రాట్టగు ధర్మరాజు విరాజమానుఁడై పరమయశమునొందెనో యా ధర్మరాజపుడు (రాజసూయ విధానము తనయందు వర్తించిన సమయమందు) సర్వవ్యాపి సర్వగుణుఁడు, సర్వ సాహసికుఁడు, సర్వరాట్‌గా బ్రకాశితుండాయెను. గోపాలురు మొదలుగా ద్విజాతుల పర్యంతము ప్రజలెల్లలు దశదిశ

బృహద్రథుని విసర్జించి చండకౌశికుఁడు వెడలిపోయినాఁడు, ఆపైని జరాసంధ వినాశ విషయమేగలదని యిదిరూఢిగావించుచున్నది.

నిహతే వాసుదేవేన తదాకంసే మహీపతౌ
జాతోవై వైర నిర్బంధః కృష్ణేన సహతస్యవై ౨౨

వాసుదేవునిచేఁ గంసుడు చంపఁబడగా జరాసంధునకుఁగృష్ణుని తోడ వైర నిర్బంధమేర్పడినది. — ఈ శ్లోకమందు వాసుదేవేన, కృష్ణేన అని రెండుమాటలుండుటను గమనింపదగినది. రాజసూయ ఘట్టమందీ విశేషముగలదు.

---

లందఁతట తండ్రియందు తల్లియందువలె ధర్మజుని రాజ్యమందను రక్తులైయుండిరి).

ప్రజలెల్లను ధర్మజుని మాతాపితలట్లు విశ్వసించియుండిరి. రాజ్యమందెల్ల మంగళరూపమేర్పడియుండెను జనపదములెల్ల చక్కఁగా శోభించినవి. అనిష్టమెచ్చటలేదు రాజులు విహితవర్తనులై యనురక్తులై వర్తించిరి. ధర్మజుఁడజాతశత్రుండగుచు లోకామోద మొందిశోభించెను. మఱియు సర్వలోకహితకాముఁడగుచు రాజసూయ మొనరింపఁదలంచెను జరాసంధుఁడు రాజులను బంధిచెను, బలవద్విరోధ మొందెను, విపరీతజన్మ సందర్భముగల జరాసంధుఁడు విపరీత ప్రవర్తకుఁడై సర్వలోక కంటకుఁడాయెను.

అవిగ్రహవీతభయాః స్వకర్మ నిరతాస్సదా
నికామవర్షాస్ఫీతాశ్చ ఆసన్ జనపదాస్తదా

---

ఇది ధర్మజుని రాజ్య విషయము.

ఏవ ధారయతా సమ్యక్ చాతుర్వర్ణ్యం మహాబలః
శుభాశుభమివస్ఫీతా సర్వసస్యధరా ధరా"

---

ఇది జరాసంధుని రాజ్య విషయము.

ఏవమేవ తదావీర బలిభిఃకు కురాంధకైః
వృష్ణిభిశ్చ మహారాజనీతిహేతో రుపేక్షితః ౨౮

కుకురాంధక వృష్ణి వంశములవారు బలవంతులయ్యు నీతి హేతువుగా నుపేక్షించుటఁజరిగినది—అని కృష్ణుఁడు ధర్మజునకు జరాసంధ వృత్తాంత మెల్ల వివరించి పిమ్మట దేశ కాలయుక్తమగు కార్యవచనమిట్లు పలికెను.

పతితౌ హంసడింభకౌ కంసశ్చ సగణో హతః
జరాసంధస్య నిధనే కాలోయం సముపాగతః ౨౦-౧
నశక్యోసౌరణే జేతుంసర్వైరపి సురాసురైః
ప్రాణయుద్ధేన జేతవ్యస్స ఇత్యుపలభామహే ౨
మయినీతిర్బలం భీమే రక్షితాచావయోర్జయః
మాగధం సాధయిష్యామ ఇష్టింత్రియ ఇవాగ్నయః ౩
త్రిభిరాసాదితోఽస్మాభి ర్విజనేన నరాధిపః
నసందేహో యథాయుద్ధమేకేనాప్యుపయాస్యతి ౪
అవమానాచ్చ లోభాచ్చ బాహువీర్యాచ్చ దర్పితః
భీమసేనేన యద్ధాయ ధ్రువము ప్యుప యాస్యతి ౫
అలంతస్య మహాబాహు ర్భీమసేనో మహాబలః
లోకస్యసముదీర్ణస్య నిధనాయాంతకో యథా ౬
యదిమే హృదయం వేత్సియదితే ప్రత్యయోమయి
భీమసేనార్జునౌ శీఘ్రంన్యాసభూతౌ ప్రయచ్ఛమే ౭
వైశంపాయనః:—
ఏవముక్తో భగవతా ప్రత్యువాచ యుధిష్ఠిరః

భీమార్జునౌ సమాలోక్య సంప్రహృష్టముఖావితౌ ౮

యుధిష్ఠిరః:—

అచ్యుతాచ్యుతమామేవం వ్యాహరామిత్రకర్షణ
పాండవానాం భవాన్నాథో భవంతంచాశ్రితావయమ్ ౯

యథావదసి గోవింద సర్వం తదుపపద్యతే
నహిత్వమగ్రతస్తేషాంయేషాం లక్ష్మీః పరాఙ్ముఖీ ౧౦

నిహతశ్చ జరాసంధో మోక్షితాశ్చ మహీక్షితః
రాజసూయశ్చమేలబ్ధోనిదేశే తవతిష్ఠతః ౧౧

క్షిప్రమేవ యథాత్వేత త్కార్యం సముప పద్యతే
అప్రమత్తో జగన్నాథ! తథాకురు నరోత్తమ! ౧౨

త్రిభిర్భవద్భిర్హివినా నాహం జీవిత ముత్సహే
ధర్మార్థ కామ రహితో రోగార్త ఇవ దుఃఖితః ౧౩

నశౌరిణా వినాపార్థోన శౌరిః పాండవం వినా
నాజయో స్త్వనయోర్లోకే కృష్ణయోరితిమే మతిః ౧౪

అయంచ బలినాం శ్రేష్ఠః శ్రీమానపి వృకోదరః
యువాభ్యాం సహితోవీరః కిం నకుర్యాన్మహాయశాః ౧౫

సుప్రణీతో బలౌఘోహి కురుతః కార్యముత్తమమ్
అంధం బలం జడం ప్రాహుః ప్రణేతవ్యం విచక్షణైః ౧౬

యతోహి నిమ్నం భవతినయంతిహి తతోజలం
యతచ్ఛిద్రంత తశ్చాపి నయంతే ధీవరాజలమ్ ౧౭

తస్మాన్నయ నిధానజ్ఞం పురుషం లోకవిశ్రుతం
వయ మాశ్రిత్య గోవిందం యతామః కార్యసిద్ధయే ౧౮

ఏవం ప్రజ్ఞానయ బలం క్రియోపాయ సమన్వితం
పురస్కుర్వీత కార్యేషు కృష్ణం కార్యార్థసిద్ధయే ౧౯

అర్జునః కృష్ణమన్వేతు భీమోఽన్వేతు ధనం జయం ౨౦

నయోజయో బలంచైన విక్రమే సిద్ధిమేష్యతి ౨౧

(హంసడింభకు లిరువురు మడసిరి. సగణముగాఁ గంసుడు హతుఁడై నాఁడింక జరాసంధవధకు గాలమాసన్నమైనది. సురాసురులకుం గూడ నా జరాసంధుఁడు యుద్ధవిజితుఁడు కాజాలఁడు. ప్రాణయుద్ధమున నే వానిని జయింపఁదగియున్నది. నాయందు నీతి బలము భీమునందు (గలమేము) జయరక్షితులమగుచు మా ముప్పురము త్రేతాగ్ను లిప్పినీఁబోలెనా మాగధుని తుది ముట్టించెదము. విజన ప్రదేశమున జరాసంధుఁడు మాలో నొకనితోడఁ బోరాడ రాఁగలఁ డింధుకు సందేహము లేదు. అవమానమో, లోభమో, బాహువీర్యమో కారణముగ దర్పించియున్న జరాసంధుఁడు భీమునితోడ యుద్ధమాడ రాగలండు. అంతకునట్లు భీముండు దీర్ఘుండగు నా జరాసంధుని వధింప సమర్థుండగును. నా హృదయమెఱింగిన వాఁడవు, నాయందు

విశ్వాసముగలవాఁడవగుచో తోడనే భీమార్జునులను నాకు ప్రాఁచీగా నొసంగుము. భగవానుఁడు పలికినది విని సంప్రహృష్టముఖులై భీమార్జునులుగా నవచ్చుటను తిలకించి యుధిష్ఠిరుఁడిట్లు బదులుఁ పలికెను. అచ్యుత! అచ్యుత! శత్రుకర్షణ! నీవట్లు పలుకవలదు. నీవు పాండవులకు నాథుండవు నిన్నాశ్రయించియున్న వారము మేము. నీవు పలికినదెల్లనట్లే సమకూరగలదు లక్ష్మీపరాఙ్ముఖులగు వారలకు నీవు ముందుండు వాఁడవే కావు. జరాసంధుఁడు నిహతుడే, రాజులు బంధమోక్షితులే, రాజసూయము నాకు లభించినట్లే వీని దేశవర్తులగు మాకిదంతయు సిద్ధమే. కార్యమెట్లు సమకూరునో శీఘ్రగతిని నివప్రమత్తుఁడవై గావింపుము. మీరు ముగ్వురు లేనిచో నేను బ్రతికియుండజాలను. ధర్మార్థ కామరహితుండగు రోగార్తునట్లు దుఃఖితుఁడననగుదును శౌరి వినా పార్థుడు, పార్థుడు వినా శౌరి లేరు. ఆ కృష్ణుల కీ లోకమందజయ్యమనునది లేదని నా తలంపు. ఈ వృకోదరుఁడు బలవంతులందు శ్రేష్ఠుఁడు, శ్రీమంతుఁడు, మహాయశుండే భీముండు మిమ్ముంగూడి కార్యకారి యేలకాకుండును ? బలౌఘము స్తు ప్రణీతమగుచునుత్తమ కార్యముగావించును. అంధుఁడు,బలవంతుఁడు,జడుఁడు ఎవండు కానిమ్ము విచక్షణుండగునట్టివాఁడే సుప్రణీతుఁడు(మార్గదర్శకుఁడు) కాదగినదంచు వచించెదరు పల్లమునకే జలమునుఁగొనిపోయెదరు ధీవరులున్న ఛిద్రమున్న తావునకే జలమును పారించెదరు (ధీశాలురట్లు కార్యోపాయజ్ఞులగుదురు)నయవిధానజ్ఞుఁడు. లోకవిశ్రుతుఁడునగుపురుషోత్తముండు గోవిందుని మేమాశ్రయించి కార్యసిద్ధికై గడంగుదుము. క్రియోపాయ సమన్వితమగునట్టి ప్రజ్ఞ, నయము, బలముగల కృష్ణుని కృత్యములందు కార్యసిద్ధికై ముందుంచుకొనవలయును యదుశ్రేష్ఠా ! కార్యార్థసిద్ధి

పర్యంతమర్జునుండు కృష్ణునను సరింపఁదగినది. భీముఁడు ధనంజయునను సరింపఁదగినది. నయము, జయము, బలము, ఇవి విక్రమసిద్ధినొందును అని ధర్మరాజు పలికెను.)

జరాసంధుఁడు రుద్రుని సేవించియున్నాఁడు, చండకౌశికుని యాశీర్వాదము గల్గినవాఁడు, విస్తార బల సంపద గల్గియున్న వాఁడు. కారణ జన్ముఁడై బలదేవుని వలన నుద్భవించిన భీమసేనుఁడా జరాసంధుని ప్రాణయుద్ధమున జయి పఁదగియున్నది. ' కార్య ప్రవర్తకులము మేమగుదుము ' అని భీముడు తన్ను, కృష్ణార్జునులను నిర్దేశించి పలికినాఁడు. దేవతలకును సాధ్యుఁడుకాని, ఏండ్లు పూర్ణోద్దేశించినను దుస్సాధ్యుఁడగు నా జరాసంధుని కృష్ణుఁడిపుడు భీముని వలన జంపించువాఁడగుచున్నాఁడు. నీతి విశారదుఁడు కృష్ణుఁడు జయశీలుఁడర్జునుని తోడనండగానిందుఁ బ్రివర్తించుచున్నాఁడు. జగత్సారభూతులు, జగదేకవీరులు నగు యాదవ పాండవ వీరశిఖామణులు ముగ్గురిపుడు లోకకంటకుని విజనమందుఁ దుదముట్టింప నిశ్చయించినారు. " పూచీగా నాకు భీమార్జునుల నొసంగుము " అని కృష్ణుఁడు ధర్మజునితోఁ బలికినాఁడు. "కృష్ణే నయో మయి బలం జయః పార్థే ధనంజయే"-ఇది భీమ వచనము "మయి నీతిర్బలం భీమేరక్షితా చావయోర్జయః" ఇది భగవానుని వచనము. భీముఁడు వ్యక్తిపరమైన నిర్దేశమును— "బలం జయః" అని చేర్చి పలికినాఁడు. కృష్ణసకాశమున పాండవ కార్యసిద్ధి నిది వ్యక్తీకరించుచున్నది. కృష్ణుఁడు నయబల జయములను నిర్దేశించుచు — "నీతిర్బలం" అని చేర్చి పలికినాఁడు. యాదవ పాండవ కృత్యము నిది వ్యక్తీకరించుచున్నది. "అవమానాచ్చ లోభాచ్చ బాహువీర్యాచ్చ

దర్పితః ' ఇది జరాసంధుని పరిస్థితి-పర్యవసానము. లోకమంత తనదే, తన కెదురు లేదను విఱ్ఱవీగు నాజరాసంధుని విజనమందు నిధన మొందింపఁ గృష్ణుఁడు నయ విధానమేర్పఱచినాఁడు. అందుకై భీమార్జునులను పూచీగాఁ దీసికొని పోవువాఁడయినాఁడు. కృష్ణ నిర్ణయ విధానమున కాపోత్సాహమునకు మెచ్చి పలుకుచు ధర్మరాజు విశేషించి కృష్ణార్జులను నేకనామమున నిర్దేశించి పలికినాఁడు. (నా జయో స్త్వనయో ర్లోకే కృష్ణయోరితి మేమతిః ' అని పలికినాఁడు.) ఏకమూర్తి ధరులగు వారజేయులని వచింపుచుఁ గార్యసాధకుండగు భీమసేనుని ప్రశంసించినాఁడు. జరాసంధుని ఛిద్రమును గనిపెట్టి కార్య నిశ్చయమేర్పఱచిన నయ విధానజ్ఞుఁడగుఁ గృష్ణు నాశ్రయించి కార్యసిద్ధిని ధర్మజుఁ డొందుచున్నాఁడు. కృష్ణునందు సర్వము మూర్తీభవించియున్నదని ( ఏవం ప్రజ్ఞానయబలం క్రియోపాయ సమన్వితం — కృష్ణం అని ) వచింపుచు ధర్మజుఁడుచితమాడుచున్నాఁడు. ఆ బాల్య స్నేహితులగు కృష్ణార్జునులను చేర్చి పలుకుచు భీమసేనుని వారితోడ జతచేయుచున్నాఁడు. ' అర్జునః కృష్ణ మన్వేతు భీమోన్వేతు ధనం జయం ' అనినాఁడు. మఱియు నమ్మువ్వురందపుడు నూపేర్పఱచిన త్రిగుణ విశేషమును కార్యసిద్ధియందు జతచేయుచు ధర్మజుఁడు ' నయో జయో బలం చైవ విక్రమే సిద్ధిమేష్యతి ' అనినాఁడు ఈ ఘట్టమంతట కృష్ణుఁడు, కృష్ణునందలి నయవిధాన ముఖ్యప్రధాన స్థాన మాక్రమించియుండుట గమనింపఁదగినది. భీమసేనుఁడు పలికినది ధర్మజుని మంత్రాంగ పర్యవసానమే. కృష్ణుఁడద్దాని నేతవ నోటనెత్తి పలుకుచు (పోషించుచు) కార్యనిశ్చయమునకు ముక్కోలియగు ప్రోద్బలమునుకల్గించుచున్నాఁడు

కాగా నిదియు పాండవ మంత్రాంగ పర్యవసానమే యని సమర్థ మగుచున్నది. 'త్వచ్ఛకాశాచ్ఛ' అని ధర్మరాజు వచించినది యక్షరముల నేర్పడినది.

ఏవ ముక్తాత్తత స్సర్వే భ్రాతరో విపులౌజసః
వార్ష్ణేయః పాండవేయాశ్చ ప్రతస్థుర్మాగధం ప్రతి ౨౨

వర్చస్వినాం బ్రాహ్మణానాం స్నాతకానాం పరిచ్ఛదం
ఆచ్ఛాద్య సుహృదాం వాక్యై ర్మనోజ్ఞై రభినందితాః ౨౩

అమర్షా దభితప్తానాం జ్ఞాత్యర్థం ముఖ్యతేజసాం
రవిసోమాగ్ని వపుషాం దీప్తమాసీ త్తదా వపుః ౨౪

హతం మేనే జరాసంధం దృష్ట్వా భీమపురోగమౌ
ఏకకార్య సముద్యంతౌ కృష్ణౌ యుద్ధే పరాజితౌ ౨౫

ఈశౌహితౌ మహాత్మానౌ సర్వకార్య ప్రవర్తినౌ
ధర్మకామార్థ లోకానాం కార్యాణాంచ ప్రవర్తకౌ ౨౬

(ధర్మజుని మాట విని మహాతేజస్వులగు భ్రాతలు (భీమార్జునులు బయలుదేరిరి) వార్ష్ణేయుడును పాండవేయులు మాగధునిఁగూర్చి బయల్వెడలిరి. స్నాతక బ్రాహ్మణ వేషధారులై యామూర్తిమంతులు సుహృద్వాక్యములచే మనోజ్ఞముగా నభినందితులై బయల్వెడలిరి. జ్ఞాత్యర్థ మమర్షాభితప్తులై సముఖ్య తేజస్వులనున్నవ్వారి యాకారములు (వపుః) రవి సోమాగ్ని వర్చస్వులగు నమ్మువ్వుర మూర్తిమంతములు మిక్కిలి దీప్తినొందినవి. ఏకకార్యసముద్యుక్తులు, రణాగ్రలక్ష్మీ శోభితులు, లోకహితవర్తనులగు కృష్ణులు (కృష్ణార్జునులు) భీమ

పురోగములగుటఁ జూచి జరాసంధుఁడు హతుఁడనియే ధర్మజుఁడు— అందఱు తలంచిరి )

ధర్మజుఁడు కార్యవచనము పలుకఁగానపుడు విపులౌజస్వులగు భీమార్జునులు (బయలుదేరిరి.) వార్ష్ణేయుఁడు, పాండవేయులు బయలు దేరిరి. – అని యుండుట గమనింపఁదగినది. కృష్ణపాౢధాన్యయుక్తమగు భీమార్జునుల ప్రయాణ సన్నాహ మిం ం దుఁ బోషింపఁబడినది. (౨౨వ శ్లోకము) ౨౩వ శ్లోకమందు తేజఃపుంజమైన బ్రాహ్మణ స్నాతక వేషధారులగు నమ్మువ్వురభినందింపఁబడిన విశేషమందగించుచున్నది. అనన్యాభితప్తులైజ్ఞాతి కార్య నిర్వాహకులగు నమ్మువ్వుర దీప్తిని ౨౪వ శ్లోకమందు విశేషాకారముఁగాగలదు.

౨౧వ శ్లోక మాయువు పట్టుగానొప్పియున్నది. భీముఁడు ప్రధానముగా నేర్పడియున్న కృష్ణుల కార్యప్రసక్తియందు వెలుగొందుచున్నది. ‹హతంమేనే› అను మొదటి మాట ధర్మరాజునందు ముఖ్యవృత్తిగా నేర్పడుచు సర్వులందు మొత్తముగా నన్వయమగు చున్నది.

‹హతంమేనే జరాసంధం దృష్ట్వా భీమపురోగమా› అని ప్రారంభింపఁబడిన ౨౧, ౨౬ శ్లోకములు విపులమగు కృష్ణార్జునుల సర్వప్రవృత్తి యందు ప్రసరించియందగించుచున్నవి.

పాండవుల రాజసూయ ప్రయత్నకార్యమదిగాన భీమార్జునులు, సహోదరులు ముందుగా నిర్దేశింపఁబడిరి పురాణములు, ఏకమూర్తి ధరులు, ఏకకార్య ప్రవర్తకులనగు కృష్ణార్జునుల లోకహితాచరణ ప్రవృత్తియదిగాన వారుభయులు చివరగా నిర్దేశింపఁబడిరి. ౨౨, ౨౬ శ్లోకములందివిశేషము గననగును. ‹ధర్మకామార్థలోకానాం కార్యాణాంచ ప్రవర్తకౌ› అను చరమపాదము తలమానికముగా నొప్పి

యున్నది. రవిసోమాగ్ని వర్చస్వులగు నమ్మువ్వర ప్రమాణ సన్నాహములు శోభించినది.

## జరాసంధ వధ

వివిధ దేశములను, పర్వతములను, నదులను దాటి కుశచీర ధారులై కృష్ణభీమధనంజయులు మగధదేశమును ప్రవేశించిరి. అపుడు వాసుదేవుఁడిట్లు పలికెను. (ఈ ప్రదేశము నావరించియున్న పర్వతములనుఁ గాంచుడు. గౌతమునకు శూద్రస్త్రీయందు గల్గినసంతతి యిచ్చట నేర్పడియున్నది. అంగవంగాదిదేశప్రభువులును ఈ సంతతివారి నే యాశ్రయించియున్నారు. ఇచ్చటవనరాజినిగాంచుఁడు. ఈ పురమును పొంది జరాసంధుఁడు సిద్ధినొందితినని తలంచుచున్నాఁడు. మనమిపుడు వాని దర్పమును హరింతము' అనిపలికెను).

ఈ మాటలు వాసుదేవుని మాటలని భారతమందు గలదు.

హృష్ణ పుష్ట జనోపేతం చాతుర్వర్ణ్య సమాకులం

స్ఫీతోత్సవ మనాధృష్య మాసేదుశ్చ గిరివ్రజమ్ ౨౧-౧౮

(హృష్ట పుష్ట జనోపేతము, చాతుర్వర్ణ్యసమాకులము, స్ఫీతోత్సవము, అనాధృష్యమునగు గిరివ్రజమును వారు చేరిరి. వృషభుఁడగు వానిని జరాసంధుఁడు చంపి వాని చర్మముతో మూఁడు భేరులను చేయించెను. మాసతాలములగు నా భేరుల మూఁటిని వారు బ్రద్దలు కొట్టి చైత్రి ప్రాకారమును చేరిరి. జరాసంధుని శిరమును భేదించినట్లు చైత్రిప్రాకారమును పడవేసి వారపుడు హృష్టులగుచు పురమును ప్రవేశించిరి. అపుడు వేదపారగులగు బ్రాహ్మణులు దుర్నిమిత్తములను పొడఁగాంచి జరాసంధుని చే ప్రదక్షిణముఁగావింపఁ జేసిరి. గజమునెక్కి జరాసంధుఁడు ప్రదక్షిణ

మొనరించెను. * జగన్మంగళ కారులగు కృష్ణ భీమధనంజయులు పురము ప్రవేశించు నీ సమయమున పురమందు దుర్నిమిత్తము లేర్పడుట జరాసంధుని తలవ్రాత. పరమదుర్మార్గుఁడగు జరాసంధ వినాశన మిపుడు స్పష్టమగుచున్నది. ఈ దుర్నిమిత్తముల శాంతికిఁగాను జరాసంధుఁడు దీక్షితుఁడై యుపవాస మొనరించెను. శాస్త్ర విధిని విడనాడి కామకారుడై ప్రవర్తించు జరాసంధుని యీ నియమాచారము వ్యర్థమైనది. స్నాతక వేషధారులైన కృష్ణ భీమధనంజయులు బాహుశస్త్రముగా జరాసంధుని దలపడ నిశ్చయించి నిరాయుధులై పురమును ప్రవేశించిరి. వారు రాజమార్గమునఁ బడి బలాత్కారముగా (జులుంచేసి) గంధమాల్యాను లేపన వస్త్రములనుఁగైకొని యలంకరించుకొనిరి. హిమాచల సింహము లావులమందలోఁబడి నట్లా ముగ్గురు జరాసంధ నివేశమును ప్రవేశించిరి. అలంకృతులగు వారి బాహువులు శోభాయమానమై యున్నవి.

తాన్ దృష్ట్వా ద్విరద ప్రఖ్యాన్ సాలస్కంధా నివోద్గతాన్
వ్యూఢోరస్కాన్ మాగధానాం విస్మయ స్సమ పద్యత ౩౧

ద్విరద ప్రఖ్యులు, సాలస్కంధులు, వ్యూఢోరస్కులు నగు వారిం జూచి మాగధులు విస్మయమొందిన వారయిరి. నరర్షభులు ముగ్గురు మూఁడు కక్ష్యాంతరములు దాటివచ్చి యహంకృతిఁగల్గి గతవ్యథులై జరాసంధుని సమీపించిరి. (అహంకారేణ రాజాన ముపతస్థు ర్గతవ్యథాః) జరాసంధుఁడు వారి కర్ఘ్యపాద్యాది విధులు గావించి స్వాగతము పలికెను. పార్థుఁడు భీముఁడు మౌనమున నుండిరి. బ్రాహ్మణాదరణము చూపు నాజరాసంధునితోఁడ

* భాగవతము దశమస్కంద మందలి విషయము నిచ్చోట తలంపవలయును. (శ్యమంతకమణి వృత్తాంతము) విమర్శకు లిందలి యథార్థమును పరిగ్రహింపవలసినది.

పాండవు లేమియుఁ బలుకలేదు. వారియందు మహాబుద్ధిమంతుఁడు కృష్ణుఁడు (తేషాం మధ్యే మహా బుద్ధిః కృష్ణః) ; నియమస్థులు వీరర్ధరాత్రికి ముందు మాటాడువారు కారు ’ అని పలికెను. జరాసంధుఁడు వారిని యజ్ఞాగారమున నిలిపి రాజగృహమునకుఁ బోయెను. జరాసంధుని యజ్ఞాగారము సాత్త్వికమైనది కాదు. అందు రాజుల నెందఱనో బలిఁగావింప బూనియున్నాఁడా జరాసంధుఁడు. మోహగ్రస్తుఁడగు జరాసంధుఁడు యాదవ పాండవుల నందు నిలిపి తానంతఃపుర వర్తియైనాఁడు. అర్ధ రాత్రి సమయమున జరాసంధుఁడు వారల యొద్దకు వచ్చెను. స్నాతకులగు బ్రాహ్మణులు ప్రాప్తించుచో నది యర్ధరాత్రియైనను నెదురు చనునను వ్రతముఁ గల్గిన వాఁడా జరాసంధుఁడు (తస్యహ్యేతద్వ్రతం రాజన్ బభూవ భువి విశ్రుతం) ఈ జన నుడి పేరు మ్రోయునదిగా జరాసంధునందున్నదని తెలియఁదగినది ఉత్తములగు బ్రాహ్మణ స్నాతకు లర్ధరాత్రి వేళ వచ్చువారు కారు. ధర్మార్థకామములకు కాల విభాగము గలదు. జరాసందునం దది యిపుడు విపరీతముగాఁ దేలుచున్నది. అపూర్వ రూపముగల వారలనుగాంచి జరాసంధుఁడు విస్మితుఁడాయెను. వారపుడు స్వస్తి వచనము పలికిరి, బ్రాహ్మణ ధర్మ సంవృతులగు నా పాండవ యాదవులతో కూర్చొనుఁడు ; అని జరాసంధుఁడు పలికెను.

అథో పవివిశు స్సర్వే త్రయస్తే పురుషర్షభాః ౪౨
సంప్రదీప్తా స్త్రియో లక్ష్మ్యా మహాధ్వర ఇవాగ్నయః

తానువాచ జరాసంధ స్సత్యసంధో నరాధిపః
విగర్హమాణః కౌరవ్య వేషగ్రహణ వైకృతాన్ ౪౩

న స్నాతకవ్రతా విప్రా బహిర్మాల్యానులేపనాః
భవంతీతి నృలోకేస్మి న్విదితం మమ సర్వశః ౪౪

కేయూరాయం పుష్పవంతశ్చ భుజై ర్జ్యాకృత లక్షణైః
బిభ్రతః క్షత్రభోజశ్చ బ్రాహ్మణ్యాం ప్రతి జానథ ౪౫

ఏవం విరాగవసనా బహి ర్మాల్యాను లేపనాః
సత్యం వదత కేయూరాయం సత్యం రాజసుశోభతే ౪౬

చైత్యకస్య గిరే శ్శృంగం భిత్త్వా కిమిహ ఛద్మనా
అద్వారేణ ప్రవిష్టాః స్థ నిర్భయా రాజ కిల్బిషాత్ ౪౭

వదధ్వం వాచి వీర్యంచ బ్రాహ్మణస్య విశేషతః
కర్మ చైత ద్విరూపంగస్థం కింవోద్య ప్రసమీక్షితమ్ ౪౮

ఏవంచ మా ముపాస్థాయ కస్మాచ్చ విధినార్హణాం
ప్రణీతాం నాను గృహ్ణీత కార్యం కింవాస్మదాగమే ౪౯

ఏవ ముక్తే తతః కృష్ణః ప్రత్యువాచ మహామనాః
స్నిగ్ధ గంభీరయా వాచా వాక్యం వాక్య విశారదః ౫౦

శ్రీ కృష్ణః :-స్నాతకాన్ బ్రాహ్మణాన్ రాజన్ విద్ధ్యస్మాం
స్త్వం నరాధిప

స్నాతక వ్రతినో రాజన్ బ్రాహ్మణాః క్షత్రియా విశః ౫౧

విశేషనియమాశ్చైషా మవిశేషాశ్చ సంత్యుత
విశేషవాంశ్చ సతతం క్షత్రియ శ్శ్రియ మృచ్ఛతి ౫౨

పుష్పవత్సు ధృవా శ్రీశ్చ పుష్పవంత స్తతో వయం
క్షత్రియో బాహువీర్యస్తు నతథా వాక్యవీర్యవాన్ ౫౩

అప్రగల్భ వచ స్తస్యతస్మా ద్బార్హద్రథేరితం
స్వవీర్యం క్షత్రియాణాంతు బహ్వోర్దాతా న్యవేశయత్ ౫౪

తద్ది దృక్షసి చేద్రాజన్ ద్రష్టాస్యద్య నసంశయః
అద్వారేణ రిపోర్గేహం ద్వారేణ సుహృదో గృహాన్ ౫౫

ప్రవిశంతి నరా ధీరా ద్వారా ణ్యేతాని ధర్మతః
కార్యవంతో గృహానేత్య శత్రుతో నార్హణాం వయమ్ ౫౬

ప్రతి గృహ్ణీమ తద్విద్ధి హ్యేతన్నశ్శా శ్వతం వ్రతమ్ ౫౭

(మహా ధ్వరమున ప్రేతాగ్నులట్లు వెలుంగు నమ్మున్నృవ రాసీనులైరి. వేషగ్రహణావై కృతులగు వారిని గర్హించువాఁడై సత్యసంధుఁడగు జరాసంధుఁ డిట్లనెను. నృలోకమందు స్నాతక వ్రతస్థులగు విప్రులు బహిర్మాల్యాను లేపనులు కారని నేనెఱింగియున్నాను. మీరెవ్వరు. ? క్షత్రభోజులగు మీరు బ్రాహ్మణులట్లు గాన వచ్చుటదియేల. ? విరాగవసనములు, బహిర్మాల్యానులేపనులఁ నగు మీరలెవ్వరో సత్యము వచింపుఁడు. సత్యమే సుశోభనమైనది. చైత్య గిరిశృంగము బ్రద్దలుఁ గొట్టి ఛద్మ వేషమున మీరలు రాజకిల్బిష నిర్భయులగుచు నద్వారమున

నేల(ప్రవేశించితిరి. బ్రాహ్మణవాకుట-, విలింగస్థ కర్మగల మీార లిచ్చోటగాంచునది యేమి ? ఇవ్విధమున నన్ను సమీాపించిన మీా రేల విధ్యర్ఘ్యణము నంగీకరించకున్నారు. ఇంక మీారిట వచ్చిన కార్యమేమి అనిపలికెను, వాక్యవిశారదుడగు కృష్ణుడు స్నిగ్ధగంభీర వచన మిట్లు బదులుపలికెను. స్నాతకులగు బ్రాహ్మణులుగా మమ్ములను దెలియుము బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు స్నాతక వ్రతస్థులగుదురు. విశేషనియమములు, అవిశేషనియమములు గలవుగదా. విశేషనియమము గల్గినట్టి క్షత్రియులేసంపద నొందెదరు. పుష్పవంతులగు వారికి సంపద ధృవము. కనుక మేము పుష్పవంతులమయితిమి. బాహువీర్యము గలవాడు, వాక్యవీర్య మట్లుగానేరడు (కాడు) క్షత్రియుడు, అప్రగల్భవచనుడతండు. జరాసంధా! మేమివ్విధిగ మాట నాడితిమి బ్రహ్మ క్షత్రియులకు స్వవీర్యమును బాహువులందుంచినాడు (అనగా బాహువీర్యము గలవారు క్షత్రియులని యభిప్రాయము.) అదిచూడ నిచ్ఛయించెదవేని యిప్పుడే చూడగలవది నిస్సంశయము. ధీరులగు నరులు రిపుగేహము నద్వారమున, ద్వారమున సుహృద్గృహములను ప్రవేశించెదరు. ధర్మమునుబట్టి యివి మార్గములగును. కార్య వంతులము మేమిందువచ్చియున్నారము గాన శత్రు సపర్యల నందువారము గా మయుది తెలిము. మాకుగల శాశ్వతవ్రతమది' అని పలికెను )

త్రేతాగ్నుల ధ్వరమును గొన సాగించునట్లు కృష్ణ భీమ ధనంజయులు రాజసూయ క్రతుకార్య మందు బ్రవర్తించు వారలై మహాధ్వర త్రేతాగ్నులట్లు పుదాసీనులయిరి. శత్రుసద్మమునం గార్య ప్రవర్తకులగుచు వారు తదనుసరణమగు ప్రవృత్తినచట నడపిరి.

సంక్లిష్టకర్ముఁడగు జరాసంధుఁడు వేషగ్రహణావైకృతులగు వారిని గర్హించుచు నట్లువర్తించుటకేమిహేతువు?" అనియడిగెను. రాజకిల్బిష నిర్భయులైన మీరలెవ్వరు?" అనియడిగెను, వాక్యవిశారదుఁడగు కృష్ణుఁడు బదులు పలుకుచు "స్నాతకాన్ బ్రాహ్మణాన్ రాజన్ విధ్యస్మాంస్త్వంనరాధిప!" అనిమాట ప్రారంభించినాఁడు. క్షత్రియులగు తామట్లు స్నాతక బ్రాహ్మణ వేషధారులగుట విశేష నియమప్రకటనార్థమనియునది బహిర్గతమగు కృత్యములనాచరించితిమనియుఁ గృష్ణుఁడుపలికినాఁడు "క్షత్రియులము మేము, శత్రుగృహమున కద్వారమున వచ్చి చేరితిమి. కార్యవంతులగు మేము నీపొనర్చు నర్హణమంగీకరించువారము కాము, బాహువీర్య ప్రవర్తకులమగు మేమిట్లు వచ్చితిమి" అని పలుకుచు "తద్దిదృక్షసిచేద్రాజన్ ద్రష్టస్యద్య నసంశయః అనినాఁడు. జరాసంధుఁడు బ్రాహ్మణాదరము విశేషముగాఁ గావించువాఁడు. క్షత్రియలోకమునెల్లఁ గలగుండు గావించుచు వారలందు గొట్టుగా ప్రవర్తించుచున్నాఁడు, వారికి పశుభూతుల నొనరించి రుద్రునకు బలినీయదలంచియున్నాఁడు. అందు కృష్ణునకు బంధువులగు రాజులు బంధింపఁబడియున్నారు. కావున ప్రవేశమునకు బ్రాహ్మణ వేషమునుఁ గావించితిమని, బాహువీర్యమున కార్యసాధకులగుదుమనియు కృష్ణుఁడు వెల్లడించినాఁడు. విపరీత ప్రవృత్తియందున్న జరాసంధుని యొద్దకు విపరీత వేషధారులై కృష్ణ భీమ ధనంజయులు ప్రవేశించిరి. అగణితబహుబలగర్వితులైన వారలఁజూచి యహంకృతి ముంగలిగాఁగ జరాసంధుఁడు ప్రజ్ఞా వచనమునిట్లు పలికినాఁడు.

జరాసంధః-

సస్మరామి కదా వైరం కృపం యుష్మాభిరిత్యుత
చింతయంశ్చ నపశ్యామి భవతాంప్రతివైకృతమ్ ౨౨-౧

వైకృతేనాసతి కథం మన్యధ్వంమా మవాగసం
అరింవైబ్రూతహే విప్రాస్సతాం సమయ ఏషహి ౨

అర్థ ధర్మోపఘాతాద్ధి మనస్సముపతప్యతే
యోనాగసి ప్రసృజతి క్షత్రియోహి నసంశయః 3

అతోఽన్యథాచరన్‌లోకే ధర్మజ్ఞస్సన్ మహారథః
వృజినాంగతిమాప్నోతి శ్రేయసో ప్యుపహంతిచ
త్రైలోక్యేక్షత్రధర్మోహి శ్రేయాన్వైసాధుచారిణాం
నాన్యం ధర్మం ప్రశంసంతి యేచధర్మవిదో జనాః ౪

తస్యమేఽద్యస్థితస్యేహ స్వధర్మేనియతాత్మనః
అనాగసః ప్రజానాంచ ప్రమాదాదివ జల్పథ ౬

కృష్ణః

కులకార్యం మహాబాహో కశ్చిదేకః కులోద్వహః
వహతేయ స్తన్నియోగాద్వయ మభ్యుద్యతాస్త్వయి ౭

త్వయాచోపహృతా రాజన్ క్షత్రియా లోక వాసినః
తదాగః క్రూరముత్పాద్య మన్యసేకి మనాగసమ ౮

రాజారాజ్ఞః కథం సాధూన్ హింస్యాన్నృపతిసత్తమ
తద్రాజ్ఞస్సన్నిగృహ్యాత్వం రుద్రాయోప జిహీర్షసి ౯

అస్మాంస్త దేనోఽపగచ్ఛేత్ కృతం బార్హద్రథ త్వయా
వయంహిశక్తా ధర్మస్యరక్షణే ధర్మచారిణః ౧౦

మనుష్యాణాం సమాలంభో నచ దృష్టః కదాచన
స కథం మానుషైర్దేవం యష్టు మిచ్ఛసి శంకరమ్ ౧౧

స వర్ణోహి సవర్ణానాం పశుసంజ్ఞాం కరిష్యసి
కోఽన్య ఏవం యథాహి త్వం జరాసంధ వృథామతిః ౧౨

యస్యాం యస్యా మవస్థాయాం యద్యత్కర్మ కరోతియః
తస్యాం తస్యా మవస్థాయాం తత్ఫలం సమ వాప్నుయాత్ ౧౩

తే త్వాం జ్ఞాతి క్షయకరం వయ మార్తాను సారిణః
జ్ఞాతి వృద్ధినిమిత్తార్థం వినిహంతు మిహాగతాః ౧౪

నాస్తిలోకే పునా నన్యః క్షత్రియే ష్వితిచైవయత్
మన్యసే సచ తేరాజన్ సుమహాన్ బుద్ధి విప్లవః ౧౫

కోహి జాన న్నభిజన మాత్మవాన్ క్షత్రియో నృపః
నా విశ త్స్వర్గ మతులం రణానంతర మవ్యయం ౧౬

స్వర్గం హ్యేవ సమాస్థాయ రణయజ్ఞేషు దీక్షితాః
జయంతి క్షత్రియా లోకాం స్తద్విద్ధి మనుజర్షభ ౧౭

స్వర్గయోనిర్మహ ద్బ్రహ్మ స్వర్గయోని ర్మహ ద్యశః
స్వర్గ యోని స్తపోయుద్ధే మృత్యుస్సోఽవ్యభిచారవాన్ ౧౮

ఏష హ్యైంద్రో వైజయంతో గుణై ర్నిత్యం సమాహితః
యేనాసురాన్ పరాజిత్య జగత్పాతి శతక్రతుః ౧౯

స్వర్గమార్గాయ కస్యస్యాద్విగ్రహో వై యథా తవ
మాగధై ర్విపులై స్సైన్యై ర్బాహుళ్యం బలదర్పితః ౨౦

మావమంస్థా పరాన్ రాజ న్నస్తి వీర్యం నరే నరే
సమం తేజ స్త్వయా చైవ విశిష్టం వా నరేశ్వర ! ౨౧

యావదేత దసం బుద్ధం తావదేవ భవేత్తన
విషహ్య మేత దస్మాక మతో రాజన్ బ్రవీము తే ౨౨

జహిత్వం సదృశేష్వే వమానం దర్పంచ మాగధ
మాగమస్స సుతామాత్య స్స బలశ్చయమక్షయమ్ ౨౩

దంభోద్భవః కార్తవీర్య ఉత్తరశ్చ బృహద్రథః
శ్రేయసో హ్యవమన్యేహ వినేశు స్సబలా నృపాః ౨౪

యుయుక్షమాణా స్త్వత్తోహి న వయం బ్రాహ్మణా ధ్రువం
శౌరి రస్మి హృషీకేశో నృవీరా పాండవావిమౌ ౨౫

త్వా మాహ్వయామ హే రాజన్ స్థిరో యుధ్యస్వ మాగధ
ముంచ వా నృపతీన్ సర్వాన్ గచ్ఛ నాత్వం యమక్షయమ్

జరాసంధః ౨౬

నాజితాన్వై నరపతీ న్నహ మామద్మి కాంశ్చన
అజితః పర్యవస్థాతాకోఽత్రియో నమయా జితః ౨౭

క్షత్రియ స్సైతదేవాహు ర్ధర్మం కృష్ణోపజీవినం
విక్రమ్య వశమానీయ కామతో యస్సమాచరేత్ ౨౮

దేవతార్థ ముపా హృత్యరాజ్ఞః కృష్ణ కథం భయాత్
అహామద్య నిముచ్యేయం క్షాత్రం వ్రత మనుస్మరన్ ౨౯

సైన్యం సైన్యేన వ్యూఢేన ఏక మేకేనవాపునః
ద్వాభ్యాం త్రిభిర్వా యోత్స్యేఽహం యుగప త్పృథగేవవా ౩౦

వైశంపాయనిః :-

ఏవ ముక్త్వా జరాసంధ స్సహదేవాభిషేచనం
ఆజ్ఞా పయ త్తదా రాజా యుయుత్సుర్భీమ కర్మభిః ౩౧

సతు సేనాపతిం రాజా సస్మార భరతర్షభ !
కౌశికం చిత్ర సేనంచ తస్మిన్ యుద్ధే హ్యుప స్థితే ౩౨

యయోస్తే నామనీ రాజన్ హంసేతి డింభ కేతిచ
పూర్వం సంకథితే పుంభి ర్నృలోకే లోకసత్కృతే ౩౩

తంతు రాజ న్విభు శ్శౌరీ రాజానం బలినాం వరం
స్మృత్వా పురుషశార్దూల శ్శార్దూల సమవిక్రమమ్ ౩౪

సత్య సంధో జరాసంధం భువి భీమపరాక్రమం
భాగ మన్యస్య నిర్దిష్ట మవధ్యం మధుభి ర్మృధే ౩౫

నాత్మ నాత్మవతాంముఖ్య ఇయేష మధుసూదనః
బ్రాహ్మీ మాజ్ఞాం పురస్కృత్య హంతుం హలధరానుజః ౩౬

(మీారెపుడు నైర మొనర్చినది జ్ఞప్తి లేకున్నాను. ఆలోచించియు మీాతోడ నెపుడు నైకృత మాచరించినది నెఱుగలేకున్నాను. నైకృతి జరిగియుండినను నిరపరాధినగు నన్నుఁ గూర్చి యిట్లు తలంపవచ్చునా? విప్రులారా! 'శత్రువు' అని పలుకుట సత్పురుషుల సమయమగునా? అనపరాధియందు నైకృత మొనరించునట్టి క్షత్రియుఁడు నిస్సంశయముగా నర్థకామములు లోపించుటం జేసి మనస్తాప మొందగలఁడు. ధర్మజ్ఞుండయ్యు నన్యథాచరించువాఁడు వృజినగతి నొందగలఁడు, శ్రేయ మొందజాలఁడు. ముల్లోకములందును సాధుత్వమున చరించునవ్వారికి క్షత్రధర్మము శ్రేయమగును. ధర్మవేత్తలగువారు నేడొక ధర్మమును ప్రశంసింపరు. స్వధర్మ నిరతుఁడనై యున్నవాఁడ, ప్రజల కన్యాయమాచరించినది లేదట్టి నన్నుఁ గూర్చి మీారు అపాండము సేయుచున్నారు.! (ప్రమాదాదిజల్పద) ఇట్లని జరాసంధుఁడు పలుకఁగాఁ గృష్ణుఁడిట్లు పలికెను. (కులకార్య మొక్క కులోద్వహుఁడు వహించును. ఆతని నియోగము ననుసరించి మేమెత్తి వచ్చితిమి. లోకవాసులగు క్షత్రియులు నీచే నపహరింపఁబడిరి. అట్టి పాపమైన క్రూర ముత్పాదించి నిరపరాధినని తలంచుచుంటివెట్లు? రాజగువాఁడుసాధులగు రాజుల నెట్లు హింపించువాఁడగును? నీవట్లు రాజుల నిర్బంధించి రుద్రునకు బలిమొసంగ నుంటివికదా! నీవు గావించి యున్నదిది మమ్ము చుట్టుకొన్నది. ధర్మచారులమగు మేము ధర్మరక్షణ శక్తులమై యున్నాము. మనుష్యుల మొక్క సమాలంభమనునది చూచినది లేదు. ఆ నీ వెట్లు మనుష్యులచే శంకరుని గూర్చి యజింప నిశ్చయించితవో కదా! సవర్ణుఁడగువాఁడు సవర్ణుని పశుసంజ్ఞఁగావింపఁ గూడునా? వృథామతియగు జరాసంధుఁడు

తప్ప యింకెవఁడిట్లాచరించును? ఏయేయవస్థయందెవఁడేదేది గావించునో యాయా యవస్థయందు వాఁడు తత్ఫలమును పొందువాఁడగును. ఆ మేమాయార్తుల ననుసరించువారమై వచ్చియున్నాము. ఆజ్ఞాతివృద్ధి నిమిత్తముగ మేము జ్ఞాతిక్షయకరుండవగు నిన్నుఁ జంపుటకిట వచ్చియున్నాము. మత్సదృశుఁడు క్షత్రియులందు లేడని తలంచితి వేదియో యదియే నీయొక్క పెద్దబుద్ధి విప్లవమైయున్నది. కులజాతుండగునే క్షత్రియుఁడు తన జన్మసందర్భమును తెలిసిన వాఁడెవ్వఁడతులమైన స్వర్గమును, అవ్యయమైన రణాంతరమునుఁ బొందువాఁడు కాకుండగలఁడు? స్వర్గమిట్లు వహించి రణాయజ్ఞ దీక్షితులగు క్షత్రియులు లోకవిజయమొందెదరనునది తెలియుము. మహద్బ్రహ్మ సర్వయోనియగును, అట్లే మహద్యశము స్వర్గయోని యగును. తపము, యుద్ధమరణము స్వర్గయోనియేయనునది యవ్యభిచారమైనది. గుణాన్వితుఁడగు నింద్రుఁడు సమాహితుఁడై యసురులను పరాజితులఁగావించి జగద్రక్షణమాచరించినాఁడు. అట్టి స్వర మార్గమగు విగ్రహమెవ్వఁడు గావింపకుండును? విపుల సైన్యసమేతుఁడవై, బలదర్పితుడవైయున్న నీ వితర రాజుల నవమానింపకుము. ప్రతి మనుజునందును విక్రమముండనేయున్నది. తేజమున నీకు సమానులు, మఱియు విశిష్టులు గలరంచు నెఱింగి ప్రవర్తింపుము. ఎంత వఱకు నీ యీ తలంపు వెల్లడికాలేదో యాంతవఱకే నీయాట సాగినది. మాకిది యోర్వరానిది కావున, రాజా! నే చెప్పునది వినుము. నీ వీ బుద్ధి విడిచి ప్రవర్తింపుము. మాగధ! మానము, దర్పము సదృశులందే, నీ విపుడు సుతామాత్యముగ, సబలముగ యమక్షయమునకుఁ బోవువాఁడవు కాకుము. నీతోడ యుద్ధమాడవచ్చియున్నవారము, మేమని మమ్మెఱుంగుము. మేము బ్రాహ్మణులముగాము, నిక్క-ము.

నేను శౌరిని (హృషీకేశుఁడను) నృవీరులు పాండవు లీయుభయులు, నిన్నాహ్వానించుచున్నాము. రాజా! స్థిరుండవై యుద్ధమునకు సంసిద్ధుఁడవుకమ్ము. నేచెప్పునది వినుము. రాజులను విడువనైన విడువుము. యమక్షయమునకైనా పొమ్ము' అని పలికెను. కృష్ణ వచనములు విని జరాసంధుఁడిట్లు పలికెను. 'జయింపని రాజు నెవ్వనిని నేఁ దెచ్చినది లేదు. అజితుండగు నరపతియిచ్చట లేఁడు. నేను జయించనట్టి రాజిక్కడ నెవ్వఁడున్నాఁడు? క్షత్రియున కీయుపజీవనము ధర్మమని చెప్పెదరు. విక్రమించి వశమొనరించుకొని యిష్ట ప్రవర్తనమాచరించుట ధర్మమేయగును. దేవతార్థముగ రాజులను బట్టి తెచ్చి కృష్ణ! యిపుడు భీతినొంది వారలనెట్లు విడువంగలను, క్షత్రవ్రతమును చింతించి నేనది యెట్లుగావించెదను?. సైన్యముతోడఁ గాని మిలోనొకనితో నొక్కండనుగాని, యిరువురితో నొకండను గాని, లేక మీముగ్వురతోనే నొకండనుగాని పోరాడెదను ఒకేమారుగా గాని, ఒకరికి పిమ్మట నొకరితోగాని పోరాడెదను? అని పలికెను. జరాసంధుఁడహంకారపూరితుఁడై భీమకర్ములగు కృష్ణభీమ ధనంజయులతోఁ బోరాడ నిశ్చయించెను. కుమారుఁడు సహదేవునకు పట్టాభిషేకముగావింపనాజ్ఞ గావించెను ఈ యుద్ధమిట్లా సన్నము కాఁగా జరాసంధుఁడపుడు తన సేనాపతిని స్మరించుకొనెను హంసడింభకులను నామమున లోక సత్కృతులగు కౌశిక చిత్రసేనులను స్మరించుకొనెను. శార్దూల సమవిక్రముఁడు, భీమ పరాక్రముఁడు, సత్యసంధుఁడు-జరాసంధుఁడు బ్రహ్మాజ్ఞానుసారము యాదవులకవధ్యుండగుట కృష్ణుఁడు వాఁడన్యనిర్దిష్టభాగుఁడని కార్యమిట్లు నిశ్చయించెను.)

జరాసంధుఁడు త్రివర్గప్రవర్తకుఁడు, క్షత్రి ధర్మప్రవర్తకుఁడయ్యె

ధర్మప్రవర్తకుఁడు కాఁడు. త్రివర్గమును కాల విభాగముగా నేర్పఱచి కావించినవాఁడు కాఁడు, పైఁగా క్షత్ర నిర్బంధ మొనరించినాఁడు. సత్యసంధుఁడయ్యు సత్ప్రవర్తకుండగుట లేదు, పైగా రుద్రుని రౌద్రముగా నారాధించువాఁడైనాఁడు బ్రాహ్మణ సత్కారము నాతఁడాచరించి ననునది పురుషార్థహేతువగుట లేదు అన్యాయప్రవర్తకుఁడు, బలోన్మత్తుఁడునగు నా జరాసంధుని మాయోపాయమునఁ దుదముట్టింప నెంచి నయ విధానజ్ఞుఁడగు కృష్ణుఁడు మారువేషమును ధరించినాఁడు. కృష్ణ భీమ ధనంజయులు బ్రాహ్మణ స్నాతకరూపధారులైరి. భూపతులను పశుపతికి పశుబలిగావించుట విశిష్టవిధానమని గర్వించి దురహంకార పూరితుఁడైయున్న జరాసంధునియొద్దకు వారట్లు విశేషనియమ చిహ్నితులుగాఁ బ్రవేశించిరి. ఇది సమీచీనమగు మార్గమని వారు నిశ్చయించిరి. స్వధర్మ నిరతిగా ప్రజాపాలన మొనరించుచున్న తన్ను సారథిగాఁ దలంచుట ప్రమాద హేతువయని జరాసంధుఁడనినందులకుఁ గృష్ణుఁడు తగు సమాధానమిచ్చినాఁడు. 'కులోద్వహుఁడు (ధర్మరాజు) కులకార్య ప్రవర్తకుఁడైయున్నాఁడు. ఆతని నియోగమున నిన్ను వధింప మేమెత్తి వచ్చితిమి' అని పలికినాఁడు. జరాసంధుఁడు సార్వభౌముఁడు కాఁడనియు ధర్మజుఁడే జగత్సార్వభౌముడఁనియు నాతనినియోగమున సాపరాధియగు నా జరాసంధుని దండింపవచ్చితిమనియు కృష్ణుఁడు మాటపలికినాఁడు. లోకవాసులగు క్షత్రియుల హరించి క్రూరముత్పాదించుటకంటె విపరీత ప్రవృత్తి యేమిగలదని నిలవదీసినాఁడు. శంకరునిగూర్చి రౌద్ర కర్మప్రవర్తకుఁడగుట కేవలము విపరీత చర్యయనియు, సవర్ణులను పశు సంజ్ఞఁగావించిన జరాసంధుఁడు వృథామతియనియుఁ బలికినాఁడు. 'ధర్మజునియజ్ఞ విధానమునకు జరాసంధుఁడు పశుభూతుఁడయినాఁడు. 'అట్లగుట వాని స్వయంకృతాపరాధము' అని కృష్ణుఁడుఁ జిత్రోక్త్యా

రణమూచరించినాఁడు. ధర్మయుద్ధమున నిన్నుఁదుదముట్టింప నయ
విధానమున మేము సన్నిహితులమైతిమి. జ్ఞాతిక్షయకరుఁడవగు నిన్ను
సంహరించుట కులరక్షణము, స్వర్గప్రదమగుచున్నది. రణయజ్ఞ
దీక్షితులగు క్షత్రియులు స్వర్గమొందెదరు. అని కృష్ణుఁడు పలికినాఁడు
విపుల సైన్యపరివారుఁడు, బాహుళ్య బలదర్పితుఁడునగు జరాసంధుఁడు
రాజులనెల్ల నవమానించుచు క్రొవ్వియున్నాఁడు. బల్లమాలిన గర్వమున
విఱ్ఱవీగుచున్న జరాసంధుఁడు వినఁదగిన ప్రసంగమిట్లాచరించి కృష్ణుఁడు
'మిడిసిపడకుము, వ్యక్తుడవైతివిఁక నుండవు' అని నిలవరించి పలికి,
అపుడు తమ్మెఱిగించినాఁడు. ''యుయుక్షమాణా స్త్వత్తోహినవయం
బ్రాహ్మణా' ధ్రువం' అనియు 'ముంచినా నృపతీన్ సర్వాన్ గచ్ఛ వా
త్వంయమక్షయం' అనియు పలికినాఁడు. విపరీత ప్రవర్తకుఁడా జరా
సంధుఁడు రాజులనట్లు బంధించుట క్షత్రధర్మము. దేవతార్థమగుఁదన
పూనిక 'శ్రేష్ఠమైనది' అని బదులు మాట పలికినాఁడు. 'ద్వాభ్యాంత్రి
భిర్వా యోత్స్యేఽహం యుగపత్పృథగేవవా' అని గర్వమాడినాఁడు
కుమారునకు పట్టాభిషేక మొనరింపనాజ్ఞ గావించుట, సేనానాయ
కుని జింతించుట, జరాసంధుని చరమదశను – వాని యాత్మ వినాశన
మును వెల్లడించుచున్నవి. బ్రహ్మజ్ఞను పురస్కరించుకొని నీతి
హేతువుగా నుపేక్షించియున్న జగద్రక్షకుండగు కృష్ణుఁడు జగత్సార్వ
భౌముఁడగు ధర్మజుని యోగముగా జరాసంధుని హతమార్ప నిశ్చ
యించెను.

వైశంపాయనః—

తతస్తం నిశ్చితాత్మానం యుద్ధాయ యదునందనః
ఉవాచ వాగ్మీరాజానం జరాసంధ మధోక్షజః ౨౩-౧

శ్రీ కృష్ణః :—

త్రయాణాం కేన తే రాజన్ యోద్ధుముత్సహతే మనః

అస్మా దన్యతమే నేహ సజ్జీభవతు కోయుధి ౨
ఏవముక్త స్స నృపతి ర్యుద్ధం వవ్రే మహాద్యుతిః

జరాసంధ స్తతో రాజాభీమసేనేన మాగధః ౩
ఆదాయరోచనాం మాల్యం మాంగళ్యాన్యపరాణిచ

ధారయన్నగదాన్ ముఖ్యాన్ నిర్వృతీ ర్వేదనానిచ ౪
ఉపతస్థే జరాసంధం యుయుత్సుం వై పురోహితః

కృతస్వస్త్యయనో రాజా బ్రాహ్మణేన యశస్వినా ౫
పమనహ్యా జరాసంధః క్షాత్రం ధర్మ మనువ్రతః

అవముచ్య కిరీటం స కేశాన్ సమనుగృహ్య చ ౬
ఉదతిష్ఠ జ్జరాసంధో వేలాతిగ ఇవార్ణవః

ఉవాచ మతిమాన్ రాజా భీమం భీమ పరాక్రమః ౭
భీమ యోత్స్యే త్వయా సార్ధం శ్రేయసా నిర్జితం వరం

ఏవముక్త్వా జరాసంధో భీమసేన మరిందమః ౮
ప్రత్యుద్యయౌ మహాతేజాశ్శక్రం బల ఇవాసురః

తతస్సం మంత్ర్య కృష్ణేన కృతస్వస్త్యయనో బలీ ౯
భీమసేనో జరాసంధ మాసయాద యుయుత్సయా

తతస్తౌ నరశార్దూలౌ బాహు శస్త్రౌ సమీయతుః ౧౦

వీరౌ పరమ సంహృష్టా వన్యోన్య జయ కాంక్షిణౌ ౧౧

అప్పుడు యుద్ధమునకు నిశ్చితాత్ముండగు నాజరాసంధు
చేతో వాగ్మియగు యదునందనుండిట్లు పలికెను. ఈ ముగ్గురి

దుయం దెవరితో యుద్ధమాడ నీకు తలంపుగలదు.? మాలో నెవ్వ సంసిద్ధుఁడు కావలెను? తెల్పుము' కృష్ణుఁడిట్లు పలుకగా జరాసంధుఁడు భీమునితోఁడ యుద్ధమాడ నిశ్చయించెను. అప్పుడు జరాసంధుని పురోహితుఁడు యుద్ధావసరవస్తువులు, మాంగళ్యమైన వస్తువులు గొని వచ్చెను. జరాసంధుఁడు బ్రాహ్మణాశీర్వాద మొంది, క్షాత్ర ధర్మమునుస్మరించి యుద్ధ సంసిద్ధుఁడాయెను. కిరీటమును తీసి జుట్టుసవరించుకొనెను. వేలాతిగ మహార్ణవ మట్లు జరాసంధుఁడు నిలిచియుండెను. భీమునిఁ జూచి 'భీమ యోత్స్యేత్వయా పార్థం శ్రేయసా నిర్జితం వరం' అని పలికె, దేవేంద్రు నెదిరించు బలాసురు వట్లు భీమసేను నెదుర్కొనెను. భీమసేనుఁడు కృష్ణునితో సంప్రతించి (సంమంత్ర్య) కృత స్వస్త్యయనుఁడై జరాసంధునితో యుద్ధ మాడ నెదుర్కొనెను. బాహుశస్త్రులగు నమ్మేటి వీరులు భీమ జరాసంధులు పరమ సంహృష్టులై యన్యోన్య జయకాంక్షులై యుద్ధమొనరించిరి.

తయో ర్యుద్ధం తయో ర్ద్రష్టుం సమేతాః పురవాసినః
బ్రాహ్మణా వణిజ శ్చైవ క్షత్రియాశ్చ సహస్రశః ౨౨
శూద్రాశ్చ నరశార్దూల స్త్రియో వృద్ధాశ్చ సర్వశః
నిరంతర మభూ త్తత్ర జనౌఘైరభి సంవృతమ్ ౩౨

అయ్యుద్ధమును జూడ పురవాసులు విచ్చేసిరి. బ్రాహ్మణులు, వనిజులు, క్షత్రియులు వేలకొలంది వచ్చిరి. శూద్రులు, స్త్రీలు, వృద్ధులు చూడవచ్చిరి. జనౌఘములు నిరంతరమై యుండెను. కార్తీక శుద్ధ ప్రతిపది మొదలు త్రయోదశి పర్యంతము భీమ జరాసంధుల యుద్ధమసనమానముగాజరిగినది.అనాహారముగ దివారాత్రములవిశ్రాంత ముగ జరిగినది చతుర్దశి రాత్రియందు జరాసంధుఁడు బడలికచే వెను కంబడెను అదిగాంచి కృష్ణుఁడు జరాసంధవధకది కాలమని హెచ్చరించెను. కృష్ణుని హెచ్చరికను తెలిసి జరాసంధుఁడు హీనరూపుఁడ

గుటc దిలకించి భీముcడు వానినిcదుదముట్టింప నిశ్చయించెను. అజితుc డగు జరాసంధుని జయింపవృకోదరుcడు సంరంభుcడగుచు వానినిబట్టి విపులమైన బుద్ధినొంది కృష్ణునితో నిట్లు పలికెను.

వైశంపాయనః :

నాయంపాపోమయాకృష్ణయుక్తస్స్యాదనురోధితుం
ప్రాయేనయదు శార్దూల ! బాంధవత్వయకృత్తవ ౨౪-౧
ఏనముక్తస్తతః కృష్ణః ప్రత్యువాచ వృకోదరం

త్వరయన్ పురుష వ్యాఘ్రో జరాసంధ వధేప్సయా 3
యత్తేదైవం పరం నత్వం యచ్ఛతే మాతరిశ్వనః

బలం భీమ జరానంధే ధర్శయాశు తదద్యవై ౪
ఏవముక్తస్తదా భీమో జరాసంథ మరిందమః

ఉత్ క్షిప్య భ్రామయామాస బలవంతం మహాబలః ౫
భ్రామయిత్వాశతగుణం జానుభ్యాం భరతర్షభ

బభంజపృష్ఠం సంక్షిప్య నిష్పిష్య వినినాదచ ౬
కరేగృహీత్వాచ రథం ద్వేధాచ క్రే మహాబలః

తస్యనిష్పిష్యమాణస్య పాండవస్యచ గర్జతః ౭
అభవత్తుములో నాద స్సర్వప్రాణి భయంకరః

వితేసుర్మాగధాస్సర్వే స్త్రీణాం గర్భాశ్చ సుస్రువుః ౮
భీమసేనస్య నాదేన జరాసంధస్య చైవహి

కిన్ను స్యాద్ధిమవాన్ భిన్నః కిన్ను స్విద్దీర్యతేమహీ ౯
ఇతివై మాగధా జజ్ఞుర్భీమసేనస్య నిస్స్వనాత్

తతో రాజకులద్వారి ప్రసుప్తమివ తం నృపమ్ ౧౦
రాత్రౌ గతాసు ముత్సృజ్య నిశ్చక్రిము రవిం దమాః

జరాసంధ రథం కృష్ణో యోజయిత్వా పతాకినమ్ ౧౧
ఆరోప్య భ్రాతరౌ చైవ మోక్షయామాస బాంధవాన్

తే వై రత్న భుజం కృష్ణం రత్నార్హాః పృథివీశ్వరాః ౧౨
రాజానశ్చక్రు రాసాద్య మోక్షితా మహతో భయాత్

అక్షత శ్శస్త్ర సంపన్నో జితారి స్సహ రాజభిః ౧౩
రథమాస్థాయ తం దివ్యం నిర్జగామ గిరివ్రజాత్ ౧౪

(స్వ బాంధవులను హింసించుచున్న ఈ పాపాత్ముఁడింక బ్రతికి యుండఁడు.' అని భీముఁడు పలికినది విని జరాసంధ వధను గోరి కృష్ణుఁడా భీముని త్వరచేయుచు నిట్లు బదులు పలికెను. పరమం బగు దైవము, వాయుసత్వమేది నీయందు గలదో యా బలమును వేగ జరాసంధునందుఁ జూపుము. అని పలికెను. అరిందమును భీముఁడపుడా జరాసంధుని పైకెత్తి గిరగిర త్రిప్పెను. బలవంతుఁడగు భీముడు బలవంతుఁడగు జరాసంధుని మూరు మార్లు గిరవాటువేసి మోకాళ్ళ నొక్కి పెట్టినడుము విఱిచి కాలు పట్టుకొని రెండుగా చీల్చి వేసెను. జరాసంధునిట్లు నుగ్గుగావించుచు గర్జించు నా భీముని తుములధ్వని సర్వప్రాణి భయంకరమై యుండెను. మాగదు లెల్లఱు వెఱపొందిరి. స్త్రీలకు గర్భస్రావమైనది. భీముని యట్ట హాసము జరాసంధుని కూత యట్లుండెను. భీమసేనుని సింహనాద మును విని "మా గధులు హిమవంతము భిన్నమైనదా, భూమి బ్రద్దలైనదా' యని తలంచిరి. గతాసుఁడై ప్రసుప్తునట్లు రాజ

కుల ద్వారమందు కూలియున్న యానృపుని-జరాసంధుని యచ్చటనే విడనాడి యరిందములగు నాముగ్గురు-కృష్ణ భీమ ధనంజయులట నుండి వెడలి పోయిరి. కృష్ణుడపుడు జరాసంధ రథమందు భీమార్జునుల నెక్కించెను. బాంధవుల నెల్ల బంధవిముక్తులఁగావించెను. అపుడు రత్నార్హులగు నాపృథివీశ్వరులు కృష్ణుని రత్నభూజుని గావించిరి. మహద్భయమునుండి విమోక్షితులైరి. అక్షయుఁడు, శస్త్రసంపన్నుఁడగు జితారి కృష్ణుఁడు నృపసహితుఁడై యా దివ్య రథమున గిరివ్రజమునుండి పైకి వచ్చెను. కృష్ణసారథి యపుడా రథమును నడిపెను. తారకామయ సంగ్రామమున నింద్రోపేంద్రు లీ రథమునందే యధిష్ఠించిరి. తొంబది తొమ్మిదిమంది దానవుల నింద్రుఁడీ రథము నుండియే సంహరించియుండెను. దివ్యమగు నా రథమును పొంది వారు ముగ్గురు పరమహర్ష మొందిరి. భీమార్జున సహితుఁడై రథస్థుఁడై యున్న కృష్ణుని జూచి మాగధులు విస్మితులైరి. వాయువేగముగల దివ్యహయములుఁ గల్గిన యా దివ్య రథమపుడు కృష్ణునిచే మిక్కిలి గా శోభించెను. కృష్ణుఁడు గరుత్మంతుని చింతింపఁగా క్షణకాలమున వచ్చి గరుడుఁ డు ధ్వజస్థుఁ డాయెను. గరుడ ధ్వజము నిర్నిరీక్ష్యమై యుండెను. పర్జన్య సమనిస్వనమగు నద్దివ్య రథ మధిష్ఠించి కృష్ణుఁడు భీమార్జునులతో గూడి వెడలి పోయెను. ఇంద్రుని వలన వసువునకు, వసువునలన బృహద్రథునకు, వాని వలన జరాసంధునకు క్రమముగా నా రథము సంక్రమించినది. పుండరీకేక్షణుఁడు గిరివ్రజమునుండి పైకివచ్చి సమదేశమును విడిచెను. పురవాసులు — బ్రాహ్మణ ప్రముఖులు విధి దృష్ట కర్మగా వానిని సత్కరింప నచ్చోటకు వచ్చిరి. బంధ విముక్తులగు రాజులు కృష్ణు నర్చించి స్తుతి పూర్వ వచనమిట్లు పలికిరి. "మహాబాహూ! నీయందిది చిత్రము

కాదు. బలోపేతులగు భీమార్జునులతోడ ధర్మ ప్రతిపాలనము గావించుట చిత్రము కాదు. జరాసంధుఁడను ఘోరహ్రదమందు, ఘోరమగు దుఃఖ పంకమందు మునింగియున్న రాజుల నుద్ధరించితివి. విష్ణూ! దారుణగిరి దుర్గమునందునుండి రాజుల నుద్ధరించిన యశోదీప్తి నీయందు వర్తించినది. మేమేమి గావింపవలెనది సెలవిమ్ము. ప్రణతులమగు మమ్ము శాసింపుము. దుష్కరమైన దైనది మాచేఁ గావింపఁబడినదేయని మమ్మనుమ్మ మట్లుగావించెదము అని పలికిరి. మహామనస్కుఁడగు నా హృషీకేశుఁ డారాజుల నోదార్చి యిట్లు పలికెను. " యుధిష్ఠిరుఁడు రాజసూయ మాచరింప నిశ్చయించియున్నాఁడు. ధర్మప్రవృత్తుఁడై పార్థివత్వమొంద దలంచి యున్నాడు. ఇది తెలిసి మీరంద ఱాతని కార్యమునకు సహాయులు కాఁదగినది'' అని పలికెను. రాజులు సుప్రీతమనస్కులై యట్లేయని యామాట నంగీకరించిరి. రాజులు కృష్ణుని రత్నభుజుని గావించిరి. కష్టమున గోవిందుఁడా సత్కృతులను కృపావిష్టుఁడై యంగీకరించెను.

జరాసంధాత్మజశ్చైవ సహదేవో మహామనాః
నిర్యయౌ సజనామాత్యః పురస్కృత్య పురోహితమ్ ౪౦

సనీచైః ప్రణతో భూత్వా బహురత్న పురోగమః
సహదేవో నృణాం దేవం వాసుదేవ ముపస్థితః ౪౧

భయార్తాయ తతస్తస్మై కృష్ణో దత్వాఽభయంతదా
ఆదదేఽస్య మహార్హాణి రత్నాని పురుషోత్తమః ౪౨

అభ్యషించత తత్రైవ జరాసంధాత్మజం ముదా
గత్వైకత్వంచ కృష్ణేన పార్థాభ్యాంచైవ సత్కృతః ౪౩

వివేశ రాజాద్యుతిమాన్ బార్హద్రథ పురం నృప!
అభిషిక్తో మహాబాహుర్జారాసంధి ర్మహాత్మభిః ౪౪

(జరాసంధుని కుమారుఁడు మహామనస్కుఁడు సహదేవుఁడు సజనామాత్యుఁడై పురోహిత పురస్కృతుఁడై పురమును వెలుపలకు వచ్చెను. బహురత్న పురోగముఁడై వాసుదేవుని సమీపించి నిలిచెను. భయార్తుఁడైయున్న యా సహదేవునకుఁ గృష్ణుఁడభయ మొసంగెను, అప్పురుషోత్తముఁడు సహదేవుని కానుకలను పరిగ్రహించెను. ఆ జరాసంధాత్మజు నచ్చటనే పట్టాభిషిక్తునిగా వింసెను. కృష్ణునిచేతను, పాండవులచేత సత్కృతుఁడై యభిషిక్తుఁడగు నా సహదేవుఁడు పురమును ప్రవేశించెను.)

జరాసంధుని కుమారుఁడుచిత వర్తనుఁడైనాఁడు. ఆ బాహ్య ప్రదేశమందే యా సహదేవుని బట్టాభిషిక్తునిఁ గావించి కృష్ణ భీమ ధనంజయులు పురమునకు బంపిరి. వధింప బడిన చోటనే పడియున్న జరాసంధునట్లే విడిచి, రాజులను బంధ విముక్తులనుగావించి కృష్ణ భీమ ధనంజయులు బాహ్య ప్రదేశమునకు వచ్చి నిలిచిరి. ఆనిలిచిన చోటనే సహదేవుని పట్టాభిషిక్తునిఁ గావించి పురమునకుఁ బంపిరి ఇది సందర్భోచితమైయున్నది. ఆ సహదేవుఁడొసంగిన కానుకలను గొని కృష్ణుఁడు పాండవులతోఁడ నింద్రప్రస్థమునకు వచ్చి ధర్మ రాజును సంప్రీతునిఁ గావించుచు నిట్లుపలికెను.

దిష్ట్యాభీమేన బలవాన్ జరాసంధో నిపాతితః
రాజానో మోక్షితాశ్చైవ బంధనాన్నృప సత్తమ ౪౭

దిష్ట్యా కుశలితా చేమౌ భీమసేన ధనంజయౌ
పున స్స్వనగరం ప్రాప్తా వక్షతా వితి భారత ౪౮

తతో యుధిష్ఠిరః కృష్ణం పూజయిత్వా యథార్హతః
భీమసేనార్జునౌ చైవ ప్రహృష్టః పరిషస్వజే ౪౯
తతః క్షీణే జరాసంధే భ్రాతృభ్యాం విహితం జయమ్
అజాతశత్రు రాసాద్య ముముదే భ్రాతృభి స్సహ ౫౦
యథావయ స్సమాగమ్య భ్రాతృభి స్సహ పాండవః
సత్కృత్య పూజయిత్వాచ విససర్జ నరాధిపాన్. ౫౧

'దైవవశమున జరాసంధుఁడు భీమునిచేఁ బతన మొందినాఁడు. రాజులు బంధవిముక్తులైరి. దైవవశమున భీమసేన ధనంజయులు కుశలముగా తిరిగి పురమును చేరుకొనినారు. అక్షతులై యిల్లు చేరినారు.' అని కృష్ణుఁడు పలికెను యుధిష్ఠిరుండు యథార్హముగాఁ గృష్ణునిఁ బూజించెను. భీమసేనార్జునుల నాలింగన మొనరించుకొనెను. జరాసంధుడు క్షీణమొందగా భ్రాతృవిజయ విహితమునుగాంచి యజాతశత్రుండనుజ సహితుఁడై మోదమొందెను. అనుజసహితుఁడై ధర్మరాజు రాజులను వయస్సును పురస్కరించుకొని గౌరవ మర్యాదల నొనరించెను. ఆ రాజులు హృష్టమనస్కులై స్వదేశములకు వెడలిపోయిరి. కృష్ణుఁడు బుద్ధిపూర్వకముగా నిట్లు పాండవులచే జరాసంధునిఁ దుదముట్టించి పిమ్మట స్వపురమునకు వెడలెను. ధర్మరాజు, కుంతి, ద్రౌపది, సుభద్ర, భీముఁడు, అర్జునుఁడు, నకుల సహదేవులు, ధౌమ్యుఁడు—వీరలతోఁ (బోయివచ్చెదనని) చెప్పి కృష్ణుఁడు వెడలెను. అపుడు యుధిష్ఠిరముఖులగుఁ బాండవులు కృష్ణునకుఁ బ్రదక్షిణ మొనరించి మరలివచ్చిరి. పాండవులిట్లు విపుల విజయమొంది, రాజులకభయమొసంగి, యశస్సంవర్ధితులైరి. ద్రౌపది తోడ పరమప్రీతి నొందిరి. ధర్మరాజు ధర్మకామార్థ సంహితమగుఁ బ్రజాపాలన కీర్తనముఁ గావించెను. ధర్మమార్గము నాచరించెను. (తత్ర రాజా ధర్మతశ్చక్రే ప్రజాపాలన కీర్తనం—౯౦).

ప్రభువు, రాజమాత, పట్టమహిషి, చెల్లెలు, ప్రభు సహోదరులు, పురోహితుడు-ఈ వరుసగా కృష్ణుడు మర్యాదను పాటించి ద్వారకకు పోయెను. లబ్ధ విజయులగు పాండవులు యశోవర్ధనులై పట్టమహిషి ద్రౌపదితోడ పరమమోదమొందిరి. ధర్మరాజు ధర్మముగా రాజ్యపాలన మొనరించుచుండెను.

పాండవ దిగ్విజయము

వైశంపాయనః :

* పార్థః ప్రాప్య ధనుః శ్రేష్ఠ మక్షయ్యౌచ మహేషుధీ
రథం ధ్వజం సభాంచైవ యుధిష్ఠిర మభాషత। ౨౮-౧

అర్జునః :

ధను రస్త్రం మహావీర్యం పక్షో భూమి ర్యశో బలమ్
ప్రాప్త మేత న్మయా రాజన్ దుష్ప్రాపం యద భీప్సితమ్ ౨

(అర్జునుడు (పార్థుడు) ధనుః శ్రేష్ఠమును, అక్షయతూణీరములను, రథమును, ధ్వజమును పొందియున్నాడు. ఆ యర్జునుడు యుధిష్ఠిరునితో "ధనుస్సు, అస్త్రము, పక్షము, భూమి, యశము, బలము ప్రాప్తించినవి. అభీప్సితమీడేర్పగల్గినవి. (కల్గగా) దుష్ప్రాపమింకేది గలదు? సర్వసిద్ధికా(గలదు (ప్రాప్తమేత న్మయా రాజన్ దుష్ప్రాపం యదభీప్సితం) ఇపుడు కోశపరివర్ధనము కృత్యమని తలంతును. రాజులెల్లఅనుండి కప్పములు గొనితెచ్చెదను. (తత్ర కృత్యమహాం మన్యే కోశస్య పరివర్ధనం) మంచి ముహూర్తమున ధనదపాలితమగు దిశకు వెడలెదను" అని పలికెను.)

---

* ఈ శ్లోకములు (౧౬-౨, వ) రెండు పర్యాయములు వ్రాయబడియుండుట చేతను-గానున్నది. ఇది విజయుని విజయయాత్ర నంతయేని పోషించుచుం బాండవ దిగ్విజయ యాత్రగాఁ బ్రోత్సాహమగుచున్నది.

ధనంజయుఁడిట్లు పలుకఁగా ధర్మరాజుఁడు స్నిగ్ధ గంభీరనాదమున "బ్రాహ్మణాశీర్వాదమొంది బయల్వెడలుము. † దుర్హృదుల కప్రహర్షము, సుహృదులకు సంతోషముగావింపుము; నీకు విజయము ధృవము, ప్రియకామమొందగలవు' అనెను. § అగ్నిదత్తమగు దివ్యరథమున నర్జునుఁడు బయల్వెడలెను. భీముఁడు, నకులుఁడు, సహదేవుఁడు ధర్మరాజునిచేఁ బ్రేరితులై బయల్వెడలిరి.

దిశం ధనపతే రిష్టా మజయ త్పాక శాసనిః ౯

భీమసేన స్తథా ప్రాచీం సహదేవస్తు దక్షిణాం
ప్రతీచీం నకులో రాజన్ దిశం వ్యజయ తాస్త్రవిత్ ౧౦

ఖాండవ ప్రస్థ మధ్యస్థో ధర్మరాజో యుధిష్ఠిరః
ఆసీత్ పరమయా లక్ష్మ్యా సుహృద్గణవృతః ప్రభుః ౧౧

(ఉత్తర దిక్కునకు నర్జునుఁడు, ప్రాగ్దిక్కునకు భీముఁడు, దక్షిణమునకు సహదేవుఁడు, పశ్చిమమునకు నకులుఁడు సైన్యసమేతులై బయలుదేరిరి. ఖాండవ ప్రస్థమధ్యస్థుఁడై-ధర్మరాజు— యుధిష్ఠిరుఁడు సుహృద్గణ వృతుఁడై శోభించియుండెను.)

---

†(స్వస్తి వాచ్యార్హతో విప్రాన్ ప్రయాహి భరతర్షభ!
దుర్హృదామ ప్రహర్షాయ, సుహృదాం నందనాయచ| ౭
విజయస్తే ధృవంపార్థ! ప్రియంకామ మవాప్స్యసి|
ఇత్యుక్త ప్రయయౌ పార్థ సైన్యేన మహతావృతః ౭

§ అగ్నిదత్తేనదివ్యేన రథేనాద్భుత కర్మణా|
తత్రైవ భీమసేనోఽపి యయయౌచ పురుషర్షభా| ౮
ససైన్యాం ప్రయయుస్సర్వే ధర్మరాజేన పూజితాః

పాండవ దిగ్విజయయాత్ర యిట్లు ప్రదక్షిణా కారముగా నిర్దేశింపఁబడినది. మఱియు సుహృద్గణవృతుఁడై ధర్మరాజు సామ్రాజ్యశ్రీతమున వెలుఁగొందుచుండెనని చకకఁగా నుల్లేఖింపఁబడినది.

అర్జునుఁడుత్తర కురుభూమి పర్యంతమగు నుత్తర దిక్కునెల్ల జయించి గొప్ప ధనరాసులను కొనివచ్చెను, భీముఁడు తూర్పు దిక్కును జయించెను, సహదేవుఁడు దక్షిణ దిక్కును జయించెను. నకులుఁడు పశ్చిమ దిక్కును జయించెను.

అర్జునుఁడు భగదత్తుని జయించెను. కొందఱు రాజులను సహాయముగాఁగొనుచు నిట్లుత్తర దిక్కునెల్ల సాధించెను. భీముఁడును జయించిన కొందఱు రాజులను సహాయులుగాఁగొనుచు ప్రాగ్దిశనెల్ల సాధించెను. శిశుపాలుని దేశమున నెలరోజులుండి సత్కృతుండాయెను. కర్ణుని జయించెను. సహదేవుఁడు కిష్కింధలో మైందద్వివిదులను నిర్జించెను మాహిష్మతీ పురాధీశుఁడు నీలునితో సహదేవునకు యుద్ధమాయెను. హవ్యవాహనుఁడా నీలునకు సహాయుఁడుగా నుండినందున నాసహదేవుని సైన్యమంతయు నపుడు ప్రదీప్తమై కానవచ్చెను.

తత స్సు సంభ్రాంతమ నాః బభూవ కురునందనః
నోత్తరం ప్రతివక్తుంచ శక్తో భూ జ్జనమేజయ 3౧—౨౬

సైన్య మట్లగ్ని పరీతమై యుండినందులకు సహదేవుఁడు సంభ్రాంత మనస్కుఁడాయెను, మాటాడుటకును నశక్తుండాయెను. శాస్త్రనిదానము గల సహదేవుఁడు అగ్ని కృత్యమునకు (దేవతా విషయకమగు నా పరిస్థితికి) ఉచిత వర్తనుఁడు కాదలంచినాఁడు.

అగ్నిహోత్రుఁడచ్చట పారదారికుఁడై యుండెను. (శ్రూయతేహి గృహీతో౽వై పురస్తాత్ పారదారికః ౨౭) అతీవశోభనము గల కుమార్తె యామాహిష్మతీశ్వరునకుఁ గలదు. తంప్రియానతి నక్కన్య యగ్నిహోత్రి సమక్షమున నుండెను. (సాగ్నిహోత్రము పాతిష్ఠద్బోధనాయ పితుస్సదా ౨౮ )

వ్యజనైర్ధూయమానో౽పి తన త్ప్రజ్వలతే నసః
యావచ్చారు పుటోష్ఠేన వాయునా నవిధూయతే ౩౦

అక్కన్య చారుపుటోష్ఠవాయువునగాని అగ్నిహోత్రుఁడచ్చట రాజకుండెను. (బ్రాహ్మణ రూపమున నగ్నిహోత్రుఁడా కన్యతోడ రమించుచుండెను. బ్రాహ్మణ రూపమున నుండినది అగ్నిహోత్రుండని తెలియని యారాజు విస్మితుండాయెను. శిరసా భూమి నంటి యగ్నిహోత్రుని బ్రార్థించెను. విప్రరూపుండై యున్న వహ్నికా కన్యనొసంగెను. విభావసుండా రాజుననుగ్రహించి వరమొసంగెను ఈ విషయమెఱుంగని రాజులానీలు నెదరింపరాగా వారి సైన్యములు వహ్నిదగ్ధమగుచుండెను. అచ్చటి స్త్రీలు యథేష్ట విహారులై చరింపఁ జొచ్చిరి. (స్వైరిణ్యస్తత్ర నార్యోహి యథేష్టం విచరంత్యుత ౩౮) అదిమొదలగ్నిహోత్రి భయమున, రాజులాపురమును వర్జించి యుండిరి.

సహదేవస్తు ధర్మాత్మా సైన్యం దృష్ట్వా భయార్దితం
పరీతమగ్నినా రాజన్ నాకంపతయథాచలః ౪౦
ఉపస్పృశ్య శుచిర్భూత్వా సో౽బ్రవీత్ పావకం తతః ౪౧

సహదేవః

త్వదర్థో౽యం సమారంభః కృష్ణ వర్త్మన్నమోస్తుతే
ముఖం త్వమసి దేవానాం యజ్ఞస్త్వమసి పావక ౪౨

పావనాత్పావకశ్చాసి వహనాద్ధవ్యవాహనః
వేదాస్త్వదర్థం జాతా వై జాతవేదాస్తతో హ్యసి ౪౩

చిత్రభానుస్సురేశశ్చ అనలస్త్వం విభావసో
స్వర్గద్వారస్పృశశ్చాపి హుతాశో జ్వలనశ్శిఖీ ౪౪

వైశ్వానరస్త్వం పింగేశః ప్లవంగో భూరితేజసః
కుమారసూస్త్వం భగవాన్ రుద్రగర్భో హిరణ్యకృత్ ౪౫

అగ్నిర్దదాతు మే తేజో వాయుః ప్రాణం దదాతు మే
పృథివీ బల మాదధ్యా చ్ఛివం చాపో దిశంతు మే ౪౬

అపాం గర్భ మహాసత్వ జాతవేద స్సురేశ్వర!
వేదానాం ముఖ మగ్నే త్వం సత్యేన విపునీహి మామ్ ౪౭

ఋషిభిః బ్రాహ్మణై శ్చైవ దైవతైరసురై రపి
నిత్యం సుహుతయజ్ఞేషు సత్యేన విపునీహి మామ్ ౪౮

ధూమకేతు శ్శిఖీ చ త్వం పాపహానిల సంభవః
సర్వ ప్రాణిషు నిత్యస్థ స్సత్యేన విపునీహి మామ్ ౪౯

ఏవం స్తుతో ఽసి భగవ౯ ప్రీతేన శుచినా మయా
తుష్టిం పుష్టిం శ్రుతిం చైవ ప్రీతిం చాగ్నే ప్రయచ్ఛమే ౫౦

వైశంపాయనః—

ఇత్యేవం మంత్ర మాగ్నేయం పఠన్ యో జుహుయాద్విభుం
బుద్ధిమాన్ సతతం దాంతః సర్వపాపైః ప్రముచ్యతే ౫౦

సహదేవః—

యజ్ఞవిఘ్నమిమం కర్తుం నార్హస్త్వం హవ్యవాహన!
ఏవముక్త్వాతు మాద్రేయః కుశైరాస్తీర్య మేదినీమ్ ౫౦

విధివత్పురుషవ్యాఘ్రః పావకం ప్రత్యుపావిశత్
ప్రముఖే తస్య సైన్యస్య భీతోద్విగ్నస్య భారత! ౫౧

నచైన మత్యగాద్వహ్ని ర్వేలామివ మహోదధిః
తముపేత్య శనైర్వహ్ని రువాచ కురునందనమ్ ౫౨
సహదేవం నృణాందేవం సాంత్వపూర్వమిదం వచః ౫౫

ఉత్తిష్ఠోత్తిష్ఠ కౌరవ్య జిజ్ఞాసేయం మయాకృతా
వేద్మి సర్వమభిప్రాయం తవ ధర్మసుతస్యచ ౫౬
మయాతు రక్షితవ్యేయం పురీ భరత సత్తమ!
యావద్రాజ్ఞోహి నీలస్యకులే వంశధరా ఇతి ౫౭

ఈప్సితంతు కరిష్యామి మనసస్తవ పాండవ!
తత్ర ఉత్థాయ హృష్టాత్మా ప్రాంజలి శ్శిరసానతః ౫౮
పూజయామాస మాద్రేయః పావకం భరతర్షభ!
పావకే వినివృత్తేతు నీలో రాజాభ్యగాత్తదా ౫౯
పావకస్యాజ్ఞయాచైన మర్చయామాస పార్థివః
సత్కారేణ నరవ్యాఘ్రం సహదేవం యుధాం పతిమ్ ౬౦
ప్రతిగృహ్యచతాం పూజాం కరేచ వినివేశ్యచ
మాద్రీసుత స్తతః ప్రాయాద్విజయీ దక్షిణాం దిశమ్ ౬౧

(ధర్మాత్ముండగు సహదేవుండగ్నిపరీతమై భయార్దితమగు సైన్యమునుచూచి కంపించలేదు. శుచియై ప్రాణయామ మొనరించి యగ్నిహోత్రినుపాసించెను. ఈనిమిత్తముగనే యీ సమారంభ

మంతయు జరుగుచున్నది నీవు దేవతలకు ముఖము పావకుఁడా! నీవు యజ్ఞము పావనమునఁ బావకుఁడవు. వహనమున హవ్య వాహనుఁడవు నగుదువు. వేదములు నీనిమిత్తముగ నుద్భవించినవి కావున నీవు జాతవేదుండవయితివి ? సహదేవుఁడిట్లుగానగ్నినుపాసించెను. బహుస్తుతి గావించెను. (హవ్య వాహనుఁడా! యజ్ఞ విఘ్నమాచరింపఁదగవు అని' పలికి సహదేవుఁడు సమిత్రాసనుఁడై యుండెను భీతమైన సైన్యము ధ్యానమున సహదేవుఁడిట్లు హవ్యవాహను నుపాసింపఁగా సముద్రము ఒడ్డు నతిక్రమించనట్లగ్నిహోత్రుఁడు కురువందనుఁడగు సహదేవు నితో సాంత్వ పూర్వ వచనమిట్లు పలికెను " లేలెమ్ము ధర్మ సుతు నభిప్రాయ మెఱుంగుదు. ఈ రాజు యొక్క వంశము వారుండు నంతదాక నేనీపురమునఁ గాపాడవలసియున్నది నీమనోభీష్టమును కావించెదను ' అని పలికెను. అపుడు సహదేవుఁడు లేచి పావకు నర్చించెను. పావకుఁడంతర్ధానమొందిన పైని నీలుఁడు పావకాజ్ఞనుఁ గొని సహదేవు నర్చించి కప్పము చెల్లించెను. )

దేవత లొకొక్క కార్యమం దొకొక్క రూపమొంది ప్రవర్తించెదరు. వారి మూలరూపము యథాస్థితినే యుండునని తెలియవలెను. పావకుఁడు మాహిష్మతీ పురమందు బ్రాహ్మణ రూపమునఁ బ్రవర్తించెను. రాజదండనము వర్తింపని పరిస్థితిని గమనించి నీలుఁ డగ్నిహోత్రు నుపాసించెను. అప్పుడగ్నిహోత్రుఁ డనుగ్రహించి నీలునకు వంశపర్యంతమగు వరమొసంగి యాపుర మును శత్రువిషకంటకము గావించెను. నీలవంశమున్నంతవఱకకడి స్త్రీలు స్వైరవిహారముఁ గలవారైరి. అనగా నీలకన్యలట్లే యా పుర స్త్రీలుచిత ప్రవర్తనఁగల్గి స్వేచ్ఛగా విలసిల్లిరని యభిప్రాయము. అగ్నిరక్షితమైయున్న యాపరిస్థితిని గమనించి సహదేవుఁడు లోక పావకుఁడగు పావకుని నారాధించెను. ప్రాజ్ఞుఁడగు! సహదేవుఁడు

జ్ఞానదృష్టిఁ గల్గి లోకపావకునుపాసింపగా నపుడగ్నిహోత్రుఁడతిక్ర మించని యనుగ్రహము సహదేవుని యెడలఁగావించెను. నీలవర గౌరవ మునుఁగాపాడుచు పావకుఁడు సహదేవుఁ నీస్పితముఁగావించెను. అగ్నిహోత్రుఁ డంతర్ధానమైన పిమ్మట నీలుఁడు సహదేవు నర్చించి కానుక లొసంగెను. ఇట్లగుట సమీచీన మార్గ మగుచున్నది.

విభీషణుఁడు సహదేవునకు కానుకలు పంపెను. సహదేవుఁడి ట్లుగా దక్షిణ దిక్కునెల్ల జయించి మరలివచ్చెను. నకులుఁడు పశ్చిమ దిక్కును జయించెను. వాసుదేవునకు వర్తమాన మంపగా యాదవులతోడఁ గృష్ణుఁడు తచ్ఛాసనము నంగీకరించెను. మాతులుండగు శల్యుని నకులుఁడు ప్రీతి పూర్వముగ వశ మొనరించుకొనెను.

వైశంపాయనః :-

§ రక్షణాద్ధర్మ రాజస్య సత్యస్య పరిపాలనాత్
శత్రూణాం క్షపణాచ్చైవ స్వకర్మ నిరతాః ప్రజాః 33-౧

ధర్మరాజుయొక్క ధర్మరక్షణమున, సత్యపరిపాలనమున, శత్రువిజయమున, ప్రజలు స్వకర్మ నిరతులైయుండిరి. బలికర్మ చక్కగానుండినందున ధర్మానుశాసనమున ధర్మజుని రాష్ట్రమందు పర్జన్యుఁడునికామవర్షియాయెను. జనపదములు స్ఫీతమై యొప్పెను. సర్వారంభములు సుప్రవర్తములైనవి. గోరక్ష, కర్షణము, వాణిజ్యము - ఇవి రాజకర్మవలన విశేషించి యేర్పడెను దస్యులవలన వంచకులవలన, రాజవల్లభులవలన నికట్టులేక యుండెను, మృషావాక్కు-లేకుండెను. మఱియు నవర్షము, అతి వర్షము వ్యాధి పావకమూర్ఛనము - ఇవి లేక రాజ్యము మిగుల శోభించెను. రాజులు యథాస్థితిని కప్పములు చెల్లించి యనుకూలులైయుండిరి.

---

పరిగ్రహాన్న రేంద్రస్య భీమస్య పరిపాలనాత్
శత్రూణాం క్షపణాచ్చైవ భీభత్సోస్సవ్యసాచినః ౧౨-౧౦

కౌంతేయులు ముగ్గురి విషయమందు జెప్పబడిన విశేషములు ధర్మజునియందే యిచ్చోట సూచింపఁబడినది.

ధర్మైస్త్రై ర్ధనాగమై స్తస్య వవృధే నిచయో మహాన్
కర్తుం యస్య నశక్యేత క్షయో వర్షశతై రపి॥ ౭

స్వకోష్ఠస్య పరీమాణం కోశస్యచ మహీపతిః
విజ్ఞాయ రాజా కౌంతేయో యజ్ఞాయైవ మనోదధే ౮

ధర్మ మార్గమున ధనాగమమై ధర్మజుని కోశము పరిపూర్ణమై యుండెను. నూఱేండ్లు వెచ్చించినను గూడ తరుగనిదై యాధననిచయము విస్తారమై యొప్పియుండెను స్వకోష్ట పరిమాణమును, కోశసమృద్ధినిఁ గాంచి ధర్మజుఁడు యజ్ఞమందు మనస్సు నిల్పెను. సుహృదు లొట్టుగాను, వేఱువేఱుగను 'యజ్ఞకాల మిదిగావింపుము' అని యుచితమాడిరి

అథైవం బ్రువతా మేవం తేషా మభ్యాయయౌ హరిః
ఋషిః పురాణో వేదాత్మా దృశ్యశ్చైవ విజానతామ్ ౧౦

జగత స్తస్థుషాం శ్రేష్ఠః ప్రభవ శ్చావ్యయ శ్చహ
భూతభవ్య భవన్నాథః కేశవః కేశిసూదనః ౧౧

ఆ తఱి సమయమునకు కృష్ణుఁడే తెంచెను. గొప్ప ధనరాశులను గొనివచ్చెను.

౧౩ వ అధ్యాయమున రాజసూయ విషయకమగు నిర్ణయము, 33వ అధ్యాయమున యజ్ఞారంభ విషయము గలదు. పాండవులు, పరివారము-వీరలనిర్ణయము, కృష్ణుని రావించి ప్రస్తావించుట ౧౩వ అధ్యాయమందు గలదు. 33వ అధ్యాయమందు ధర్మరాజునందే సర్వము మూర్తీభవించి యున్నదనియు, పరివార సమ్మోద

సమయమునకే కృష్ణుఁడు విచ్చేసిన వాఁడనియు గలదు. ఈ రెండు అధ్యాయముల శ్లోకములన్నియు గమనించి విశేషమును గమనింపఁ దగియున్నది.

అసూర్య మివ సూర్యేణ నివాత మివ వాయునా
కృష్ణేన సముపేతేన జహృషే భారతం పురమ్ ౧౮

అసూర్యము సూర్యునివలన, నివాతము వాయువున వికసించి శోభించునట్లు కృష్ణాగమనమున నా పురము శోభించెను. ధర్మజుఁడు ఋత్విగనుజ సహితుఁడై కృష్ణునరించి యిట్లు మేల్మి మాటపలికెను.

యుధిష్ఠిరః-

త్వత్కృతే పృథివీ సర్వామద్వశే కృష్ణవర్తతే
ధనంచ బహు వార్ష్ణేయ త్వత్ప్రసాదా దుపార్జితమ్ ౧౯

సోఽహ మిచ్ఛామి తత్సర్వం విధివద్దేవకీసుత!
ఉపయోక్తుం ద్విజాగ్రేభ్యో హవ్యవాహేచ మాధవ! ౨౦

తదహం యష్టుమిచ్ఛామి దాశార్హ సహితస్త్వయా
అనుజైశ్చ మహాబాహో! తదనుజ్ఞాతు మర్హసి ౨౧

తద్దీక్షాపయ గోవింద! త్వమాత్మానం మహాభుజ!
త్వయీష్టవతి దాశార్హ నిసాస్మా భవితాహ్యహమ్ ౨౨

మాం వాప్యభ్యను జానీహి సహైభిరను జైర్విభో!
అనుజ్ఞాతస్త్వయా కృష్ణ! ప్రాప్నుయాం క్రతు ముత్తమమ్ ౨౩

వైశంపాయనః—

తం కృష్ణః ప్రత్యువాచేదం బహూక్త్వా గుణవిస్తరం
త్వమేవ రాజశార్దూల! సమ్రాడర్హో మహాక్రతుమ్ ౨౪

సంప్రాప్నుహి త్వయా ప్రాప్తే కృతకృత్యాస్తతో వయమ్
యజస్వాభీప్సితం యజ్ఞం మయి శ్రేయస్యవస్థితే ౨౫

నియుంక్ష్వ త్వం చ మాం కృత్యే సర్వం కర్తాస్మి తే వచః ౨౬

యుధిష్ఠిరః

సఫలః కృష్ణ సంకల్పస్సిద్ధిశ్చ నియతా మమ
యస్య మే త్వం హృషీకేశ! యథేప్సిత ముపస్థిత, ౨౭

అనుజ్ఞాతస్తు కృష్ణేన పాండవో భ్రాతృభి స్సహ
ఈజితుం రాజసూయేన సాధనా న్యుపచక్రమే ౨౮

(త్వత్కృపచేతముగా నీ పృథ్వియంతయు నావశమందు వర్తించియున్నది. నీ ప్రసాదమున బహు ధనమార్జింపబడినది. దీనిని బ్రాహ్మణ వినియోగ పూర్వకముగ నగ్నిహోత్రు నర్చింపఁదలంచు చున్నాను. నీతోడఁగూడి తమ్ములతోడ యజ్ఞమొనర్పఁ దలంచు నా కనుజ్ఞ నొసంగుము. స్వయమున నీవే దీక్ష వహింపుము. నీవు యజ్ఞవిధాన మొనరించిన నేను విపాపుఁడనయ్యెదను అనుజ సహితుఁడనగు నాకైన అనుజ్ఞ నొసంగుము'' అని ధర్మజుఁడు మేల్మి వచనమాడఁగాఁ గృష్ణుఁడు సరసమైన ప్రసంగ మొనరించెను. నీయందు గుణవిస్తరము విశేషించి గలదు. సమ్రాడర్హమగు క్రతువును నీవే యొనర్పఁదగు. నీవు దీని నొనరించిన మేము కృతకృత్యుల

మయ్యేదము. అభీప్సిత యజ్ఞ ప్రవర్తకుండ వగుముఁ- శ్రేయః స్థితిగా నన్ను నియోగింపుము. నీ వచన మంతయుఁ గావించెదను' అని పలికెను. ధర్మజుఁడు "సంకల్పము సఫలము, సిద్ధి నియతమైనది నాకు. నీవు యథేప్సితముగా నండ నుండుము, సర్వ మొందిన వాఁడనే యగుదును' అని పలికెను, కృష్ణానుమతిని ధర్మజుఁడు తమ్ములతోడ యజ్ఞసాధన కృత్యములందుఁ బ్రవర్తించెను. సహదేవుడు, మంత్రులు యజ్ఞ సంచారములను జాగ్రత్త పఱచిరి. ఇంద్రసేనుఁడు, విశోకుఁడు, పూరుఁడు అన్నాదుల విషయమై ప్రవర్తకులైరి.

సర్వ కామాశ్చ కార్యంతాం రసగంధ సమన్వితా,
మనోహరాః ప్రీతికరా ద్విజానాం కురుసత్తమ ! 3౨

"బ్రాహ్మణ తృప్తిని గావింపుము" అని ధర్మజుఁడు పలుకఁగా సహదేవుఁడు "అట్లే కావించితిని" అని ధర్మజునకు నివేదించెను.

తతో ద్వైపాయనో రాజ న్నృత్విజా స్సము పానయత్
వేదానివ మహాభాగాన్ సాక్షా న్మూర్తిమతో ద్విజాన్ ౩౪

స్వయం బ్రహ్మత్వ మకరోత్తస్య సత్యవతీ సుతః
ధనంజయానా మృషభ స్సుసామా సామగోఽభవత్ ౩౫

యాజ్ఞవల్క్యో బభూవాథ బ్రహ్మిష్ఠోఽధ్వర్యు సత్తమః
పైలో హోతా వసోః పుత్రో ధౌమ్యేన సహితోఽభవత్ ౩౬

ఏతేషాం శిష్యవర్గాశ్చ పుత్రాశ్చ భరతర్షభ !
బభూవు ర్హోత్రగా స్సర్వే వేదవేదాంగ పారగాః ౩౭

తేవాచయిత్వా పుణ్యాహ మూహయిత్వాచ తం విధిం
శాస్త్రోక్తం పూజయామాసుస్తదేవ యజనం మహమ్ ౭౮

(అంత ద్వైపాయనుండు శరీరధారులై వచ్చిన వేదములే యనఁదగు ద్విజులను ఋత్విజులుగాఁ గొనివచ్చెను. సత్యవతీ సుతుఁడు స్వయము బ్రహ్మత్వముఁ గావించెను. ధనంజయ శ్రేష్ఠుండు సుసాముండు సామగుఁడాయెను బ్రహిష్ఠుఁడు యాజ్ఞవల్క్యుండు అధ్వర్యుఁడాయెను. ధౌమ్యసహితుఁడై పైలుఁడు హోతయాయెను. వేదవేదాంగ పారగులగు వారి శిష్యవర్గము, పుత్రులు హోతృకులైరి. వారెల్లను పుణ్యాహ వాచనమొనరించి శాస్త్రోక్తముగా యజ్ఞ విధానమును నడిపిరి. శిల్పులు దేవగృహములను పోలిన విశాలవేశ్మములను నిర్మించిరి. నానా దేశములనుండి చాతుర్వర్ణ్య ప్రజలు యజ్ఞమున కాహ్వానింపఁబడిరి. బ్రాహ్మణులు యథాకాలమందు ధర్మరాజును రాజసూయ దీక్ష నొందించిరి. బ్రాహ్మణులు, భ్రాతలు, జ్ఞాతులు, సుహృదులు, సచివులు-వీరలతో ధర్మరాజపుడు యజ్ఞాయతనమున ప్రవేశించెను. నానా దేశ సమాగతులైన రాజులు యజ్ఞశాలను ప్రవేశించిరి. సర్వవిద్యా విష్ణాతులు వేదవేదాంగపారగులు నగు బ్రాహ్మణులు, నానా దేశములనుండి విచ్చేసిరి. బహ్వన్నాచ్ఛాదనమగు నివాసములు (బసలు) వారలకు ధర్మజుఁడేర్పఱచెను. సర్వర్తుగుణ సంపన్నమగు నాయావాసములందు బ్రాహ్మణులు బహుకథావిస్తార మొనర్చువారై యుండిరి. నటన ర్తకులను దిలకించుచుండిరి. బ్రాహ్మణ సంతర్పణ ముదితధ్వని యందనిశము వినవచ్చుచుండెను. 'వడ్డింపుడు వడ్డింపుడు, భుజింపుడు, భుజింపుడు' అను కోలహాలము నిత్యము ప్రవర్తించుచుండెను. అపుడు ధర్మరాజు బహుదానము లొనరించెను. త్రివిష్టపమందు దేవేంద్రునట్లు లోకైకవీరుడై విల

సిల్లిన ధర్మరాజుడు మిక్కిలిగా శోభించెను. రాజసూయ మత్యంతము వైభవముగాఁ బ్రవర్తిల్లెను.

అపుడు ధర్మరాజు హస్తినాపురమునకు నకులునిఁ బంపెను కౌరవులెల్లఱు యజ్ఞమునకు విచ్చేసిరి. సకల దిక్కులనుండిఁ రాజు లెల్లఱువచ్చిరి. యాదవులందఱువచ్చిరి. † బహుభక్ష్యాన్వితము, వృక్షశోభిత దీర్ఘికములు గల్గిన విడిదలు రాజులకెల్ల ధర్మరాజుడు కల్పించెను. అమరులచే నాకపృష్ఠ మట్లు ధర్మజుని యజనసదస్సు రాజులు, బ్రాహ్మణులు, మహర్షులచే మిక్కిలిగా శోభించెను.

భక్ష్యభోజ్యాధికారమందు దుశ్శాసనుని, బ్రాహ్మణ పరిగ్రహ మందశ్వత్థామను, రాజగౌరవమందు సంజయుని, కృతాకృత పరిజ్ఞానమందు భీష్మద్రోణులను, దక్షిణదానములందుఁగృపుని ధర్మ రాజు నియమించెను. బాహ్లీకుఁడు, ధృతరాష్ట్రుఁడు, సోమదత్తుఁడు,

---

† కైలాస శిఖర ప్రఖ్యాన్ మనోజ్ఞాన్ ద్రవ్యభూషితాన్ ,
సర్వత స్సంవృతా నుచ్చైః ప్రాకారై స్సుకృతై స్సితైః
౩౪-౨౧

సువర్ణజాల సంవీతాన్ మణికుట్టిమ భూషితాన్
సుఖారోహణ సోపానాన్ మహాసన పరిచ్ఛదాన్ ౨౨

స్రగ్దామ సమవచ్ఛన్నా నుత్తమాగరు గంధినః
హంసేందువర్ణ సదృశా నాయోజన సుదర్శనాన్ ౨౩

జయద్రథుఁడు -వీరు గౌరవ స్థానమందు వర్తించిరి. (స్వామిన స్తత్ర కేమి రే) * విదురుడు వ్యయకర్తగానుండెను. అర్ఘ్యాణములు కైకొనుటయందు దుర్యోధనుని ధర్మరాజు నియమించెను.

చరణక్షాళనే కృష్ణో బ్రాహ్మణానాం స్వయం హ్యభూత్
సర్వలోక సమావృత్తః పిప్రీషుః ఫలముత్తమమ్ 35-౧౧

ద్రష్టుకామ స్సభాం చైవ ధర్మరాజం యుధిష్ఠిరం
నకశ్చిదాహరత్తత్ర సహస్రావర మర్హ్యణమ్ ౧౨

రత్నైశ్చ బహుభిస్తత్ర ధర్మరాజ మవర్ధయత్
కథం తుమను కౌరవ్యో రత్నదానై స్సమాప్నుయాత్ ౧౩

యజ్ఞ మిత్యేవ రాజానః స్పర్ధమానా దదుర్ధనం
భవనైస్స విమానాగ్రై స్సోదర్కై ర్బల సంవృతైః ౧౪

లోకరాజ విమానైశ్చ బ్రాహ్మణావసథైస్సహ
కృతైరావసథైర్దివ్యైర్విమానప్రతిమైస్తథా ౧౫

* అసంబాధాన్ సమద్వారాన్ యుతానుచ్చావచైర్గుణైః
బహుధాతునిబద్ధాంగాన్ హిమవచ్ఛికరానివ ౨౫

విశ్రాంతాస్తే తతోఽపశ్యన్ భూమిపా భూరిదక్షిణం
వృతం సదస్యైర్బహుభిర్ధర్మరాజం యుధిష్ఠిరమ్ ౨౫

తత్సదః పార్థివైః కీర్ణం బ్రాహ్మణైశ్చ మహర్షిభిః
భ్రాజతేస్మతదారాజన్ నాకపృష్ఠం యథామరైః ౨౬

* కృత్త్వావ్యయకరస్త్వాసీ ద్విదుర స్సర్వధర్మవిత్
దుర్యోధన స్త్వ గాని ప్రతిజగ్రాహ సర్వశః ౨౫-౧౦

విచిత్రై రత్నవద్భిశ్చ బుద్ధ్యా పరమయాయుతైః
రాజభిశ్చసమావృత్తైః రతీవశ్రీ సమృద్ధిభిః ౧౬

అశోభత తతో రాజన్ కౌంతేయస్య మహాత్మనః
బుద్ధ్యాచ వరుణం దేవం స్పర్ధమానో యుధిష్ఠిరః ౧౭

షడగ్ని నాథ యజ్ఞేన సోయజద్దక్షిణావతా
సర్వాన్ జనాన్ సర్వకామైః సమృద్ధైస్సమతర్పయత్ ౧౮

అన్నవాన్ బహుభక్ష్యశ్చ భుక్తవ జ్జన సంవృతః
రత్నోపహార సంపన్నో బభూవ స సమాగమః ౧౯

ఇడాజ్య హోమాహుతిభి ర్మంత్ర శిక్షావిశారదైః
తస్మిన్ హిత తృపుర్దేవా స్తతే యజ్ఞే మహర్షిభిః ౨౦

యథా దేవా స్తథా విప్రా దక్షిణాన్న మహాధనైః
తతృపు స్సర్వ వర్ణాశ్చ తస్మిన్ యజ్ఞే ముదాన్వి తాః ౨౧

(విప్రపాద సేవయందుఁ గృష్ణుఁడు స్వయ మేర్పడెను, సర్వ లోక సమావృత్తుఁడై యుత్తమ ఫలమునుఁ గోరి కృష్ణుఁ డిట్లు వర్ణించెను. ధర్మ రాజు నాదివ్య సభయందు దర్శింప వచ్చిన వాఁడెల్ల సహస్రవరార్హణముఁ దెచ్చియుఁ డెను. యజ్ఞాభివృద్ధ్యర్థమగు గొప్ప కానుకలను స్పర్ధమానులై రాజులు గొనివచ్చి సమర్పించిరి. బ్రహ్మక్షత్ర సమాసమున సర్వసమృద్ధ మగు నావాసములు మిక్కిలిగా శోభించినవి. బుద్ధియందు వరుణుని స్పర్ధగావించువాఁడై యున్న ధర్మరాజు షడాగ్నిహోత్రయుక్తమగు నా రాజసూయ క్రతురాజమును దివ్యముగా నొనర్చెను. సర్వకామ సమృద్ధముగా

సర్వజనులు సంతృప్తులైరి. చకరాని భోజనము గావించినవాఁడే ప్రతివాఁడు. బహుభక్ష్యముగా, రత్నసంపన్నముగాఁ ప్రతివాఁడు సత్కరింపఁబడెను. మంత్రశిక్షావిశారదులగు మహర్షు లాచరించిన విధానమున నాయజ్ఞమందు దేవతలు సంతృప్తులైరి. దేవతలెట్లో యట్లే విప్రులును దక్షిణాన్న మహాధనములచే సంతృప్తులైరి. సర్వవర్ణములవారు ముదాన్వితులైరి. )

ధర్మజుని యజ్ఞవిధాన మత్యంతవైభవముగా దివ్యముగా నెఱవేరినది. దేవతలు మిగుల సంతసించిరి. తత్తుల్యముగా నెల్ల వారు ముదాన్వితులైరను చకరాని భావము నీయాఖరుశ్లోకము (౨౧వది) వెల్లడించుచున్నది. "తనకుచితమగు ఘన మర్యాద యేర్పడినది" అని ప్రతివాఁడునందు దలంచుకొనిరి, ముదాన్వితులైరి చివరవాని వఱకు సంతుష్టి యాయజ్ఞమందేర్పడినదని యీ యాఖరు శ్లోకము వెల్లడించుచున్నది.

## అర్ఘాభిహరణము.

వైశంపాయనః:—

తతోఽభిషేచనీ యేహ్ని బ్రాహ్మణా రాజభిస్సహ
అంతర్వేదీం ప్రవివిశు స్సత్కారార్హా మహర్షయః 3౬—౧

నారద ప్రముఖాస్తస్యా మంతర్వేదాం మహాత్మనః
సమాసీనా శ్శుశుభిరేసహా రాజర్షిభిస్తదా ౨

సమేతా బ్రహ్మభవనే దేవా దేవర్షయస్తథా
కర్మాంతర ముపాసంతో జజల్పు రమితౌజసః ౪

ఏవమేతన్న చాప్యేవమేవంచైత న్నచాన్యథా
ఇత్యూచుర్బ హావస్తత్రి వితండాంవై పరస్పరమ్ ౫

కృశానర్థాంస్తతః కేచి దకృశాంస్తత్రికుర్వతే
అకృశాంశ్చకృశాంశ్చకుర్హేతుభిశ్శాస్త్రనిశ్చయైః ౬

తత్రిమేధావినః కేచిదర్థ మన్యై రుదీరితం
విచిక్షిపుర్యథాశ్యేనా నభోగత మివామిషమ్ ౭

కేచిదర్మార్థ కుశలాః కేచి త్తత్రి మహావ్రితాః
రేమిరే కథయంతశ్చ సర్వ భాష్యవిదాం వరాః ౮

సావేదిర్వేద సంపన్నై ర్దేవద్విజ మహర్షిభిః
ఆబభాసే సమాకీర్ణా నక్షత్రైర్ద్యౌరి వాయతా ౯

నతస్యాం సన్నిధౌశూద్రిఃకశ్చి దాసీన్న చావ్రితీ
అంతర్వేద్యాం తదారాజన్ యుధిష్ఠిరని వేశనే

(అభిషేక దినమున రాజసహితులై బ్రాహ్మణులంతర్వేదినిఁ బ్రివేశించిరి. సతాంఠరార్షులగు మహర్షులాయాంతర్వేది నలంకరించిరి. నారద ప్రముఖులగు మహాత్ములు రాజర్షులతోడ నాశీనులై శోభించిరి. బ్రహ్మ భవనమున దేవతలు, దేవర్షులట్లా దివ్య సభ మిక్కిలి శోభించెను. కర్మాంతర కాలమును వినియోగించుకొని ‘ ఏవ మేత న్నచాప్యేవ మైవం చైతన్నచాన్యథా ’ (ఇది యిట్లే, మఱియొక విధముగానేరదు, ఇది యిట్లే, అన్యథా కానేరదు ) అనుచు పరస్పర మనేకులు వితండము లాడుచుండిరి. కొందఱు కృశమైన యర్థముల నకృశమొందించుచుండిరి. అట్లే కొందఱు కృశములను కృశమొనరించు చుండిరి. శాస్త్ర నిశ్చయమైన

హేతువులచే నిట్లు విద్వాంసులు శాస్త్రవాదము లొనరించుచుండిరి. నభోగతశ్యేనము లామిషము నట్లు మేధావులైన కొందఱు అన్యోదీరితార్థముల నెగురగొట్టు వారగుచుండిరి. ధర్మార్థ కుశలు లగువారు, మహావ్రతులు, మహాభాష్యవిదాంవరులగు విద్వాంసులు కొందఱాయంతర్వేదియందు బల్యప్రసంగములు గావించుచు నుత్సాహపూరితులై యొప్పిరి. (రేమిరే కథయంతశ్చ) ఆయంతర్వేది వేద సంపన్నులగు దేవద్విజ మహర్షులతో శోభించెను. సమాకీర్ణ నక్షత్రములచే నాకాశమట్లా సభ మిగుల శోభించెను.

విద్వన్మణులు వేదవిజ్ఞాన శాస్త్రప్రసంగ కోతూహల మిట్లుగా ధర్మరాజు సభయందు రంజల్లెను. అచ్చోట సనర్హుఁడగు వాఁడొకఁడును చేరలేదు.

తాంతు లక్ష్మీవతో లక్ష్మీం తదా యజ్ఞ విధానజాం
తుతోష నారదః పశ్యన్ ధర్మరాజస్య ధీమత ః ౧౭

అథచింతాం సమాపేదేసము నిర్మనుజాధిప !
నారదస్తుతదా పశ్యన్ సర్వక్షత్ర సమాగమమ్ ౧౧

సస్మారచ పురావృత్తాం కథాంతాం పురుషర్షభ !
అంశావతరణేయాసౌ బ్రహ్మణో భవనే భవత్ ౧౨

దేవానాం సంగమం తంతు విజ్ఞాయ కురునందన !
నారదః పుండరీకాక్షం సస్మార మనసా హరిమ్ ౧౩

సాక్షాత్ సవిబుధారిఘ్నః క్షేత్రే నారాయణోవిభుః
ప్రతిజ్ఞాం పాలయంశ్చేమాం జాతః పరపురం జయః ౧౪

సందిదేశ పురా మోఽసౌ విబుధాన్ భూతకృత్స్వయం
అన్యోన్య మభినిఘ్నంతః పునర్లోకాన వాప్స్యథ ! ౧౫

ఇతి నారాయణ శ్శంభు ర్భగవాన్ జగతః ప్రభుః
అదిశ్యవిబుధాన్! సర్వాన జాయత యదుక్షయే ౧౬

క్షితావంధక వృష్ణీనాం వంశేవంశ భృతాం వరః
పరయా శుశుభే లక్ష్మ్యా నక్షత్రాణా మివోడురాట్ ౧౭

యస్య బాహుబలం సేంద్రాస్సురాస్సర్వే హ్యుపాసతే
సోఽయం మానువవ న్నామ హరిరాస్తేఽరి మర్దనః ౧౮

అహోబత సముద్భూతం స్వయం భూర్యదిదం స్వయం
అదాస్యతి పునః క్షత్రమేవం బలసమన్వితం|| ౧౯

ఇత్యేతాం నారదశ్చింతాం చింతయామాస సర్వవిత్
హరిం నారాయణం జ్ఞాత్వా యజ్ఞైరిజ్యంత మీశ్వరమ్ ౨౦

తస్మిన్ ధర్మవిదాం శ్రేష్ఠోధర్మ రాజస్య ధీమతః
మహాధ్వరే మహాబుద్ధిస్తస్థౌ స బహుమానతః ౨౧

(ధర్మజుని యొక్క విధానజమైన యాశోభను, (తాంతు లక్ష్మ వతో లక్ష్మీం) తిలకించి నారదుఁడు మోద మొందెను అప్పుడు నారదుఁడిట్లు చింతించెను, సర్వ క్షత్ర సమాగమమును తిలకించి పూర్వ వృత్తాంతమును స్మరించుకొనెను. బ్రహ్మ భవనమందం శావతరణ విషయమును స్మరించుకొని నారదుఁడపుడు దేవతల యాసంగమమును (దేవతలు రాజలోకమందుద్భవించియున్న విషయ మును) తలంచి యచ్చోట రాజుల సంగమ మేర్పడినదని యెఱిఁగి

మనసా పుండరీకాక్షుని-హరిని స్మరించుకొనెను. ( సాక్షాత్ విబుధారిఘ్నుఁడగు నారాయణ విభుఁడు ప్రతిజ్ఞా పాలకుఁడై క్షత్రమందు (రాజవంశమందు ) పుట్టియున్నాఁడు. భూతకృత్తు పూర్వము విబుధులనుగూర్చి స్వయ మిట్లు పలికియున్నాఁడు-మీర లన్యోన్యము సంహరించుకొని మరల మీలోకములను చేరుఁడు-ఇట్లని యాదేశించి యా నారాయణుఁడు, శంభుడు, జగత్ప్రభువు యదుక్షయమందుద్భవించినాఁడు, నక్షత్రములందు ఉడురాట్ వలె మిగులశోభించుచున్నవాఁడు. ఎవని బాహుబలము నింద్రాది సురలెల్లను నుపాసించెదరో యా హరి-అరిమర్దనుడు ( కృష్ణుడు ) మనుజునట్లు వర్తించుచున్నాఁడు. అహో ! స్వయంభువుఁడు స్వయము బల సమన్వితమగు క్షత్రమును మరల పరిగ్రహించుచున్నాఁడు ( (క్షత్రక్షయ కృతీ పరివృద్ధః - ఆదాస్యతి పునః క్షత్రం ) నారదుఁడపుడే విషయమంతయు జింతించుకొనెను. సర్వజ్ఞుఁడగు నారదుఁడు కృష్ణుని నారాయణుడుఁగా, యజ్ఞార్చి తేశ్వరుడుగాఁ దెలిసికొని (గ్రహించి) ధర్మవిదాంశ్రేష్ఠుఁడగు ధర్మజుని మహాధ్వరమందు బహుమానితుఁడై యుండెను.)

అంతర్వేదియందు రాజుల సమాగమమేర్పడినది. రాజలోకమందు సురాసురులు పుట్టియున్నారు. అ రాజుల సమాగమమును దిలకించగనే నారదునకది దేవతల సమాగమమని జ్ఞప్తికి వచ్చినది. అసురులు రాజలోకమందుద్భవించి లోకమును కలగుండు గావించుచుండుటచే నారాయణా దేశానుసారము దేవతలును రాజలోకమందుద్భవించిరి. ఇట్లు క్షితియందుద్భవించిన దేవతలన్యోన్యము సంహరించుకొని (భూలోక కలహ విషయమిట్లాచరించి) మరల స్వస్థానములను జేరునట్టి పరిస్థితి యకఠరమైనది. ఇందువలన దేవతలు స్వస్థాన ప్రవ

ర్తకులగుట, అసురులు వినాశనమగుట జరుగనున్నది. నారాయణుని యీయాదేశమును జ్ఞప్తికిఁదెచ్చుకొని, యాదేవ సమాగమమందు మిగుల శోభించుచున్న కృష్ణునిఁ దిలకించి నారదుఁడు శ్రీకృష్ణుడు లోకక్షయ కర్త' కానున్నాఁడు అని నారదుఁడు తలంచుకొనెను. ధర్మరాజునితో యజ్ఞము చేయవలసినదని చెప్పియున్న నారదుఁడు తత్పర్యవసానము నట్లు గ్రహించి యంతర్వేదియందుండెను. ధర్మజుని యంతర్వేది 'దేవ ద్విజమహర్షిభిః అవభాసే' అని వ్యాసుఁడు చిత్రముగా రచించినాఁడు. దేవతలే రాజులుగానపుడా యంతర్వేదియందు నక్షత్రములట్లు శోభించుచున్నారు. దేవోత్తముఁడగుఁ గృష్ణుఁడు ఉడురాట్ వలె శోభించుచున్నాఁడు. కాఁగాసీరాజార్హణ విషయము దేవ సత్కారము గా శోభించుచు బరిణమించుచున్నదని ఫలితార్థము. దుర్మార్గులగు నసురులును రాజలోకమందే పుట్టి రాజులైరి. ఆ రాజులును నా సభాస్థలమందున్నారు. నారదుఁడు దేవాంశ సంభూతులగు రాజులను చూచి విషయగ్రహణ మొనరించుట గమనింపఁదగినది, నారదుని యుత్తమ ప్రవృత్తి నిది వ్యక్తీకరించుచున్నది. "సావేదిర్వేద సంప న్నైర్దేవద్విజ మహర్షిభిః" అనునదెంత సాభిప్రాయమో యజ్ఞె ఇతి నారాయణ శ్శంభు ర్భగవాన్ జగతః ప్రభుః ఆదిశ్య విబుధాన్ సర్వానజాయత యదుక్షయే" "అనునదియు సాభిప్రాయమే. ఇందలి "శంభుః, యదుక్షయే" "అనునవి గమనింపదగినవి. వేదవ్యాసుని రచనాచమత్కృతిని, అమృతరసము నివి వెల్లడించుచున్నవి. లోక క్షయ కర్తగా దేవ దేవు డపుడుద్భవించియున్నాఁడని గ్రహింపఁ దగినది.

అథభీష్మోఽబ్రవీద్రాజన్ ధర్మరాజం యుధిష్ఠిరమ్
క్రియతా మర్హణం రాజ్ఞాం యథార్హమితి భారత ! ౨౨

ఆచార్య మృత్విజం చైవ సంయజంచ యుధిష్ఠిర !
స్నాతకంచ ప్రియం ప్రాహు షడర్ఘ్యార్హా న్నృపం తథా ౨3

ఏతా నర్ఘ్యా నభిగతా నాహు స్సంవత్సరోషితాన్
త ఇమే కాలపూగస్య మహతోఽస్మాను పాగతాః ౧౫

ఏషామే కైకశో రాజన్నర్ఘ్య ఆనీయతా మితి
అథ చై షాం వరిష్ఠాయ సమర్థా యోపనీయతామ్ ౧౫

యుధిష్ఠిరః :—

కస్మై భవాన్ మన్యతేఽర్ఘ్య మేకస్మై కురునందన !
ఉపనీయమానం యుక్తంచ తన్మే బ్రూహిపితామహ ! ౨౬

వైశంపాయనః :—

తతో భీష్మశ్శాంతనవో బుద్ధ్యా నిశ్చిత్య వీర్యవాన్
వార్ష్ణేయం మన్యతే కృష్ణ మర్హణీయతమం భువి ౨౭

ఏష హ్యేషాం సమస్తానాం తేజో బలపరాక్రమైః
మధ్యే తపన్నివాభాతి జ్యోతిషా మివభాస్కరః ౨౮

అసూర్య మివ సూర్యేణ నిర్వాత ఇవ వాయునా
భాసితం హ్లాదితం చైవ కృష్ణే నేదం సదోహినః ౨౯

తస్మై భీష్మాభ్యనుజ్ఞాత స్సహదేవః ప్రతాపవాన్
ఉపజహ్రేఽథ విధివద్వార్ష్ణేయా యార్ఘ్యముత్తమమ్ 3౦

ప్రతిజగ్రాహ తత్కృష్ణశ్శాస్త్రదృష్టేన కర్మణా
శిశుపాలస్తు తాంపూజాం వాసుదేవే నచక్షమే 30

సఉపాలభ్య భీష్మంచ ధర్మరాజంచ సంసది
అనాక్షిప ద్వాసుదేవం చేదిరాజో మహాబలః 31

(అపుడు భీష్ముఁడు ధర్మరాజుతో "రాజా! ర్హణమును యథార్థా ముగాఁగావింపుము. ఆచార్యుఁడు, ఋత్విజుఁడు, సంయుజుఁడు, స్నాతకుఁడు, ప్రియుఁడు, నృపుఁడు ఈ యార్గురు అర్ఘ్యార్హులగుదురు. ఇట్టివారు మహిమాన్వితులు నిందు విచ్చేసియున్నారు. (ఏతానర్ఘ్యానభిగతా నాహుస్సంవత్సరోషితాన్) అందొకరొక్కరికి నర్ఘ్య మొసంగఁదగినది. అందున వరిష్ఠుఁడు, సమర్థుఁడునగువాని కర్ఘ్య మిపు డొసంగవలయును' అని పలికెను. ఏ యొకరిని కర్ఘ్య మొసంగుట యుక్తమోపి తాతమహా! తెల్పుము' అని ధర్మజుఁడనగా భీష్ముఁడు బుద్ధిచే నిశ్చయించి వార్ష్ణేయుఁడు కృష్ణుఁడు భువియందర్హణీయతముఁడని తలంచెను. తేజోబల పరాక్రమములచే రాజులందు భాస్కరుండు జ్యోతిస్సులందు వెలుగునట్లు కృష్ణుఁడు వెలుంగుచున్నాఁడు. అసూర్యము సూర్యునిచేతను, నిర్వాతము వాయువుచేతను భాసితము హ్లాదితమైనట్లు కృష్ణునిచే మన యీ సభయేర్పడియున్నది.' భీష్ముఁ డిట్లు నిశ్చయించి పలుకఁగా భీష్మానుమతిని ప్రతాపవంతుఁడగు సహదేవుఁడు విధివతు వార్ష్ణేయున కర్ఘ్య మొసంగెను. శాస్త్రవిహిత కర్మగా కృష్ణుఁడా యర్ఘ్యమును గైకొనెను. వాసుదేవు నందు జరిగిన యాపూజను శిశుపాలుఁడు సహింపలేఁడు. ఆసదస్సునందు భీష్ముని, ధర్మజుని సమీపించి (ఉపాలభ్య) యాచేది దేశాధిపతి శిశుపాలుఁడు వాసుదేవు నాక్షేపించెను.

విద్వాంసుల శాస్త్రచర్చ రమణీయముగా సదస్సునందుఁ బ్రవర్తించినది. రాజార్ఘ్యాణ విషయ మిపుడు రభసములోనికి దిగుచున్నది.

3గి అధ్యాయము ౧౭–౨౧ శ్లోకములు గమనించిన దేవతృప్తి, బ్రాహ్మణ సన్మానము జరిగినదని స్పష్టమగును. (షడగ్నినాథ యజ్ఞేన సోజయ ద్దక్షిణావతా, తస్మిన్ హితతృపుర్దేవాస్తే యజ్ఞే, మహర్షిభిః యథా దేవా స్తథా విప్రా దక్షిణాన్న మహాధనైః! తతృపుః. దేవతలు, మహర్షులు, విప్రవరులు నర్చింపఁబడిరి.) యజ్ఞమందు దేవతల నర్చించుట, ఋషి బ్రాహ్మణ సన్మానము నెరవేర్చుట ముగిసినవని తెల్లముకాఁగలదు. పిమ్మట రాజాన్నైణ విషయమేర్పడినదని తెలియవలెను. సర్వజనాధిపుల సమాగమమందు అర్చనీయతమునకు పూజఁగావించుట యను ప్రసక్తి కల్గినది. పాండవులు రాజశ్రేష్ఠునిగాఁ గృష్ణుని నిశ్చయించి భీష్మానుమతిని ముందుగా రాజార్ఘ్యాణముఁ గృష్ణునకుఁ గావించిరి. రాజ సంపత్తునందు పార్థివార్ఘ్యాణమునకుఁ గృష్ణుఁడర్హుఁడుకాఁడని శిశుపాలుఁ డిట్లాక్షేపించెను.

శిశుపాలః:–

నాయ మర్హతి వార్ష్ణేయస్తిష్ఠత్స్విహ మహాత్మసు
మహీపతిషు కౌరవ్య రాజవత్ పార్థివార్హణామ్ ౩౭.౧

నాయం యుక్త స్సమాచారః పాండవేషం మహాత్మసు
యత్కామాత్పుండరీకాక్షం పాండవార్చితవా నసి ౨

బాలాం యూయం సజానీధ్వం ధర్మసూక్ష్మో హి పాండవాః
అయంచ స్మృత్యతిక్రాంతో హ్యాపగేయోఽల్పదర్శనః 3

త్వాం దృష్ట్వా ధర్మయుక్తో హి కర్వాణః ప్రియకామ్యయా
భవ త్యభ్యధికం భీష్మలోకే ష్వవమత స్సతామ్ ౪

కథం హ్యరాజా దాశార్హో మధ్యే సర్వమహీక్షితాం
అర్హణా మర్హతి తథా యథాయుష్మాభి రర్చితః ౫

అథవా మన్యసే కృష్ణం స్థవిరం కురుపుంగవ!
వసుదేవేస్థితే వృద్ధే కథ మర్హతి తత్సుతః ౬

అథవా వాసుదేవోఽపి ప్రియకామో నువృత్తవాన్
ద్రుపదే తిష్ఠతి కథం మాధవోఽర్హతి పూజనమ్ ౭

ఆచార్యం మన్యసే కృష్ణ! మథవా కురునందన!
ద్రోణే తిష్ఠతి వార్ష్ణేయం కస్మా దర్చితవా నసి! ౮

ఋత్విజం మన్యసే కృష్ణ మథవా కురునందన!
ద్వైపాయనే స్థితే వృద్ధే కథం కృష్ణోర్చిత స్త్వయా ౯

భీష్మే శాంతనవే రాజన్స్థితే పురుష సత్తమే
స్వచ్ఛంద మృత్యుకే రాజ౯ కథం కృష్ణోఽర్చిత స్త్వయా ౧౦

అశ్వత్థామ్ని స్థితే వీరే సర్వశాస్త్రవిశారదే!
కథం కృష్ణ స్త్వయా రాజ న్నర్చితః కురునందన! ౧౧

దుర్యోధనేచ రాజేంద్రే స్థితే పురుష సత్తమే
కృపేచ భారతాచార్యే కథం కృష్ణ స్త్వయార్చితః ౧౨

ద్రుమం కింపురుషాచార్య మతిక్రమ్య త్వయార్చితః
భీష్మకే చైవ దుర్ధర్షే పాండవత్‌కృతలక్షణే ౧౩

నృపేచ రుక్మిణి శ్రేష్ఠే హేక్యకలవ్యే తథైనచ
శల్యే మద్రాధిపేచైవ కథం కృష్ణ స్త్వయార్చిత: ౧౪

అయంచ సర్వరాజ్ఞాంవై బలశ్లాఘీ మహాబలః
జామదగ్న్యస్య దయిత శ్శిష్యో విప్రస్య భారత! ౧౫

యేనాత్మబల మాశ్రిత్య రాజానో యుధి నిర్జితాః
తంచ కర్ణ మతిక్రమ్య కథం కష్ణ స్త్వయార్చితః ౧౬

నైన ఋత్వి జ్నచా చార్యో నరాజా మధుసూదనః
అర్చితశ్చ కురుశ్రేష్ఠ! కిమన్య త్ప్రియ కామ్యయా ౧౭

(మహాత్ములు మహీపతు లుండినచోట రాజునట్లు రాజార్హణమునకు వార్ష్ణేయుఁడు తగఁడు. పాండవులారిది యుక్త సమాచారము కాదు. పాండవుఁడు పుండరీకాక్షుని కామతః అర్చించెనను నని యుక్త విషయము కానేరదు. బాలురు మీరు, ధర్మసూక్ష్మము నెఱింగినవారు కారు, అతిక్రాంతుఁడగు నీ యాపగాసుతుఁడల్పదర్శుఁడగును. భీష్మ! నీ వంటి ధర్మయుక్తుఁడు ప్రియ కామార్థమగు నీ నిర్ణయముఁగావించుటకంటె సత్పురుషావమాన విషయ మింకేమి గలదు.? రాజే కాని దాశార్హుఁడు సర్వమహీశులనడుమ నర్హాణ

మునకుఁ దగునం చెట్లుగా మీరర్చించితిరి? (రాజార్హణమున కసలే తగఁడు, ఇంకే విధమునగూడ నర్హణార్హుఁడు కృష్ణుండు కానేరఁడు.) కృష్ణుఁడు స్థవిరుఁడని తలంచుచో వసుదేవు డుండగా వాని సుతుఁడెట్ల ర్హుఁడగును. ద్రుపదుఁడుండగా మాధవుఁడు ప్రియకాముఁడుగా నెట్లర్హుఁ డుకాగలఁడు ఆచార్యుఁడు ద్రోణుఁడుండగా వార్ష్ణేయు నెట్లర్చించితివి? వృద్ధుఁడు ద్వైపాయనుఁడుండగాఁ గృష్ణుఁడు ఋత్విజుఁడని యర్చించు టెట్లు? భీష్ముఁడు శాంతనవుఁడు పురుషసత్తముఁడు స్వచ్ఛందమృత్యువు ఈతఁడుండగా గృష్ణుఁడెట్లు నీచేనర్చింపఁబడినాఁడు? సర్వశాస్త్ర విశారదుఁడు వీరుఁ డశ్వత్థామయుండగా నీచేఁ గృష్ణుఁ డెట్లర్చింప బడినాఁడు. పురుషసత్తముఁడు రాజేంద్రుఁడు దుర్యోధనుఁడుండగా భారతాచార్యుఁడు కృపుఁడుండగా కృష్ణుఁడెట్లర్చింపఁబడినాఁడు. కింపురుషాచార్యుఁడు ద్రుమునతిక్రమించి కృష్ణుఁడు నీచేనెట్లర్చింప, బడినాఁడు. పాండునట్లు కృతలక్షణుఁడు భీష్మకుఁడు, నృపుఁడు రుక్మిణి శ్రేష్ఠుఁడు (రుక్మి) అట్లే ఏకలవ్యుఁడు, మద్రాధిపతి శల్యుఁడు నుండగా నీచేఁ గృష్ణుఁడెట్లర్చింపఁ బడినాఁడు. మఱియు నీతండు (కర్ణుఁడు) సర్వ రాజులందు బలశ్లాఘ్యుఁడు, మహాబలుఁడు పరశురామున కిష్టుఁడుఁ ఆ విప్రునకు శిష్యుడే కర్ణునతిక్రమించి కృష్ణుఁడెట్లు నీచే నర్చింపఁబడి నాఁడు. ఈ మధుసూధనుఁడు ఋత్విజుఁడుగాఁడు, ఆచార్యుఁడుగాఁడు, రాజుకాఁడు. అట్టి కృష్ణుఁడర్చింపఁబడుట ప్రియకామము కాక యేమగును అని శిశుపాలుఁ డాక్షేపించెను.

రాజులనెల్ల సమావేశపఱచి యాందు రాజేకాని కృష్ణునకు మహీపాలుర నడుమ పార్థివార్హణము గావించుట పాండవులకు యుక్తము కాదని శిశుపాలుఁడాక్షేపించినాఁడు, పాండవులని

బాలబుద్ధియని భీష్ముఁడల్ప దర్శకుడని విమర్శించినాఁడు. ఈ నిర్ణయము సత్పురుషావమానమని పలికినాఁడు. ప్రియకామమగు నీ చర్య మిగుల గర్హణీయమని పలికినాఁడు. ఏ విధమునఁగూడ కృష్ణునందు పూజార్హత్వ మా చోట లేదని తెల్పినాఁడు.

అర్ఘ్యమున కాఱువిధముల వారు అర్హులని భీష్ముఁడు సూచించి పలికినదిమొదలకించుచు శిశుపాలుఁడందు గృష్ణుఁడేవిధమున నర్చితుడుఁ గానేరఁడని తెల్పినాఁడు. ౧ ఆచార్యుఁడు ద్రోణుఁడగును ౨ ఋత్విజుఁడు ద్వైపాయనుఁడగును 3 సంజయుఁడు భీష్ముఁడగును. ౪ స్నాతకుఁడశ్వత్థామ యగును ౫ ప్రియులు కురువంశ శ్రేష్ఠుఁడు దుర్యోధనుఁడు, భారతాచార్యుఁడు కృపుఁడు నగుదురు ౬ నృపుఁడు ద్రుమఁడు, భీష్మకుఁడు, రుక్మి, ఏకలవ్యుఁడు శల్యుఁడు, కర్ణుఁడు వీరలగుదురు. రాజార్హణ సందర్భమందు గృష్ణునర్చించుట కేవలము వివేకవిహీనమే. కృష్ణునందే లక్షణము లేదు. అసలు కృష్ణుడర్ఘ్యానర్హుఁడని శిశుపాలుఁడభిప్రాయమును వ్యక్తీకరించినాఁడు. కృష్ణునర్చించినది తమయందెల్లవమాన హేతువగుచున్నది. శిశుపాలుఁడిట్లు వివరించినాఁడు.

అథవా భ్యర్చ నీయోఽయం యుష్మాకం మధు సూదనః|
కిం రాజభి రిహానీతై రవమానాయ భారత! ౧౮

వయంతు నభయా దస్య కౌంతేయస్య మహాత్మనః
ప్రయచ్ఛామః కరాన్ సర్వే నలోభాన్నచ సాంత్వ నాత్ ||
౧౯

అస్య ధర్మప్రవృత్తస్య పార్థి వత్వం చికీర్షతః
కరా నస్మై ప్రయచ్ఛామః సోఽయ మస్మా న్నమవ్యతే ౨౦

కి మన్య దవమానాద్ధి యదేనం రాజసంసది
అప్రాప్త లక్షణం కృష్ణ మర్ఘేణార్చితవా నసి ౨౧

అకస్మాద్ధర్మ పుత్రేస్య ధర్మాత్మేతి యశోగతం
కోహి ధర్మచ్యుతే పూజా మేవం యుక్తాం నియోజయేత్ ౨౨

యోయం వృష్ణి కులే జాతో రాజానం హతవాన్ పురా
జరాసంధం మహాత్మాన మన్యాయేన దురాత్మవాన్ ౨౩

అద్య ధర్మాత్మతా చైవ వ్యప కృష్టా యుధిష్ఠిరాత్
దర్శితం కృపణత్వంచ కృష్ణోర్ఘ్యస్య నివేదనాత్ ౨౪

యది భీతాశ్చ కౌంతేయాః కృపణాశ్చ తపస్వినః
నను త్వయాపి బోద్ధవ్యంయాం పూజాం మాధవార్హసి ౨౫

అథవా కృపణై రేతా ముపనీతాం జనార్దన!
పూజా మనర్హః కస్మాత్త్వ మభ్యను జ్ఞాతవా నసి ౨౬

అయుక్తా మాత్మన : పూజాంత్వంపున ర్బహుమన్యసే
హవిషః ప్రాప్య నిస్యందం ప్రాశితా శ్వేవ నిరనే ౨౭

న త్వయం పార్థివేంద్రాణా మవమానః ప్రయుజ్యతే
త్వా మేవకురవో వ్యక్తం ప్రలంభంతే జనార్దన! ౨౮

క్లీబే దారక్రియాయా దృగంధేవా రూపదర్శనం
అరాజ్ఞో రాజవత్పూజా తథా తే మధుసూదన ! ౨౯

దృష్టో యుధిష్ఠిరో రాజా దృష్టో భీష్మశ్చ యాదృశః
వాసుదేవో ష్వయం దృష్ట స్సర్వ మేత ద్యథా తథమ్ ౩౦

ఇత్యుక్త్వా శిశుపాల స్తానుత్థాయ పరమాసనాత్
నిర్యయౌ సదస స్తస్మాత్స హితో రాజభిస్తదా ౩౧

మీచే మధుసూదనుఁడే యర్చనీయుఁడగుచో రాజులను రప్పించుట యిది యేమి, అవమానముకొఱకు. మహాత్ముఁడగు కౌంతేయునకు మేము భయమునఁ గరమొసంగినవారముకాము. లోభమునగాదు, సాంత్వనమునఁగాదు. ధర్మ ప్రవృత్తిగ పార్థివత్వముఁగావించు నీతనికి కప్పముల నొసంగితిమి. ఈతఁడు మమ్ము పరిగణింపకున్నాఁడు ఈ కృత్యమవమానము కాక యింకేమగును? రాజ సంపత్తునందుఅప్రాప్త లక్షణునిఁ గృష్ణు నర్చించితివి. ఆకస్మాత్తుగా ధర్మపుత్రునకు ధర్మాత్ముఁడగునట్టి యశము గతమైనది. (యశోగతం) ఎవడిట్టి ధర్మచ్యుతి యందిట్టి సత్కారము యుక్తమంచు నిరోగించునుగదా. ఈ దురాత్ముఁడు (కృష్ణుఁడు) రాజు మహాత్ముఁడా జరాసంధుని అన్యాయముగ వధించినాఁడు. ఇపుడు యుధిష్ఠిరుని నుండి ధర్మత్వమనునది వ్యపకృష్ణమైనది. కృష్ణార్ఘ్య నివేదనమునఁ గృపణత్వము దర్శితమైనది. భీతులు, కృపణులు, తాపసులు నగుదురుగాక కౌంతేయులు, మాధవ! ( కృష్ణ! ) నీ వెట్టి పూజ కర్హుఁడవో యది నీ చేతనే బోధింపఁబడి యుండవలెగదా! (నీవే చెప్పవలసినవా వాఁడగుదువు కదా!) అథవా, కృపణులగు వారు గొని తెచ్చిన యీ యీ పూజనందు కనర్హుండవగు నీ వెందు నిమిత్తమది సమ్మతించి నాఁడవో కదా. అయుక్తమగు వట్టి నీ యాత్మ సత్కారమును నీవు బహుమానించు చుంటివి కదా! ఇయ్యది పార్థివేంద్రుల యవమానమునకై ప్రయుక్తము కాదు. నీ యందే యిది ప్రలంభమగుచున్నదని వ్యక్తమగుచున్నది. షండునందు దార క్రియయట్లు, అంధునందు రూప దర్శనమట్లు, అరాజ్ఞుండవగు నీయందు రాజునట్లు నడచిన యీ పూజ యట్లున్నది. ఆహా! యుధిష్ఠిరుండు తెలియంబడియె భీష్ముఁ డెట్టివాఁడో యదియుఁ దెలియనయ్యె. ఈ

వాసుదేవుడును దెలియంబడియె, అంతయు యథా తథముగా నున్నది. ఇట్లని పలికి శిశుపాలుడు పరమాసనమునుండి లేచిపోయి రాజుల తోడ గూడ సభనుండి నిష్క్రమించెను.)

ఎట్టి యోగ్యతయు లేని కృష్ణునర్చించి రాజులకెల్ల యవమానము గల్గించిరి పాండవులు, భీష్ముండు అని శిశుపాలుడాక్షేపించినాడు. ఇందువలన భీష్ముడల్ప దర్శకుడని, పాండవులు బాల బుద్ధిగలవారని తూలనాడినాడు. అనర్హుడనని తెల్పగా గృష్ణుడా సత్కారమును స్వీకరించినందులకు గృష్ణుని నిందించినాడు. రాజుగాని కృష్ణుడు రాజయిన జరాసంధునన్యాయమున జంపిన దురాత్ముడనినాడు శిశుపాలుడిట్లు పలుమాటలాడి అయుక్తులకు గొందఱు రాజుల తోడ దిగ్గనిలేచి సభనుండి వెడలువాడాయెను.

తతో యుధిష్ఠిరో రాజా శిశుపాల ముపాద్రవత్
ఉవాచచైవ మధురం సాంత్వపూర్వ మిదం వచః 36-౧

నేదం యుక్తం మహీపాల యాదృశం వైత్వ ముక్తవాన్
అధర్మశ్చ పరోరాజన్ పారుష్యంచ నిరర్థకమ్ ౨

నహి ధర్మం పరంజాతు నావబుధ్యేత పార్థివః
భీష్మశ్శాంతన నస్త్వేనం మావమంస్థాస్త్వ మన్యథా ౩

పశ్య చైతాన్ మహీపాలాం స్త్వత్తో వృద్ధతరాన్ బహూన్
మృష్యంతే చార్హణాం కృష్ణే తద్వత్త్వంక్షంతు మర్హసి ౪

వేద తత్త్వేన కృష్ణంహి భీష్మశ్చేదిపతే భృశం
నహ్యేనంత్వం తథానేత్థ యథైనం వేద కౌరవః ౫

భీష్మః

నాస్మై దేయో హ్యానునయో నాయమర్హతి సాంత్వనం
లోకవృద్ధతమే కృష్ణే యోఽర్హాణాం నాభిమన్యతే ౬

క్షత్రియః క్షత్రియం జిత్వా రణేరణ కృతాం నరః
యోముంచతి వశే కృత్వా గురుర్భవతి తస్యసః ౭

అస్యాంహి సమితౌ రాజ్ఞా మేకమప్యజితం యుధి
నపశ్యామి మహీపాలం సాత్వతీ పుత్ర తేజసా ౮

నహి కేవల మస్మాకంమయ మర్చతమోఽచ్యుతః
త్రయాణామపి లోకానా మర్చనీయో మహాభుజః ౯

కృష్ణే నహిజితా యుద్ధేబహవః క్షత్రియర్షభాః
జగత్సర్వంచ వార్ష్ణేయేనిఖిలేన ప్రతిష్ఠితమ్ ౧౦

తస్మాత్సత్స్వపి వృద్ధేషు కృష్ణ మర్చామి నేతరాన్
ఏవం వక్తుం నాచార్హస్త్వం మాభూత్తె బుద్ధిరీదృశే ౧౧

జ్ఞానవృద్ధ మయారాజన్ బహవః పర్యుపాసితాః
తేషాం కథాయతాం శౌరేరహం గుణవతో గుణాన్ ౧౨

సమాగతానా మశ్రౌషం బహూన్ బహుమతాన్ సతామ్
కర్మాణ్యపి హియాన్యస్య జన్మ ప్రభృతి ధీమతః ౧౩

బహుశః కథ్యమానాని నరైర్భూయః శ్రుతాని మే
న కేవలం నయం కామాచ్చేది రాజ జనార్దనమ్ ౧౪

నసంబంధం పురస్కృత్య కృతార్థంవా కథంచన
అర్చ్యామహేఽర్చితం సద్భిర్భువి భూతసుఖావహమ్ ౧౫

యశశ్శౌర్యం జయం చాస్య విజ్ఞాయార్చాం ప్రయుజ్మహే
నచకశ్చిదిహాస్మాభిస్సు బాలోఽస్య పరీక్షితః ౧౬

గుణైర్వృద్ధా నతిక్రమ్యహరి రర్చ్యతమో మతః
జ్ఞానవృద్ధో ద్విజాతీనాం క్షత్రియాణాం బలాధికః ౧౭

వైశ్యానాం ధాన్యధనవాన్ శూద్రాణామేవ జన్మతః
పూజ్యతాయాంచ గోవిందే హేతూ ద్వావపి సంస్థితౌ ౧౮

వేదవేదాంగ విజ్ఞానం బలంచా ప్యధికం తథా
నృణాం లోకేహికోఽన్యోఽస్తి విశిష్టః కేశవాదృతే ౧౯

దానం దాక్ష్యం శ్రుతం శౌర్యం హ్రీః కీర్తిర్బుద్ధిరుత్తమా
సన్నతిః శ్రీర్ధృతిస్తుష్టిః పుష్టిశ్చ నియతాచ్యుతే ౨౦

తమిమం లోకసంపన్న మాచార్యం పితరం గురుం
అర్ఘ్య మర్చిత మర్చార్హం సర్వే సంక్షంతు మర్హథ ౨౧

ఋత్విగ్గురు ర్వివాహ్యశ్చ స్నాతకో నృపతిః ప్రియః
సర్వమేతదృషీకేశ స్తస్మా దభ్యర్చితోఽచ్యుతః ౨౨

కృష్ణఏవహి లోకానా ముత్పత్తిరసి చావ్యయః
కృష్ణస్యహికృతే విశ్వమిదం భూతం చరాచరమ్ ౨౩

ఏష ప్రకృతిరవ్యక్తా కర్తాచైవ సనాతనః
పరశ్చ సర్వ భూతేభ్య స్తస్మాత్పూజ్యతమోఽచ్యుతః ౨౪

బుద్ధిర్మనో మహాద్వాయుస్తేజోంభః ఖంమహీచయా
చతుర్విధంచ యద్భూతం సర్వం కృష్ణే ప్రతిష్ఠితమ్ ౨౫

ఆదిత్య శ్చంద్రమా శ్చైవ నక్షత్రాణి గ్రహాశ్చయే
దిశశ్చ విదిశశ్చైవ సర్వం కృష్ణే ప్రతిష్ఠితమ్ ౨౬

అగ్నిహోత్రముఖావేదా గాయత్రీచ్ఛందసాం ముఖం
రాజాముఖాం మనుష్యాణాం నదీనాం సాగరో ముఖమ్ ౨౭

నక్షత్రాణాం ముఖం చంద్ర ఆదిత్యస్తేజ సాంముఖం
పర్వతానాం ముఖంమేరు ర్గరుడః పతతాం ముఖమ్ ౨౮

ఊర్ధ్వం తిర్యగధశ్చైవ యావతీ జగతీ గతిః
సదేవకేషు లోకేషు భగవాన్ కేశవో ముఖమ్ ౨౯

( ధర్మరాజపుడు శిశుపాలుని సమీపించి ( ఉపాదవత్ ) మధురముగా సాంత్వపూర్వక వచనమిట్లు పలికెను. మహీపాల! యీ నీ వచనము అయుక్తమైనది, రాజా! మఱియు నధర్మము, నిరర్థక పారుష్యమగునిది. భీష్ముడెఱింగినట్లు పార్థివుఁడు నెంఱింగిన వాఁడుకాఁడు. నీవాతని నన్యథా యవమానింపవలదు. నీకన్న వృద్ధతరులగు పెక్కు మహీపాలురనుఁ దిలకించుము, వారలందఱు కృష్ణునందలి యీయర్ఘ్యణమునకు సమ్మతించియున్న వారట్లే నీవు నంగీకరింపవలయును. శిశుపాలా! కృష్ణుని యథార్థముగా దెలిసియున్న వాఁడు భీష్ముఁడతఁడెఱింగియున్నట్లు నీవు తెలిసినవాడవుకావు' అని పలికెను. భీష్ముఁడిట్లు పలికెను. 'వీనియందనునయమువలదు, సాంత్వ

నమునకర్హుండు కాఁడు, లోక వృద్ధతముండగుఁ గృష్ణునందలి యర్హాణ మంగీకరింపకున్న వాఁడుకదా. క్షత్రియుఁడే క్షత్రియుని రణమందు నిర్జించి వశ్యమందుంచుకొనునో (ముంచతి) యాతఁడు వానికి గురువ గును. ఈ సమితి యందొక్క రాజుగూడ సాత్వతీపుత్ర తేజస్సునకు సంగ్రామమం దజితుఁడు కానిమహీపాలుని నేనుచూడ లేదు అచ్యుతుఁ డు కేవలముమనకు మాత్రమే యర్చితతముండు గాడింక మూఁడులోక ములకుఁగూడ సర్వసీయుండే అనేకులు క్షత్రియర్షభులు కృష్ణునిచే యుద్ధమందు జితులైయున్నారు జగత్సర్వము వార్ష్ణేయునందఖిలము ప్రతిష్ఠితమై యున్నది. అందువలన వృద్ధులుండినను సంకెవ్వరినిగాకఁ గృష్ణునే యర్చించితిమి. నీవిట్లు పలుకుట తగదు, నీ బుద్ధియిట్టిది కాకూడదు. జ్ఞానవృద్ధులగువారి ననేకుల నుపాసించియున్నాను. ఆ గుణవంతులవలన ననేక పర్యాయములనేకములగు శౌరి గుణ ములు వర్ణింపఁబడుట వినియున్నాను. జన్మప్రభృతి కృష్ణుఁడా చరించిన కర్మలకు పలుమాఱుగాఁ జెప్పుకొను నరుల ప్రశంసల నెన్నియో నెక్కువగా నేను వినియున్నవాఁడను, శిశుపాల! జనార్దనుని మేము కేవలము కోరి యర్చించియుంటిమని తలంపకుము, సంబంధ మును బురస్కరించుకొనికాని, కృతార్థవిషయముగాఁగాని మేమర్చించి తిమంచు తలంపకుము. లోకమందు భూతసుఖావహుండై యున్న సత్పురుషార్చితుని, మేమర్చించినామని తెలియుము. ఈతని యశము, శౌర్యము, జయము దెలిసి మేమీతని నర్చింప నిశ్చ యించితిమి. ఇట చేరిన వారిని సుబాలునిగూడ మేము పరీక్షగావిం పని వాఁడు లేఁడని నీవెఱుంగుము. గుణవృద్ధుల నతిక్రమించి హరి

యర్చితతముండనియే మా నిశ్చయము (మతం) ద్విజాతులందు జ్ఞానవృద్ధుడు, క్షత్రియులందు బలాధికుడు, వైశ్యులందు ధాన్య ధనవంతుడు, శూద్రుడు జన్మతః పూజనీయులగుదురు. గోవిందు నర్చించుటయందు రెండు హేతువులు సిద్ధమైయున్నవి. వేదవేదాంగ విజ్ఞానమునట్లే యధికబలము—ఈ రెంటియందీ లోకమందెల్ల కేశవుండు గాక వేఱొకం డెవ్వాఁడు విశిష్టుండు గలడు. దానము, దాక్ష్యము, శ్రుతము, శౌర్యము, హ్రీ, కీర్తి, ఆనుత్తమమగు బుద్ధి సన్నతి, శ్రీధృతి, తుష్టి, పుష్టి ఆచ్యుతునందు నియతమైయున్నవి అట్టియా లోకసంపన్నుడు, ఆచార్యుఁడు, పిత, గురుడు అర్చ్యార్హుండగు నగు నచ్యుతుఁడర్చింపబడినాఁడని యెఱింగి యందఱుఁగీ కృతులు కాదగి నది. షడర్ఘ్యగుణ సమన్వితుండు కృష్ణుండు - ఇతఁడే ఋత్విజుఁడు, గురుఁడు, వివాహ్యుఁడు, స్నాతకుఁడు, నృపతి, ప్రియుఁడు సర్వము హృషీకేశుఁడేయగును, అందువలన నచ్యుతుండయినాడు. మఱియుఁ గృష్ణమహిమ అపారమైనది

ఈ మహిమావిశేషమెల్ల ౨౩—౨౮ శ్లోకములందు వివరింపఁ బడినది) బాలుండే శిశుపాలుండు కృష్ణునెఱుఁగఁ డందువలన నిట్లు పలుకుచున్నాఁడు. ధర్మపరిశీలనము గల్గిన మతిమంతుఁడగు నరుండే ధర్మమెఱుంగలండే చేసి రాజట్టివాఁడు కాఁడు ఆబాలవృద్ధులగు నీ మహాత్ములు పార్థివులు దెవ్వాఁడు కృష్ణుఁడర్హుండు కాఁడని తలంచును, ఎవ్వండేతనిఁ బూజింపడు అని పలికి భీష్ముఁడు తుది వచన మిట్లు పలికెను)

అ ర్హైనాం దుష్కృతాం పూజాం శిశుపాలో వ్యవస్యతి
దుష్కృతాయాం యథాన్యాయం తథాయం కర్తుమర్హతి 33

(ఇట్లుగాక యీ పూజ దుష్కృతమని శిశుపాలుఁడెన్నుచో నా దుష్కృతమునకు యథాన్యాయమగు చర్యయతండు గావింపవచ్చును. అని భీష్ముఁడు తుది మాట పలికి యూరకుండెను)

ధర్మజుఁడు మధురమైన మాట సాంత్వ పూర్వముగా బలికినాఁడు. నేదం యుక్తం మహీపాల యాదృశం వైత్వముక్త వాన్' అను ధర్మజుని వచనమాతని సాత్వికమగు నోదార్పును వెల్లడించుచున్నది. "అధర్మశ్చ పరోరాజన్ పారుష్యంచ నిరర్థకం' అనునది శిశుపాలుని వచన మనార్యమై యున్నదని సూచించుచున్నది. ధర్మరాజింత మాత్రము పలికి భీష్ముని పెద్ద తనము నా పిమ్మట పేర్కొనినాఁడు. రాజోత్తము లెల్లను కృష్ణా ఘ్రాణాసకులై యుండుటను వెల్లడించినాఁడు. కృష్ణుని భీష్ముఁ డెఱింగినంతగా శిశుపాలుఁడు తెలిసినవాఁడు కాఁడని పలికినాఁడు. ధర్మజుఁడిట్లు పలుకుటఁ జూచి భీష్ముఁడు శిశుపాలుఁ డట్టిమాటకు సాంత్వనమునకుఁ దగఁడని పలికినాఁడు. భీష్ముఁడు లోక వృద్ధతముఁడు కృష్ణుఁడని మొదటి విషయము పలికినాఁడు. రాజర్హాణ మదిగా నక్షత్రియగురుండు కృష్ణుఁడని వెల్లడించినాఁడు. దీనినే బహువిధముల నెత్తిచూపువాఁడై భీష్ముఁడు 'వృద్ధులున్నను కృష్ణుఁడే యర్హుఁ డనియు త్రిలోకారాధ్యుఁడనియు వివరించినాఁడు, ఆ చేరిన ప్రీతివానిఁ గూర్చి వితరించుకొని యే కృష్ణున కర్ఘ్యమొసంగఁ బడినదని యదార్థము పలికినాఁడు. క్షత్రియులందు బలాధికుండే యర్చ

నీయుఁడని పలికినాఁడు, మఱియుఁ గృష్ణునందలి పూజార్హతను వ్యక్తీకరించువాఁడై భీష్ముఁడు వేదవేదాంగ విజ్ఞానము, అధిక బలము కృష్ణునందుఁ గలవని స్పష్టము తెలిపినాఁడు "బుత్విగ్గురు ర్వివాహ్యశ్చ స్నాతకో నృపతిః ప్రియః! సర్వమేత దృషీకేశః" అని పలికి సన్మూర్తులు కృష్ణునందు మూర్తీభవించియున్నవని సువ్యక్తముగావించినాఁడు. సర్వశ్రేష్ఠతముండగువాఁడు (కృష్ణుఁడు) రాజార్హణమందర్పింపఁబడుట యనునది ఘన విశేషమని భీష్ముఁడు కృష్ణ మహిమా విశేషమెల్ల నత్యున్నతముగఁ జేసొఁనినాఁడు. 'బాలబుద్ధిగల్గి శిశుపాలుఁడు పాండవులు బాలురని, ఆపగేయుఁడల్ప దర్శకుఁడని తూలనాడినాఁడు. భీష్ముఁడద్దానిని ముదలకించి పలికినాఁడు. అర్చనయందు రాజసమ్మతిని పేరొకనినాఁడు. మఱియు పాండవులను, తన్ను, కృష్ణుని నలక్ష్యమొనర్చి కాఱులు పేలియున్న శిశుపాలుఁడు దిగనాడి ధిక్కరించి పలికినాఁడు. చేతనైనది కావింపుము అని సవాలుగా మాట ముగించినాఁడు.

ఏవముక్త్వా తతో భీష్మోవిరరామ మహాబలః
వ్యాజహారోత్తరం తత్ర సహదేవోఽర్థవద్వచః 38-1

కేశవం కేశిహంతార మప్రమేయ పరాక్రమమ్
పూజ్యమానం మయా యోవః కృష్ణం నసహతే నృపః 2

సర్వేషాం బలినాం మూర్ధ్ని మయేదంనిహితంపదమ్
ఏవముక్తే మయా సమ్యగుత్తరం ప్రబ్రవీతు సః 3

మతి మంతశ్చ యేకేచి దాచార్యం పితరం గురుమ్
అర్చ్య మర్చిత మర్ఘార్హ మనుజానంతు తే నృపాః 4

తతో నవ్యాజ హారైషాం కశ్చిద్బుద్ధి మతాం సతాం
మానినాం బలినాం రాజ్ఞాం మధ్యేవై దర్శితేపదే ౫

తతోపతత్పుష్ప వృష్టి స్సహదేవస్య మూర్ధని
అదృశ్యరూపా వాచశ్చా ప్యబ్రువన్ సాధుసాధ్వితి ౬

సర్వ సంశయ నిర్మోక్తా నారద స్సర్వలోకవిత్
ఉవాచా ఖిల భూతానాం మధ్యే స్పష్టతరం వచః ౭

కృష్ణం కమల పత్రాక్షం నార్చయిష్యంతి యే నరాః
జీవన్మృతాస్తు తేజ్ఞేయా నసంభాష్యాః కదాచన ౮

వైశంపాయనః :—

పూజయిత్వాచ పూజార్హాన్ బ్రహ్మక్షత్ర విశేషవిత్
సహదేవో నృణాందేవ స్సమాపయత కర్మతత్ ౯

(భీష్ముఁడు పలికి యూరకొనిన పిమ్మట సహదేవుఁడర్థయుక్తమగు వచనము వెల్లడించెను. అప్రమేయ పరాక్రముండగుఁ కృష్ణునిఁ బూజించుటచే నృపుఁడు సహింపఁడో యాబలవంతుల శిరమునఁ నాయీ పాదముంచఁబడినది. ఇటుల వచించు నాకు బదులు పలుకుడు, మతిమంతులగు నృపాలురు అచార్యుఁడు, పితగురుఁడునగుఁ కృష్ణుని అర్ఘ్య విషయమునను గమింపవలయును. అని సహదేవుఁడు పలుకఁగా బుద్ధిమంతులగు సత్పురుషులైన నృపాలురేమియు పలుకలేదు (ఉచ్చరించలేదు). మానసీయులు, బలవంతులగు రాజుల మధ్య సహదేవుఁడట్లు పాదమెత్తిచూపగా నపుడా సహదేవుని

శిరమందు పుష్ప వృష్టి గురిసెను. మఱియు సద్యశ్శరీరాపమగు వాకుల "సాధువు సాధువు" అని వినవచ్చెను. సర్వ సంశయ నిర్మోక్త, సర్వలోకవేత్తయగు నారదుఁడఖిల భూతమధ్యమందు స్పష్టతర వచనమిట్లు పలికెను. కమలపత్రాక్షుఁడగుఁ గృష్ణునేనరు లర్చింపరో వారు జీవన్మృతులని తెలియఁదగును. వారితో నెపుడు ప్రసంగింప కూడదు అని పలికెను. బ్రహ్మక్షత్ర విశేషవేత్తయగు సహదేవుఁడు పూజార్హులగు వారినెల్ల నర్చించి యాకృత్యమును నెఱవేర్చెను )

౨, 3 శ్లోకములందున్న "నృపః, సః" అను నేక వచనములు సహదేవుని సాత్విక నిదానమును పోషించుచున్నది. శిశుపాలు నొకని ధికరించి పలుకుటను, శిశుపాలుని గూడియున్న రాజులను తిరస్కరించుటను నివి సూచించుచున్నవి. ఆ సభయందు బ్రహ్మక్షత్ర సమాగమ మేర్పడియున్నది. ౨వ శ్లోకమందలి 'నృపాః' అనునది, ౫వ శ్లోకమందలి 'మానినాంబలినాంరాజ్ఞే మధ్యే' అనునది రాజార్హణ విషయమే యాపూజయని సుస్పష్టము చేయుచున్నవి. రాజార్హణ విషయమిట్లు పాండవ ప్రతాప ప్రకటముగా నేర్పడినది. బుద్ధిమంతులగు రాజులు కృష్ణార్హ్య విషయమగు సహదేవుని ప్రతాపవచనమునకు మిన్నకుండి ధర్మాను సవరణముగాఁ బాండవ ప్రవృత్తిని సమ్మతించిరి. రాజోత్తముల సమాధానము సూచితమైన యా సందర్భమున సర్వసంశయ నిర్మోక్త, సర్వలోక వేత్తయగు నారదుఁడు కృష్ణపూజఁ గావింపని వారిని దూఱి పలికెను. ఉత్తమ సమ్మతి, దుష్టదమన మేర్పడిన యా వీర సమయమున సహదేవుఁడు పూజార్హుల నెల్ల పూజించెను.

కృష్ణార్ఘ్యమున కంగీకరింపక శిశుపాలుఁడు రాజులతో, ' నేను సేనాపతి నగుదును. కృష్ణి పాండవులను సంగ్రామమున నెదిరింతము' అని పలుకుచు యజ్ఞోపఘాతమునకు యత్నించెను. యుధిష్ఠిరాభిషేకము, కృష్ణార్చనము నెఱవేఱకుండ నడ్డుదగుల నిశ్చయించెను. సుహృదులు వారించుచున్నను శిశుపాలు ననుసరించు రాజులు క్రోధమూర్ఛితులై గర్జించుచుండిరి అపర్యాంతమగు నాబలౌఘమును - అక్షయరాజ సాగరమును - యుద్ధాయత్తమగు చున్న దానిని కృష్ణుఁడు గమనించెను.

శిశుపాల వధ

' యజ్ఞము విఘ్నము గాకుండునట్లు, ప్రజలకు హితమగు నట్లు చేయఁదగినది తెల్పుము' అని ధర్మజుఁడనగా భీష్ముఁడు 'భయ పడకుము, శివమైన మార్గము పూర్వమే తెలిపియున్నాను ( పూర్వ తరం వృతః ) కుక్క సుప్త సింహమును లేపునట్లు శిశుపాలుఁడు ప్రవర్తించుచున్నాఁడు, కృష్ణుఁడు సర్వప్రవర్తకుడు' అని తెల్పినాఁ డు. విశేషించి యిట్లు పలికినాడు.

చతుర్విధానాం భూతానాం త్రిషులోకేషు మాధవః
ప్రభవశ్చైవ సర్వేషాం నిధనంచ యుధిష్ఠిర ! ౭౨

(ముల్లోకములందలి చతుర్విధ భూతముల యొక్క ప్రభవము నకు నిధనమునకు కృష్ణుఁడే ప్రవర్తకుఁడు అని భీష్ముఁడు పలికెను)

భీష్ముఁడిట్లు పలుకఁగా శిశుపాలుఁడు భీష్మునిఁ గూర్చి రూక్షా క్షర వచనములు పలికెను; భీష్ముని తూలనాడెను. జన్మప్రభృతిగాఁ

గృష్ణుని కళ్యాణ గుణములను గూర్చి భీష్ముఁడు పలికినది చులుకన చేయుచుఁగృష్ణ చర్యలన్నియు నపహాస్య మొనర్చెను.

అవలిప్తస్య మూర్ఖస్య కేశవం స్తోతు మిచ్ఛతః
కథం భీష్మ న తే జిహ్వా శతధేయం విదీర్యతే ౪౧-౫

యత్ర కుత్సా ప్రయోక్తవ్యా భీష్మ బాలతరైర్నరైః
త మిమం జ్ఞాన వృద్ధాస్సన్ గోపం సంస్తోతు మిచ్ఛసి ౬

యస్య చానేన ధర్మజ్ఞ భుక్త మన్నం బలీయసః
సచానేన హతః కంస ఇత్యేతన్న మహాద్భుతమ్ ౧౧

గోఘ్నః స్త్రీఘ్నశ్చ సన్ భీష్మ త్వద్వాక్యా ద్యదిపూజ్యతే
ఏవం భూతశ్చయో భీష్మ కథం సంస్తవ మర్హతి ౧౬

అసౌ మతిమతాం శ్రేష్ఠో య ఏష జగతః ప్రభుః
సంభావయతి చాప్యేనం త్వద్వాక్యాచ్చ జనార్దనః ౧౭

ఏవమేత త్సర్వమితి తత్సర్వం వితథం ధ్రువమ్ ౧౮

.....................................................................

అన్యకామా హి ధర్మజ్ఞా కన్యకా ప్రాజ్ఞమానినా
అంబానామేతి భద్రంతే కథం సాపహృతా త్వయా ౨౨

తాం త్వయాపహృతాం భీష్మ కన్యాం నైషితవాన్యతః
భ్రాతా విచిత్రవీర్య స్తే సతాం మార్గ మనుష్ఠితః ౨౪

దారయోర్యస్య చాన్యేన మిషతః ప్రాజ్ఞమానినః
తవజాతా న్యపత్యాని సజ్జనాచరితే పథి ౨౫

కోఽపిహి ధర్మోఽస్తి తే భీష్మ బ్రహ్మచర్య మిదం వృథా
యద్ధారయసి మోహాద్వా క్లీబత్వాద్వా న సంశయః ౨౬

నత్వహం తవ ధర్మజ్ఞ పశ్యామ్యుపచయం క్వచిత్
నహి తేసేవితా వృద్ధాయ ఏనం ధర్మమబ్రవీః ౨౭

ఇష్టం దత్త మధీతంచ యజ్ఞాశ్చ బహుదక్షిణాః
సర్వమేతదపత్యస్య కళాంనార్హతి షోడశీమ్ ౨౮

వ్రతోపవాసైర్బహుభిః కృతం భవతి భీష్మయత్
సర్వం తదనపత్యస్య మోఘం భవతి నిశ్చయాత్ ౨౯

(అవలిప్తుఁడవు, మూర్ఖుఁడవు కేశవుని స్తోత్రముగావించు చుంటివి. ఆనీనాలుక నూఱు వ్రయ్యలుగాదయ్యెగదా! బాలతరులు గూడ నేవగించుదు రే! జ్ఞానవృద్ధుఁడవై యుండియు గోపుని నుతింపని చ్ఛగించుచుంటివి .... ...ఎవనియన్నము తినియున్నాఁడో యాకంసు నిఁ గృష్ణుడు సంహరించుట యనునదే మహాద్భుతము. గోఘ్నుఁడు స్త్రీఘ్నుఁడునగు వాఁడు నీ వాక్యమున పూజ్యుఁడగునా? ఇట్టివానిని భీష్ముఁడెట్లు స్తుతింపనర్హుండగును? నీవిట్లు కృష్ణుని కొండగా నుతింపఁ గాఁ గృష్ణుఁడది నిజమేయని సంభావించుచున్నాఁడ యంతయు వితథము, నిశ్చయము ... ...అన్యకామయగు నంబననపహరించి తెచ్చితివి. ధర్మప్రవర్తకుండగు నీ తమ్ముఁడా కన్య నంగీకరింపలేదు. ఇతరుల వలనఁ గురు సంతతిని గల్గించితివి, నీయందు ధర్మమేమిగలదు? బ్రహ్మ చర్యమిది వృథా, వృద్ధులను సేవించినవాఁడవుకావు, ధర్మమార్గము నీకు తెలియదు. ఇష్టము, దత్తము, అధీతము బహుదక్షిణయగు

యజ్ఞము ఇన్నియు సంతానమునకుఁ గళామాత్రముకూడ కాఁజాలవు. వ్రతోపవాసాదులెన్ని గావించినను సంతతిలేనివాని కవన్నియు మోహమేయగును. ఆ నీవు అనపత్యుఁడవు, ముదుసలివి, మిథ్యాధర్మమునఁ బ్రవర్తించువాఁడవు' శిశుపాలుఁడిట్లు భీష్ముని నిందించి కృష్ణుని పాండవులను మఱియునిట్లు నిందించెను.)

శిశుపాలః

సమే బహుమతో రాజా జరాసంధో మహాబలః
యోఽనేవ యుద్ధం నేయేష దాసోఽయ మితి సంయుగే ౨౪-౧

కేశవేన కృతం కర్మ జరాసంధ వధే తదా
భీమసేనార్జునాభ్యాంచ కస్తత్సాధ్వితి మన్యతే ౨

అద్వారేణ ప్రవిష్టేన చ్ఛద్మనా బ్రహ్మవాదినా
దృష్టః ప్రభావః కృష్ణేన జరాసంధస్య భూపతేః 3

యేన ధర్మాత్మనాత్మానం బ్రహ్మణ్య మవిజానతా
నేషితం పాద్య మస్మైతద్దాతు మగ్రే దురాత్మనే ౪

భుజ్యతా మితి తేనోక్తాః కృష్ణ భీమ ధనంజయాః
జరాసంధేన కౌరవ్య కృష్ణేన వికృతం కృతమ్ ౫

యద్యయం జగతః కర్తాయథైనం మూర్ఖ మన్యసే
కస్మాన్న బ్రాహ్మణం సమ్యగాత్మాన మవగచ్ఛతి ౬

ఇదం త్వాశ్చర్య భూతం మే యదీమే పాండవాస్త్వయా
అపకృష్టాః సతాం మార్గా న్మన్యంతే తచ్చ సాధ్వితి ౭

అథవా నైతదాశ్చర్యం యేషాం త్వమసి భారత!
స్త్రీ సధర్మా చ వృద్ధశ్చ సర్వార్థానాం ప్రదర్శకః ౮

వైశంపాయనః :—

తస్య తద్వచనం శ్రుత్వా రూక్షం రూక్షాక్షరం బహు
చుకోప బలినాం శ్రేష్ఠో భీమసేనః ప్రతాపవాన్ ౯

తథా పద్మ ప్రతీకాశే స్వభావాయత విస్తృతే
భూయః క్రోధాభి తామ్రాన్తే రక్తే నేత్రే బభూవతుః
త్రిశిఖాం భ్రుకుటీంచాస్య దదృశు స్సర్వ పార్థివాః

---

లలాటస్థాం త్రికూటస్థాం గంగాం త్రిపథగా మివ ౧౧

దంతాన్ సందశత స్తస్య కోపా ద్దదృశు రాననం
యుగాంతే సర్వభూతాని కాలస్యేవ జిఘత్సతః ౧౨

ఉత్పతంతంతు వేగేన జగ్రాహైనం మనస్వినం
భీష్మ ఏవ మహాబాహు ర్మహాసేన మివేశ్వరః ౧౩

తస్య భీమస్య భీష్మేణ వార్యమాణస్య భారత!
గురుణా వివిధై ర్వాక్యైః క్రోధః ప్రశమ మాగతః ౧౪

నాతిచక్రామ భీష్మస్య సహి వాక్య మరిందమః
సముద్వృత్తో ఘనాపాయే వేలామివ మహోదధిః ౧౫

(మహాబలుఁడా జరాసంధుఁడు బహుమతుండగు రాజు, దాసుఁ
డైన కృష్ణునితోడ పోరాట మొల్లనివాఁడతండు. జరాసంధవధయందు

గృష్ణుఁడు గావించునది-భీమార్జునులతో బోయి గావించినది ఎవఁడు మంచిదని తలంచును? కపటమున బ్రహ్మవాదినంచు నద్వారమునఁ బ్రవేశించినకృష్ణునిచే జరాసంధుడె విరింపబడినాఁడు. ఈ కపట వేష మెఱుంగక బ్రాహ్మణులని యా జరాసంధుఁడు గావించిన అర్ఘ్య మును ఈ దురాత్ముఁడంగీకరింప లేదు, కృష్ణభీమధనంజయులను భోజనమునమునకు జరాసంధుఁడు నిమంత్రణ మొనర్పగా నదియంతయు ని కృష్ణునిచే వికృత మొనరింపఁబడినది. మూర్ఖుఁడా! జగత్తునకుఁ గర్తయగుచో నీ కృష్ణుఁడు బ్రాహ్మణుఁడనని యెందుకు తలంపఁడు. ఇదియే యాశ్చర్యము, ఈ పాండవులనీచే సన్మార్గమునుండి యప కృతులై యదియే మంచిదని తలంచుచున్నారు. లేక యిది యాశ్చ ర్యమే కాదు. స్త్రీ సధర్ముఁడవు, ముదకడవునగు నీవు వారికి సర్వార్థ ములందుఁ బ్రిదర్శకుండవైయున్నావుకదా! ,,అని శిశుపాలుఁడు కాఱు లుబ్రేలెను. శిశుపాలుని పెరుష-రూక్ష రూక్షాక్షరములను విని బల వంతులందు శ్రేష్ఠుఁడగు ప్రతాపవంతుఁడు భీమసేనుఁడు కోపించెను. అత్ని పద్మప్రతికాశములు స్వభావయత విస్తృతములునగు నాతని నేత్రములు మఱియు క్రోధాభితామ్రాక్షులయినవి. త్రికూటస్థమగు త్రిపథయగు గంగా కూలంకుషయట్లు భీముని నొసట మూఁడు బొమముడు లేర్పడుటను రాజులెల్లఱు గాంచిరి. యుగాంత సమయ మున సర్వ భూతముల సంహరింపనుండు కాలునట్లు కోపోద్రేక మునపండ్లు పట పటఁ గొఱుకుచున్న యాభీముని ముఖమును గాంచిరి. వేగముగ నెగిరివచ్చు నా భీముని - యామానవంతుని భీష్ముఁడు వారించెను. మహేశ్వరుఁడు మహాసేనునట్లు భీష్ముఁడు భీముని పట్టుకొని వారించెను. వివిధగురు వాక్యముల వారించునా భీష్ముని

వాక్యములచే భీమునియొక్క కోపము ప్రశమ మొందెను. ఘనాపాయమందు ఒడ్డునతిక్రమించని మహోదధియట్లు భీముడపుడు భీష్మునినతిక్రమించ లేదు.)

ఆయువు మూడిన శిశుపాలుఁడు వినాశనముఁ గల్గించుకొనుచున్నాఁడు. భీమునకుఁ గోపము వచ్చినది. సామ్రాట్టులు కానున్న పాండవులచేతనే కృష్ణుఁడు సామ్రాట్టుకానున్న జరాసంధుని చంపించియున్నాఁడు. శిశుపాలునంతమిపుడు కృష్ణునందు వర్తించియున్నది. కావున భీమునకు వచ్చినది, కోపము పోయినదని చక్కఁగానిట చెప్పఁబడినది. ౧౮వ శ్లోకమీ విశేషమును చక్కగా నిరూపించుచున్నది. 'భీమస్య భీష్మేణ' అను షష్ఠీ విభక్తి, తృతీయా విభక్తి గమనింపదగినవి. భీమభీష్ముల సాత్త్విక సంపదనివి వెల్లడించుచున్నవి. 'క్రోధః ప్రశమమాగతః' అను ప్రథమావిభక్తియుఁ గమనింపఁదగినది భీమునకు కోపము పోయినదనిన గంభీర విషయముకానేరదు. ఆ కోపము ప్రశమమైనది' అనునది గంభీర విషయమగుచున్నది. కృష్ణుఁడే యాశిశుపాలుని వధింపఁదగియున్నదను కార్య విశేషమునిది సువ్యక్తము చేయుచున్నది.

పరిస్థితి యిట్టిది కాగా వినాశనము నొందనున్న శిశుపాలుఁడు విపరీతమువ నున్నాఁడు. భీమసేనుఁడు సంకృద్ధుఁడు కాగా శిశుపాలుఁడు కంపించ లేదు, పౌరుషమందే నిలిచియుండెను, భీమసేనుని యించుకను వాఁడు లక్ష్య పెట్టలేదు, సరికదా! పరిహసించి యిట్లు పలికెను. 'భీష్మ!' విడువుము' అగ్నిలోఁబడు పతంగమట్లు మత్ప్రభావ వినిర్దగ్ధుఁడగు భీముని ఈ నరాధిపులు చూడ నిమ్ము'

అని పలికెను. శిశుపాలుని యీ మాట విని మతిమతాం వరుఁడగు భీష్ముడు భీమునితో నిట్లు పలికెను.

చేదిరాజకులే జాత స్త్ర్యక్ష ఏష చతుర్భుజః
రాసభారావ సదృశం రరాసచ ననాదచ ४३-౧

చేదికులమందీ శిశుపాలుఁడు మూఁడు కండ్లు, నాలుఁగుచేతులుగల్గిగాడిదయందు అఱచుచుఁ బుట్టెను. తల్లిదండ్రులు భయమొంది వీనిని త్యజింపనెంచిరి. చింతాసంమూఢ హృదయుఁడగునా నృపాలునిఁ గూర్చి యశరీరవాణి యిట్లు పలికెను.

ఏష తే నృపతే! పుత్రః శ్రీమాన్ జాతో బలాధికః
తస్మా దస్మాన్న భేతవ్య మవ్యగ్రః పాహివై శిశుమ్ ४

నచవై తస్య మృత్యుర్వై న కాలః ప్రత్యుపస్థితః
మృత్యు ర్హంతాస్య శస్త్రేణ సచోత్పన్నో నరాధిప! ౫

సంశ్రుత్యోదాహృతం వాక్యం భూత మంతర్హితం తతః
పుత్రస్నేహాభి సంతప్తా జననీ వాక్య మబ్రవీత్! ౬

యేనేద మీరితం వాక్యం మమైతం తనయం ప్రతి
ప్రాంజలి స్తం నమస్యాటు బ్రవీతుసపునర్వచః ౭

( ఈ నీ పుత్రుఁడు బలాధికుఁడు, అందువలన భయపడవలదు, శిశువును గాపాడుము. వీనికిపుడు మృత్యుకాలము కాదు; వీనినిఁ జంపువాడు పుట్టియే యున్నాఁడు' అని యశరీరవాణి పలికినది.

విని పుత్రి స్నేహాభి సంతప్తయగు నా తల్లి, నా పుత్రుని గూర్చి యీ మాట పలికిన వానికి నమస్కరించెద మరల వచింపవలసినది.

వీనికి మృత్యు వెవరు? దేవుఁడా? యితరుఁడా? అని పలికెను. అంతర్యామితమగు నా భూతము, ఎవని యుత్సంగమున నుండగా నీ బాలుని అధిక భుజములు పాములట్లు భూమిపైఁబడిపోవునో, నొసటనున్న మూఁడవ కన్ను నిమజ్జనమగునో యాతఁడు వీనికి మృత్యువగును' అని పలికెను. ఈ విచిత్ర బాలుని జూడనెంచి లోకవాసులగుఁబలువురు నరపతులు వచ్చి చూచుచుండిరి. ఆ వచ్చిన రాజు లెల్లరి యుత్సంగమందు నా బాలుని యా తండ్రి యుంచుచు వచ్చెను గాని నిదర్శనముఁ గనలేదు. ఈ వార్త విని బలరామకృష్ణులు తమ మేనత్తనుఁ జూడ వచ్చుటకు వచ్చిరి. ఆ మేనత్త వారిని గౌరవించి, తన కుమారుని స్వయముగా నామె దామోదరు నుత్సంగమునఁ బ్రీతిఁగా నుంచెను. న్యస్తమాత్రముననే యా బాలుని అధిక భుజములు, మూఁడవ కన్ను పోయినది. అది చూచి వ్యధితయై యా మేనత్త శిశుపాలుని యపరాధములను క్షమింపవలసినదని వరము కోరెను అపుడు కృష్ణుఁడిట్లు పలికెను.

అపరాధశతం క్షామ్యం మయా హ్యస్య పితృష్వసః
పుత్రస్య తే వధార్హస్య మాత్వంశోకే మనః కృథాః    ౨౮

భీష్మః :-

ఏవ మేష నృపః ప్రాప్త శ్శిశుపాల స్సమాదధీః
త్వాంసమాహ్వాతే వీర గోవింద వర దర్పితః    ౨౮

(మేనత్తా ! వధార్హుఁడగు నీ పుత్రుని యపరాధశతము నాచే నోర్వఁదగినది, శోకమందు మనసు నుంపకుము ' అని కృష్ణుఁడు పలికెను. మంద బుద్ధియగు శిశుపాలుఁడు నిన్ను (బోరికి) బిలుచుచున్నాఁడు, వీరుఁడా ! వీడు గోవింద వరదర్పితుఁడు ‹ అని భీష్ముఁడు భీమునితో బలికి మఱియు నిట్లుపలికెను.)

నైషా చేదిపతే బుద్ధి ర్యయా త్వాహ్వయతేఽచ్యుతం
నూన మేష జగద్భర్తుః కృష్ణస్యైవ వినిశ్చయః ౪౪—౧

కోహిమాం భీమసేనాద్యక్షితౌ వర్హ్వతి పార్థివః।
క్షేప్తుంకాలపరీతాత్మా యథైష కులపాంసనః ౨

(కాలపరీతుఁడే కులపాంసనుఁడు జగద్భర్తయగు ‹ గృష్ణుని బోరికిఁబిలుచుచున్నాఁడు. శిశుపాలుఁడుగాక యీ లోకమందు నన్నుఁ గూర్చి యిట్లు పలుకు రాజెవ్వఁడుగలఁడు. వీనికాయువు మూడిన దిపుడు—అని భీష్ముఁడు పలికెను.)

భీష్ముని వచనము విని యోర్వలేనివాఁడై శిశుపాలుఁడు మఱియు పెచ్చుపెరిగెను. భీష్ముఁడా! కేశవుని ప్రభావము మా శత్రు లందుండనిమ్ము, సంస్తవనకర్తయగుదు నీవు వందివలె స్తుతించుట యందే నీ మనస్సు వర్తించుచో కృష్ణునినూని మహీపాలురను స్తుతింపుము.

కింహిశక్యం మయాకర్తుం తద్వృద్ధానాంత్వయానృపః
పురా కథ యతాంనూనం నశ్రుతం ధర్మవాదినామ్ ౦౪

ఆత్మనిందాత్మ పూజాచ పరనిందా పరస్తవః
అనాచరిత మార్యాణా మితితే భీష్మనః శ్రుతమ్ ౨౫

యదస్తవ్యమిదం శశ్వన్మోహాత్సంస్తౌషి భక్తితః
కేశవం తచ్చతే భీష్మ నకశ్చిదను మన్యతే ౨౬

(ధర్మవాదులగు బెద్దలు నుడివినది నీవాలకించుట లేదు. నేనేమి చేయుదు. ఆత్మనింద, ఆత్మపూజ, పరనింద, పరస్తవము ఇవి ఆర్యుల కనాచరితములని భీష్మ! మేము వినియుంటిమి- మోహమున కేశవుని భక్తిగా నిట్లుస్తుతియొనర్చుట నెవ్వఁడును సంగీకరింపఁడు (అనుమోద తే)... ...... భూమిపాలురిచ్ఛయించినంతవఱకుందువునీవు లేనపుడు నీ జీవితము సంశయమే. లోకవిద్విష్టకర్మయందునీతో వమానుఁడు లేఁడు అని శిశుపాలుఁడు తూలనాడెను. శిశుపాలుని యీ కటుక వచనము విని భీష్ముఁడు శిశుపాలుఁడు వినుచుండగానిట్లు పలికెను.

ఇచ్ఛతాం కిలనామహంజీవా మ్యేషాం మహీక్షితాం
సోఽహం నగణయా మ్యేనాం స్తృణేనాపి నరాధిపాన్ ౨౭

ఏవముక్తేతు భీష్మేణ తతస్సంచుక్రుశు ర్నృపాః
కేచిజ్జహృషిరే తత్ర కేచి ద్భీష్మం జగర్హిరే ౨౮

కేచిదూచుర్మహేష్వాసాః శ్రుత్వా భీష్మస్య తద్వచః
పాపోఽవలిప్తో వృద్ధశ్చనాయం భీష్మోఽర్హతి క్షమామ్ ౨౯

హన్యతాం దుర్మతిర్భీష్మః పశువత్సాధ్వయం నృపాః
సర్వైస్సమేత్య సంరబ్ధోదహ్యతాంవాకటాగ్నినా ౩౦

ఇతితేషాం వచః శ్రుత్వా తతః కురుపితా మహః
ఉవాచ మతిమాన్ భీష్మస్తానేవ వసుధాధిపాన్ ౩౧

ఉక్తస్యోక్తస్య నేహాంతమహాం సముపలక్షయే
యత్తు వక్ష్యామి తత్సర్వం శృణుధ్వం వసుధాధిపాః ౪౦

పశువద్ఘాతనం వా మే దహనం వా కటాగ్నినా
క్రియతాం మూర్ధ్నివో న్యస్తం మయేదం సకలం పదమ్ ౪౧

ఏష తిష్ఠతి గోవిందః పూజితోఽస్మాభిరచ్యుతః
యస్య వా త్వరతే బుద్ధిర్మరణాయ సమాధనమ్ ౪౨

కృష్ణమాహ్వయతా మద్య యుద్ధే చక్రగదాధరం
యాదవస్యైవ దేవస్య దేహం విశతు పాతితః ౪౩

('రాజుల యిచ్ఛచేతనే జీవించుట నేనను నీ మాటను నేను లెక్కింపను. ఈ నృపాలురను నేను గడ్డిపోచతోఁగూడ సమముగా దలంపను.' అని భీష్ముఁడు పలుకఁగా రాజులాక్రోశపడిరి. కొందఱు సంతసించిరి. కొందఱు భీష్ముని గర్హించిరి. ధన్విశ్రేష్ఠులు కొందఱు భీష్ముని యీ వచనములు విని 'పాపుడవవిప్తుడు వృద్ధుఁడీ భీష్ముఁడు క్షమార్హుండుగాఁడు. వీనిని చంపవలయును. దుర్మతి యీ భీష్ముఁడు వీనిని పశువునట్లు వధింపవలయును. ఎల్లఱు చేరి సంరబ్ధులై వీనినిఁ గటాగ్నిచేఁ గాల్చివేయుడు.' అని పలికిరి. వారలమాటవిని మతిమంతుఁడు కురుపితామహుఁడు భీష్ముఁ డట్లు పలుకుచున్న యావసుధాధిపుల నుద్దేశించి యిట్లు పలికెను. మాటకు మాట పెచ్చు పెరుగుచున్నది. దీని కంతుచూడకున్నాను. నే నాడు మాట నీ వసుధాధిపులాలకింపవలయును. పశువతు నన్ను ఘాత చేయును, కటాగ్నిచే దహింపుఁడు, ఏమిగావింపుఁడు, మీ శిరమందు నా పాద మంతయు మోపుచున్నాను (క్రియతాం మూర్ధ్నివో

న్యస్తం మయేదం సకలం పదం ఈగోవిందుఁడున్నవాఁడీ యచ్యుతుండు నాచే నర్చింపఁబడినాడు. ఎవనికి మరణాతురతగల్గి, బుద్ధి తొందరచేయునో వాఁడు కృష్ణుని, మాధవుని, చక్రగదాధరుని యుద్ధమునకు బిలువుఁడు. నేలంబడి యాదవసింహుఁడా దేవుని దేహమందు ప్రవేశింపుఁడు' అని పలికెను. శిశుపాలుఁడీమాటలువిని కృష్ణునితో యుద్ధముచేయనిశ్చయించి యిట్లు పలికెను.

ఆహ్వయే త్వాం రణం గచ్ఛ మయా సార్ధం జనార్దన !
యావ దద్య నిహన్మి త్వాం సహితం సర్వపాండవైః ౪౫-౨

సహ త్వయా హి మే వధ్యా స్సర్వథా కృష్ణ పాండవాః
నృపతీన్ సమతిక్రమ్య యై రరాజః త్వ మర్చితః 3

యే త్వాం దాస మరాజానం బాల్యా దర్చంతి దుర్మతిం
అనర్హ మర్హవత్ కృష్ణ వధ్యా స్త ఇతి మే మతిః ౪

ఇత్యుక్త్వా రాజశార్దూల తస్థౌ గర్జ న్న మర్షణః
ఏవ ముక్తే తతః కృష్ణో మృదుపూర్వ మిదం వచః ౫

ఉవాచ పార్థివాన్ సర్వాన్ స సమక్షంచ పాండవాన్
ఏష న శ్శత్రు రత్యంతం పార్థివాః సాత్వతీసుతః ౬

(జనార్దనా! నాతోడ రణమొనర్ప రమ్ము, సర్వ పాండవులతోడ నిన్ను వధించెదను. నీతోడఁగూడ పాండవులు నాచే వధింపఁబడువారగుచున్నారు. రాజులనతిక్రమించి రాజుకాని నిన్ను వారర్చించిరి. దాసుండవుదు, అరాజవు, దుర్మతివి అనర్హుడవు నిన్ను వారు బాలబుద్ధిగల్గి యర్చించినందున నాపాండవులు వధ్యులని

నాయభిప్రాయము—ఇట్లు పలికి శిశుపాలుఁడు గర్జించుచు నోర్వలేని వాఁడైయుండెను. కృష్ణుఁడు పాండవ సమక్షమున రాజులందఱితోడ మృదుపూర్వమగు మాటలు పలికెను. ఈతఁడు మా కత్యంతము శత్రువు. రాజులారా! మేనల్లుఁడైయుండియు మేము ప్రాగ్జ్యోతిష పురమునకుఁ బోయియుండగా వీఁడు ద్వారకానగరమును కాల్చియున్నాఁడు. భోజ రాజు మొదలగువారు రైవత పర్వతమందుఁ గ్రీడించుచుండఁగా వారిని చంపి, బంధించి వారిని స్వపురమునకుఁ గొనిపోయెను మాతండ్రిగావించు నశ్వమేధ సంబంధమగు నశ్వమును ఈపాపనిశ్చయుఁడు హరించెను. సౌవీర దేశమునకుఁబోవుచున్న బభ్రుని యొక్క ఆతపస్వియొక్క భార్యను అకామయగు దానిని వీఁడు మోహమున హరించెను. మాయాప్రతిచ్ఛన్నుఁడై మేనమామ కుమార్తెను వైశాలిని హరించెను మేనత్తకు దుఃఖమగునంచు నే నాయపరాధములను సహించియుంటివి, సర్వరాజ్ఞసమక్షము దిపు డిట్లు వర్తించు వీనివ్యతిక్రమమును మీరు చూచినారుకదా! పరోక్ష మందు వీఁడుగావించియున్నది తెలియుఁడు.

ఇమం త్వస్య న శక్ష్యామి క్షంతు మద్య వ్యతిక్రమం
అవలేపా ద్వధార్హస్య సమగ్రే రాజమండలే ౧౫

రుక్మిణ్యా మస్య మూఢస్య ప్రార్థ నాసీ న్ముమూర్షతః
నచ తాం ప్రాప్తవాన్ మూఢః శూద్రో వేదశ్రుతీ మివ ౧౬

ఏవ మాది తత స్సర్వే సహితా స్తే నరాధిపాః
వాసుదేవవచః శ్రుత్వా చేదిరాజం వ్యగర్హయన్ ౧౭

(ఈ సమగ్రరాజమండలమందు గావించిన యీ వ్యతిక్రమ ముసు సహింపఁజాలను. ఈమూఢుఁడు రుక్మిణిని కోరెను, శూద్రుఁడు

వేదశ్రుతినిపోలె వీఁడామెను పడయలేదు—వాసుదేవుఁడిట్లుపలుకగా నరాధిపులు చేదిరాజును గర్హించిరి.

యాదవ శత్రువగు శిశుపాలుని దుర్నీతినంతయు వాసుదేవుఁడు రాజమండలమందు వ్యక్తీకరింపఁగా శిశుపాలుఁడు పెద్ద నవ్వు నవ్వి యిట్లు పలికెను. ‘కృష్ణ మత్పూర్వయగు రుక్మిణిని గూర్చి సంపత్తునందుఁగీర్తించు నీవు విశేషించి రాజసమాగమమం దెట్లు సిగ్గు నొందకున్నావు. అన్య పూర్వయగు స్త్రీని గూర్చి యిట్లు కీర్తించువాఁడు నీవుగాక యెవఁడు గావించును ? ’ అని శిశుపాలుఁడు పలికి చివరగా నిట్లనెను.

క్షమ నా యది తే శ్రద్ధా మావా కృష్ణ! మమ క్షమ
క్రుద్ధా ద్వాపి ప్రసన్నాద్వా కిం మే త్వత్తో భవిష్యతి ౨౧

‘కృష్ణా నీకు ఓర్పున్ననేమి లేకున్ననేమి. క్రుద్ధుఁడవైన నేమి, ప్రసన్నుడనైననేమి? నీవలన నాకగునది యేమి గలదు ’ అని శిశుపాలుఁడు పలికెను.

తథా బ్రువత ఏ వాస్య భగవాన్ మధుసూదనః
మనసా చింతయ చ్చక్రం దైత్యగర్వ నిషూదనమ్ ౨౨

ఏతస్మి న్నేవ కాలేతు చక్రే హస్త గతే సతి
ఉవాచ భగవా నుచ్చై ర్వాక్యం వాక్యవిశారదః ౨౩

శృణ్వంతు మే మహీపాలా యే నైతత్ క్షమితం మయా
అపరాధశతం క్షామ్యం మాతు రస్యైవ యాచనే ౨౪

దత్తం మయా యాచితంచ తద్దైవ పూర్ణంహి పార్థివాః
అధునా వధయిష్యామి పశ్యంతాంవో మహీక్షితామ్ ౨౫

ఏవ ముక్త్వా యదుశ్రేష్ఠ శ్చేది రాజస్య తత్ క్షణాత్
వ్యపాహరత్ శిరః క్రుద్ధ శ్చక్రే ణామిత్రకర్షణః ౨౬

స పపాత మహాబాహు ర్వజ్రా హత ఇవాచలః
తత శ్చేది పతే ర్దేహా త్తేజోఽగ్ర్యం దదృశు ర్నృపాః ౨౭

ఉత్పతంతం మహారాజ గగనా దివ భాస్కరం ౨౮

తతః కమల పత్రాక్షం కృష్ణం లోక నమస్కృతం
న వందే త త్తదా తేజో నివేశచ నరాధిప! ౨౮

త దద్భుత మమన్యంత దృష్ట్వా స ర్వే మహీక్షితః
య ద్వివేశ మహాబాహుం త త్తేజః పురుషోత్తమమ్ ౨౯

అనభ్రే ప్రవవర్ష ద్యౌః పపాత జ్వలితాశనిః
కృష్ణేన సహితే చైద్యే చ చాలచ వసుంధరా ౩౦

తతః కేచి న్మహీపాలా నాబ్రువం స్తత్ర కించన
అతీత వాక్పథే కాలే ప్రేక్షమాణా జనార్దనమ్ ౩౧

హస్తై ర్హస్తాగ్ర మపరే ప్రత్యపింశ న్న మర్షితాః
అపరే దశనై రోష్ఠా నదశన్ క్రోధమూర్ఛితాః ౩౨

రహశ్చ కేచి ద్వార్ష్ణేయం ప్రశశంసు ర్నరాధిపాః
కేచి దేవ సుసంరబ్ధా మధ్యస్థా స్త్వపరేఽభవన్ ౩౩

( శిశుపాలుఁ డిట్లు పలుకుచుండగా మధుసూదనుఁడు దైత్య గర్వ నిషూదనమగు చక్రమును మనసా చింతించెను. చక్రము హస్తగతముకాఁగా భగవాను ' డుచ్చైస్స్వరమున నిట్లు పలికెను.

" మహీపాలురు నా మాట వినవలసినది. వీని తల్లి యాచించిన ప్రకారము అపరాధశతము క్షమించియుంటిని. రాజులారా! అది నిండినది. మీరలు మహీపాలురు చూచుచుండఁగా వీని నిపుడు వధించెదను! యదుశ్రేష్ఠుఁడిట్లు పలికి క్రుద్ధుఁడై చక్రమున శిశుపాలుని శిరమును ఖండించెను. వజ్రాహతమగు నచలమట్లు వాఁడు పడిపోయెను. అపుడు శిశుపాలుని దేహము నుండి గొప్ప తేజ మెగసినది నృపులు దిలకించిరి. కమలపత్రాక్షుఁడగు కృష్ణునకు - యాలోక నమస్కృతునకు నమస్కరించి యా తేజ మాతనియందు ప్రవేశించినది. పురుషోత్తమునందు ( ప్రవేశించిన యా తేజమునుచూచి రాజు లది యద్భుతమని తలపోసిరి. కృష్ణునిలో దైద్యుఁడు చేరఁగా అనభ్రముగా నాకాశము వర్షించెను, జ్వలితాశనిపడెను, వసుంధర చలించెను. ఆ యతీతవాక్పథ కాలమందు జనార్దనుని జూచుచు రాజు లేమియుఁ బలుకని వారలయిరి. కొందఱు చేతులు పిసికికొనిరి, కొందఱుపళ్లు పట పట కొఱికిరి. నరాధిపులు కొందఱు వార్ష్ణేయునిఁ బ్రశంసించిరి. కొందఱు సంరబ్ధులయిరి. మిగిలినవారు మధ్యస్థులయిరి. ఓర్వలేనివారు, క్రోధమూర్ఛితులగువారు శిశుపాల పక్షస్థులగు రాజుల పరిస్థితి యట్లేర్పడినది. )

కృష్ణుఁడు మనసా స్మరింపఁగా దైత్య గర్వ నిషూదనమగు చక్ర మాతని హస్తమందు నిలిచెను. సర్వ రాజమండల మకుటాయమానుఁడైయున్న కృష్ణుఁడున్న చోటునుండే శిశుపాలుని వధించి రాజసూయ మహాధ్వ రావ భృథమునుఁ గావించినాడు. జరాసంధుని, జరాసంధుని సేనానాయకుని శిశుపాలుని కృష్ణపాండవులు తుదముట్టించి తత్ప్రతి నిక్షేప మాచరించిరి. శిశుపాలుని కాయ మక్కడ కొండవలె పడిపోయెను. శిశుపాలుని దేహము

నుండి తేజము పైకి వచ్చి కృష్ణునకు నమస్కరించి యాతనియందుఁ బ్రవేశించెను. రాజు లెల్ల టిది మహాద్భుత మని తలంచిరి. నారదుఁడాదినే యిట్లుగా నిర్ణయించియున్నాఁడు.

అహో బత సముద్భూతం స్వయం భూ ర్యదిదం స్వయం
ఆదాస్యతి పునః క్షత్ర మేవం బల సమన్వితమ్ ౩౬-౧౮

ఇత్యేతాం నారద శ్చింతాం చింతయామాస సర్వవిత్ ౨౧

స్వయంభువుఁడగు హరి—నారాయణుఁడు కృష్ణుఁడుగా నవతరించినాఁడు. బలసమన్వితమైన క్షత్రము నెల్ల నాకర్షించుచున్నాఁడు ( ఆదాస్యతి పునః క్షత్రం ) అని నారదుఁడు నిశ్చయించెను.

తత్కాల విశ్వరూప సందర్శనమున నర్జునుండు దుర్యోధనాదులు, భీష్మాదులు, సకల రాజులు కృష్ణునందు బ్రవేశించుచుండుటను గాంచెను. అపుడు కృష్ణుఁడిట్లు పలికెను

కాలోఽస్మి లోకక్షయ కృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహ ప్రవృత్తః
ఋతేఽపి త్వాన భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥ భగవద్గీత.
( ౧౧అధ్యా-౩౨శ్లోక )

(నేను కాలుండను, లోకక్షయార్థము ప్రవృద్ధునైతిని లోకముల సంహరింపఁబ్రవర్తించెదను. నీవు మినహా ఉభయ పక్షములందింక మిగులువా రెవ్వరును లేరు.)

రాజసూయము లోకక్షయకారకమై తత్పర్యవసానముగా లోకక్షేమకారక మగుచున్నదని ఫలితము.

ప్రహృష్టాః కేశవం జగ్మ స్సంస్తువంతో మహర్షయః
బ్రాహ్మణాశ్చ మహాత్మానః పార్థివాశ్చ మహాబలాః ౨౫-౩౮

(కృష్ణ పరాక్రమమునుచూచి మహర్షులు ప్రస్తుతిగావించిరి. మహాత్ములగు బ్రాహ్మణులు, మహాబలురగు పార్థివులు సంస్తుతి గావించిరి. అందఱును కృష్ణవిక్రమమును ప్రశంసించిరి.)

ధర్మజునానతి ప్రకారము పాండవులు శిశుపాలునకు దహన సంస్కారమాచరింపఁజేసిరి. ధర్మరాజు శిశుపాల పుత్రుని చేది దేశ మునకు పట్టాభిషిక్తుని గావించెను.

తతస్స కురురాజస్య క్రతు స్సర్వ సమృద్ధిమాన్
యూనాం ప్రీతికరో రాజన్ స బభౌ విపులౌజసః ౩౭

శాంతవిఘ్న స్సుఖారంభః ప్రభూతధన ధాన్యవాన్
అన్నవాన్ బహుభక్ష్యశ్చ కేశవేన సురక్షితః ౩౯

సమాపయామాసచ తం రాజసూయం మహాక్రతుమ్ ౪౦

తంతు యజ్ఞం మహాబాహు రాసమాప్తే ర్జనార్దనః
రరక్ష భగవాన్ శౌరిః శార్ఙ్గ చక్రగదాధరః ౪౧

(కురురాజ రాజసూయము సర్వసమృద్ధిగాఁ గొనసాగినది. శాంతవిఘ్నము, సుఖారంభము, ప్రభూత ధనధాన్యమునైనది. స్వష్టకృతుగా భోజనముగల్గించినది. కృష్ణరక్షితమైన రాజసూయము నిట్లు ధర్మరాజు సమాప్తమొందించెను సమాప్తమగు పర్యంతము కృష్ణుఁడు శార్ఙ్గ చక్రగదాధరుఁడై యాయజ్ఞమును రక్షించెను.)

కృష్ణుఁడు చతుర్భుజుఁడని తెలియవలయును. కృష్ణరక్షితుఁడైన ధర్మరాజు అవభృథస్నాన మాచరించెను. రాజులందఱు ధర్మజుని యొద్ద సెలవుఁగైకొని వారివారి రాష్ట్రములకు వెడలిపోయిరి. విరాటుని దృష్టద్యుమ్నుఁడు, ద్రుపదుని అర్జునుఁడు, భీష్ముని ధృతరాష్ట్రుని భీమసేనుఁడు, ద్రోణాశ్వత్థామలను సహదేవుఁడు, సుబలుని నకులుఁడు, పార్వతీయులను ద్రౌపదేయులు, సౌభద్రుఁడు దిగఁబెట్టిరి.

కౌరవరాజ్యమంతయు పాండవులది. పాంచాలదేశ మంతయు ద్రుపదునిది. చిత్రముగా కురురాజ్యమం దర్ధభాగము ధృతరాష్ట్రునందు వర్తించినది. పాంచాల దేశమం దర్ధ భాగము ద్రోణునందు వర్తించినది. ద్రోణున కిపుడు రాజ మర్యాద గావింపఁబడినది. ( భీష్మంచ ధృతరాష్ట్రంచ భీమసేనో మహాబలః ద్రోణంతుససుతం వీరం సహదేవో యుధాం పతిః .) పాండవులు రాజుల నొక్కొక్కరిని ఒక్కొక్కరనుసరించి సాగనంపియున్నారు.

వాసుదేవః :-

ఆ పృచ్ఛే త్వాం గమిష్యామి ద్వారకాం కురునందన !
రాజసూయం క్రతుశ్రేష్ఠం దిష్ట్యా త్వం ప్రాప్తవా నసి ౫౪

తము వాచైవ ముక్తస్తు ధర్మరాజో జనార్దనమ్
తవ ప్రసాదా ద్గోవింద ప్రాప్తః క్రతువరో మయా ౫౫

క్షత్రం సమగ్రమపిచ త్వత్ప్రసాదా ద్వశే స్థితం
ఉపదాయ బలిం ముఖ్యం మా మేవ సము పస్థితమ్ ౫౬

కథం త్వ ద్గమనార్థం మే వాణీ వితర తేఽనఘ
నహ్యహం త్వా మృతే వీర రతిం ప్రాప్స్యామి కర్హిచిత్ ౫౭

అవశ్యం చైవ గంతవ్యా భవతా ద్వారకాపురీ ౫౮

ఏవముక్త స్స ధర్మాత్మా యుధిష్ఠిర సహాయవాన్
అభిగ మ్యాబ్రవీ త్ప్రీతః పృథాం పృథుయశా హరిః ౫౯

సామ్రాజ్యం సమను ప్రాప్తాః పుత్రాస్తేఽద్యపితృష్వ సః
సిద్ధార్థా వసుమంతశ్చ సాత్వం ప్రీతి మవాప్నుహి ౬౦

అనుజ్ఞాత స్త్వయా చాహం ద్వారకాం గంతు ముత్సహే
సుభద్రాం ద్రౌపదీం చైవ సభాజయత కేశవః ౬౧

నిష్క్రమ్యాంతఃపురా త్తస్మా ద్యుధిష్ఠిర సహాయవాన్
స్నాతశ్చ కృతజప్యశ్చ బ్రాహ్మణాన్ స్వస్తి వాచ్యచ ౬౨

తతో మేఘవపుః ప్రఖ్యం స్యందనంచ సుకల్పితం
యోజయిత్వా మహాబాహు ర్దారుక స్సముప స్థితః ౬౩

ఉపస్థితం రథం దృష్ట్వా తార్క్ష్యం ప్రవర కేతనం
ప్రదక్షిణ ముపా వృత్య సమారుహ్య మహామనాః ౬౪

ప్రయయౌ పుండరీకాక్ష స్తతో ద్వారవతీం పురీమ్ ౬౫

తం పద్భ్యా మనువవ్రాజ ధర్మరాజో యుధిష్ఠిరః
భ్రాతృభి స్సహితః శ్రీమాన్ వాసుదేవం మహాబలమ్ ౬౬

తతో ముహూర్తం సంగృహ్య స్యందన ప్రవరం హరిః
అబ్రవీ త్పుండరీకాక్షః కుంతీ పుత్రం యుధిష్ఠిరమ్ ౬౭

అప్రమత్తః స్థితో నిత్యం ప్రజాః పాహి విశాంపతే
పర్జన్య మివ భూతాని మహాద్రుమం మివ ద్విజాః ౬౮

బాంధవాః స్తోపజీవంత్తు సహస్రాక్ష మివామరాః॥ ౬౯

కృత్వా పరస్పరేణైవ సంవిదం కృష్ణ పాండవౌ
అన్యోన్య మనుజ్ఞాప్య జగ్మతు స్స్వగృహాన్ ప్రతి ౭౦

(రాజులు, బ్రాహ్మణులు వెడలిపోయినపిమ్మట వాసుదేవుఁడు యుధిష్ఠిరునితో నిట్లు పలికెను. "ద్వారకకు వెడలెదను. దైవాను గ్రహమున క్రతుశ్రేష్ఠమగు రాజసూయమును బొందితివి" అని పలికెను. ఇది విని ధర్మరాజిట్లు పలికెను. "గోవింద! నీ ప్రసాదమున క్రతువరము నాచే బ్రాప్తమైనది. నీ ప్రసాదమున రాజమండల మెల్ల వశస్థితమైనది. వెళ్ళవచ్చును—అనుమాట నానోట నెటుల వెలువడ గలదు? నీవు లేనిచో నేనెందును రతినొందువాఁడను కాను. అయినను నీవవశ్యము ద్వారకకు వెళ్ళవలయును కదా!" అనెను. పిమ్మట కృష్ణుఁడు కుంతియొద్దకుఁబోయి యిట్లు పలికెను. అత్తా! నీ పుత్రులు సామ్రాజ్యమొందిరి. సిద్ధార్థులు, వసుమంతులునైరి. నాకు సెలవొసంగుము, ద్వారకకుఁ బోయెదను.' అని పలికెను. పిమ్మట కృష్ణుఁడు సుభద్రతోను, ద్రౌపదితోను, పోయివచ్చెదనని పలికెను. కృష్ణుఁడంతఃపురమునుండి వచ్చి, స్నానమాచరించి, జపమొనరించెను. బ్రాహ్మణులు స్వస్తివాచనము పలికిరి. దారుకుఁడు రథము నాయత్తము గావించెను. తార్క్ష్యకేతనమగు నాదివ్య రథమునకుఁ బ్రదక్షిణ మాచరించి కృష్ణుఁడు ద్వారకకు బ్రయాణ మాయెను. ధర్మరాజు — యుధిష్ఠిరుఁడు పాదచారియై భ్రాతృ సహితుఁడగుచుఁ గృష్ణునను సరించిపోయెను. అప్పుడు కృష్ణుఁడు ధర్మజునితో నిట్లు పలికెను "అప్రమత్తస్థితుఁడవై నిత్యము ప్రజలను

కాపాడుము. భూతములు. పర్జన్యుని. పక్షులు మహేంద్రుని నాశ్రయించినట్లు, బంధువులెల్లరు నిన్నాశ్రయింతురుగాక !" అని పలికెను. ఇట్లుగా కృష్ణుడు ధర్మరాజు వీడ్కోలునందు ప్రసంగించి వారి వారి నెలవులకు గూర్చి వెడలిపోయిరి.

ఈ సందర్భమున నీ విషయము గమనింపవలెను. సభాపర్వారంభమందును కృష్ణుని వీడ్కోలు గలదు. అదిట్లు గలదు

నివృత్య ధర్మరాజస్తు సహభ్రాతృభి రచ్యుతః
సహృత్పరివృతో రాజా ప్రవివేశ పురోత్తమమ్ ౨-౩౨

విసృజ్య సుహృద స్సర్వాన్ భ్రాతౄన్ పుత్రాంశ్చ ధర్మరాట్
ముమోద పురుషవ్యాఘ్రో ద్రౌపద్యా సహితో నృప! ౩౩

కేశవోపి ముదాయుక్తః ప్రవివేశ పురోత్తమం
పూజ్యమానో యదుశ్రేష్ఠై రుగ్రసేనముఖై స్తథా ౩౪

ఆహుకం పితరం వృద్ధం మాతరంచ యశస్వినీం
అభివాద్య బలం చైవ స్థితః కమలలోచనః ౩౫

ప్రద్యుమ్న సాంబ నిశఠాం శ్చారుదేష్ణం గదం తథా
అనిరుద్ధంచ భానుంచ పరిష్వజ్య జనార్దనః ౩౬

స వృద్ధై రభ్యనుజ్ఞాతో రుక్మిణ్యా భవనం యయౌ ౩౭

(కృష్ణుని సాగనంపి ధర్మరాజు తమ్ములతోడ, సుహృదులతోడ పురమును ప్రవేశించెను. సుహృదులను, భ్రాతలను, పుత్రులను విడిచి యంతః పురమునకుఁబోయి ధర్మరాజు ద్రౌపదితో ముదమొందెను. కృష్ణుఁడును ద్వారకకుఁబోయెను. యదుశ్రేష్ఠులచేఁ బూజింపఁబడెను. ప్రద్యుమ్న సాంబాదులను పరిష్వంగ మొనరించుకొనెను. పిమ్మట కృష్ణుఁడు వృద్ధులయనుమతినొంది రుక్మిణీ భవనమునకుఁ బోయెను.

కృష్ణ పాండవ ( జగద్రక్షకుని, జగత్పాలకుని ) విహార విశేషసార మిందుగలదు. రాజసూయము జరిగిన పిమ్మటి పరిస్థితి అందోళనకరమైనది. కృష్ణ పాండవులా యాపదల దలగడచి శాంతి నొందు వారగుదురని యిందువలన గమనింపవలెను.



---

శ్రీ లక్ష్మీ నరసింహా ప్రెస్,
సత్యనారాయణపేట్,
బళ్ళారి.

